ఆంధ్రరాష్ట్ర చేనేత సంఘ ప్రచురణ — 7.

# చేనేత దర్పణం

రచయిత:


శ్రీ పుత్సల సత్యనారాయణ, యం. యల్. ఎ.,

ఉపాధ్యక్షులు: ఆంధ్ర రాష్ట్ర చేనేత సంఘం.





ప్రకాశకులు:

విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ.

# చేనేతవారి గోడు

మూలం: హైన్‌రిచ్ హీనే 1797-1856.

అనువాదం: శ్రీ ఉప్పల లక్ష్మణరావు.

[జర్మనీలో సైలీషియా రాష్ట్రంలో దీర్ఘకాల నిరుద్యోగాన్ని, దుర్భరస్థితిని సహించలేక ప్రభుత్వంపై తిరగబడ్డారు. సైన్యాన్ని పంపి హత్యాకాండతో ప్రభుత్వం దీన్ని అణచివేసింది. హైనే మార్క్సుకు, ఏంజిల్సుకు స్నేహితుడు.]

ధుమధుమలాడే కన్నులలో యేడ్చుటకే తడిలేదు
మగ్గముకాడ కూలబడి పటపట పండ్లను కొరుకుచు శోకం:
ఓ జర్మనీ! కన్నతల్లీ! నీ చితిపై పరచే దుప్పటినే నేస్తున్నాం
పడుగుతో పేకతో ముమ్మాటికి మా శాపముతో పోగులు ముడిపెట్టుచు
మేం నేస్తున్నాం! మగ్గం మేం నేస్తున్నాం!

దేవుడికే మా శాపం! గంపెడు ఆశతో పూజలుచేశాం
చలికాలపు మంచులో కలికాలము ఆకలిమంటలతో వస్తున్నాం
నీ సేవలుచేసి నీ చలువను అర్థించాం-ముడుపులుపెట్టి ప్రార్థించాం
మా యేడ్పులు నీ కెగతాళి - మా రోదన నీ కానందం - మా వెతలే
నీకు వినోదం
మేం నేస్తున్నాం! మగ్గం మేం నేస్తున్నాం!

రాజుకె మా శాపం! ధనికుల రక్షించే రాజుకె మా ఉసురు
మోజుంటె పేదలపై ఒకరోజులో తీరును మా దరిద్రం
జాలేలేదు - పైగా పిండును మా ఆఖరి పైసను
నీ సిపాయీల తుపాకులకే కుక్కలవలె మేం చస్తున్నాం

మేం నేస్తున్నాం! మగ్గం మేం నేస్తున్నాం!

మా కుత్తుక నులిమిన మాతృభూమి! నీకే మా శాపం!
దోపిడి దుర్మార్గం - వీటికె నీ కరుణ కటాక్షం!
పూయవు పూవులు ప్రతిమొగ్గయు మాడును - అకాల మరణం
నీ మట్టిలొ కళ్లలొ చీడలు పురుగులకే తరుణం

మేం నేస్తున్నాం! మగ్గం మేం నేస్తున్నాం!

కండెల పరుగుల కంతారావం - మగ్గం మడుపుల హోహోరావం
కండలు కరుగుచు రాత్రులు పగళులు ఓర్పుతొ నేస్తున్నాం
ఓ జర్మనీ! ముదుసలితల్లీ! నీ కాటికి గుడ్డను నేస్తున్నాం
పడుగులు తోడుచు పుంజంతడుపుచు మా శాపంతో అతుకుచు

మేం నేస్తున్నాం! మగ్గం మేం నేస్తున్నాం!

# తొలిపలుకు.

శ్రమజీవుల సమస్యలమీద పనిచేసే ప్రజా సేవకులు ఆంధ్ర ప్రదేశ్‌లో అనేకులున్నారు. వ్యవసాయం తరువాత చేనేత అధిక జనులకు మన దేశంలో నేటికీ ఉపాధి చేమగ్గం లేని గ్రామం మన రాష్ట్రంలో దాదాపు లేదనే చెప్పాలి. కాని చేనేత సమస్యలు అర్థమవ్వడం చాలా కష్టమనిపించేటంత క్లిష్టంగా వుంటాయని, నేటి ప్రధాన సమస్యలమీద క్లుప్తంగా నైనా వివరణయిచ్చే ఒక గ్రంథం వుంటే బాగుండునని పలువురు ప్రజాసేవకులు అన్నారు.

ఆంధ్ర రాష్ట్ర చేనేత సంఘ కార్యకర్తల సమావేశంలో రెండవ పంచవర్ష ప్రణాళిక, అఖిలభారత చేనేతబోర్డు విధానములు, కార్యకలాపములు, చేనేత సమస్యలు చర్చించబడినవి. విషయం లోతుపాతులు తరిచేక వివిధ జిల్లాలలో చేనేత కార్యకర్తలకు పదేసి రోజులు క్లాసులు (తరగతులు) పెట్టాలనే ప్రతిపాదనొకటి వచ్చింది. సూచనలోని సాధకబాధకాలు చర్చించి అప్పటికది విరమించుకొని, ప్రత్యామ్నాయంగా క్లాసులు ద్వారా చెప్పవలసివున్న హంశములపై ఒక గ్రంథం ప్రచురించాలని తీర్మానం చేయబడింది.

పై రెండు విషయములు దృష్టిలో పెట్టుకొని యీ పుస్తకం తయారు చేయమని ఆం॥ రా॥ చే॥ సం॥ ఉపాధ్యక్షు

మైన శ్రీ పుత్సల సత్యనారాయణ, యం. యల్. ఏ. గారిని ఆ సమావేశం ఆదేశించింది.

ఆ ప్రకారం తయారు చేసిన యీ పుస్తకంలో చాలా భాగం 1956 జూలై నాటికే పూర్తి అయినప్పటికి ఆర్థికము, ప్రింటింగు మొదలైన చిక్కులవల్ల ప్రకటించడంలో ఆలస్య మైనది.

పుస్తకరూపంలో యింత సమగ్రంగా తెలుగులో ఒక టివ రెండవ ప్రణాళికల కాలములలో యింతవరకు ప్రకటించబడిన దివాకర్ కమిటీ చేనేత సమస్యలపట్ల అభిమానము, అవసరము గల ఆంధ్ర మహాజనులంతా దీనిపట్ల ఆదరము చూపగలరని విశ్వశిస్తున్నాను.

కృష్ణాజిల్లా
పెడన
25—1—58.

ఇట్లు,
మెట్ల వీరయ్య
ఆం॥ రా॥ చే॥ సంఘ అధ్యక్షుడు.

# విషయ సూచిక



# పీఠిక



## 1. మగ్గం పుట్టుక.

చారిత్రక పరిశోధకులకు ఇంతవరకు లభించిన వివిధ నిదర్శనము లనుబట్టి భారతదేశానికి ఏదో ఆదిమయుగంనుండి రకరకాలైన మానవ జాతులు ఆరు తరంగములుగా వచ్చినట్టు కొందరు చెబుతున్నారు. 1953 అక్టోబరులో అహమ్మదాబాద్‌లో జరిగిన ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు అధ్యక్షులు డాక్టరు • సునీతికుమార్ ఛటర్జీగారు ప్రత్తి-నూలు-మగ్గం అనేవి ఆ యారింటిలోను రెండవ తరంగంగా వచ్చిన "ఆస్ట్రిక్" జాతి వారు మనదేశంలో ప్రవేశ పెట్టినట్టు చెప్పేరు. *

మొదట నెగ్రోయిడ్ జాతి ఆఫ్రికానుండి అరేబియా, ఇరాన్, మీదుగా వచ్చేరు. మొరటు రాతి పరికరాలకన్న అభివృద్ధిచెందిన "చెకుముకి రాతి పరికరా" ల నాగరికత వీరిది. వారిలోనే కొందరు ఇటు అండమాన్, మలయా, ఇండోనీషియా పోయేరు. తరువాత వచ్చిన జాతులవల్ల వీరు చాలావరకు చంపివేయబడ్డారు. అల్పమైన అవశేషం అస్సాంకొండల్లో నాగజాతిలో ఒక తెగ. దక్షిణాన తమిళమును పోలిన కొండభాష మాట్లాడే కొందరాటవికులు మిగిలేరు.

రెండవ వారు పేలస్టయిన్ నుండి వచ్చిన ఆస్ట్రిక్ జాతివారు. ఇక్కడ చాలాకాలంవుండి భాషను సంస్కారాన్ని అభివృద్ధిపర్చుకున్నారు. కొందరిక్కడినుండి ఆస్ట్రేలియాపోయి అక్కడ ఆటవికులుగా పరిగణింప బడుతున్నారు. వీరు కలుపుగోలుతనంవల్ల తరువాత అనేక మిశ్రమ జాతు

---

• పశ్చిమబెంగాల్ శాసనసభాధక్షులు, కలకత్తా విశ్వవిద్యాలయ చరిత్ర శాఖాధిపతి.

* ఇన్‌కస్ : సంపుటి ఒకటి, సంచిక ఒకటి.

లుగా యిక్కడ రూపాంతరం పొందేరు. "నాగలితో వ్యవసాయం, కోళ్ళ పెంపకం, ఏనుగుల మచ్చిక, ప్రత్తి - నూలు - మగ్గం, పునర్జన్మ భావన - విశ్వాసం," ఇవి వీరి సంస్కారములో ప్రత్యేక లక్షణాలు. ఆటవికత తగ్గి గ్రామీణ లక్షణాలు బీజరూపంగా వీరితో ప్రారంభమైనాయి. ఆహారాన్ని పోగుచేసుకొనే బదులు పండించడం మొదలెట్టేరు.

మూడవ ప్రవేశకులు మంగ్లోయిడ్ జాతి. కిరాతతెగ వీరి సంతతే నట. బ్రహ్మపుత్రనది వెంబడి టిబెట్ గుండా చేరేరు. చిన్న కళ్లు, ఎత్తయిన దవుడయెముక. కొంచెం పసుపు పచ్చవర్ణం వీరి లక్షణములు. ఉత్తర భారతదేశంలో విశాల భూభాగాల్లో స్థిరనివాసస్తులుగా - సెటిల్ మెంట్సు - వుండడం ప్రత్యేకంగా వీరిలో కనిపించింది.

నాలుగవది ద్రవిడజాతి. తూర్పు మెడిటరేనియన్ ప్రాంతంనుండి విచ్చేసేరు. క్రీస్తుకు పూర్వం మూడువేల ఐదువందల సంవత్సరముల క్రితం అనగా ఇప్పటికి ఐదువేల ఐదువందల సంవత్సరముల క్రితం వచ్చినట్టు లెక్క కట్టడానికి నిదర్శనం దొరికింది. "మతము, పట్టణ నిర్మాణము, సాంఘిక రాజకీయ వ్యవస్థీకరణము." ఈ మూడింటికి వీరు అంకురార్పణ చేసేరు. త్రవ్వకాలలో కనుగొనబడిన సింధులో మొహంజదారోవద్ద, పంజాబులో హరప్పవద్ద నగరాలు వీరి నిర్మాణమే. కాని మరొక ద్రవిడ మొరటు జాతి వచ్చి వీరిని చాలావరకు నాశనం చేసింది.

అయిదవ తెగ వైదిక్ ఆర్యులు. దాదాపు వీరొక క్రూరమైన సంచార తెగలని ఛటర్జీగారి అభిప్రాయం. పాతవారందరినీ ఓడించి క్రీస్తుకు పూర్వం పదిహేడువందల సంవత్సరముల క్రితం ఆక్రమించుకొన్నారు. అన్నిటికన్నా విస్తృతంగా వ్యాపించిన ద్రవిడభాష ఇక సన్నగిలింది.

ఆఖరున క్రీ॥ పూ॥ పదకొండువందల సంవత్సరముల క్రితం - ఆరవ తరంగంగా - వచ్చినవారు ఆర్యులలోనే మరొకతెగ. గుఱ్ఱమును, ఇనుమును, యుద్ధములో ఉపయోగించడం వీరి ఆధిక్యతకు కారణం. వేద

భాషను అనేక భాషలకు తల్లిగాగల యోగ్యతను సమకూరుస్తూ 'సంస్కృత.' భాషగా రూపొందించిన ఘనులు. డైరెక్టర్ ఆఫ్ ఆంత్రోపోలోజికల్ సర్వే ఆఫ్ ఇండియా, డాక్టర్ బి. యస్. గుహ "జనాభాలో జాతుల మూలములు" (Racial Elements in the Population) అనే గ్రంథంలో గూడా యీ తరంగాల వాదన చేసేరు.

వేదకాలంలో మగ్గం వుండేదని అంటూ అపుడే మగ్గం పుట్టిందని స్ఫురింపజేస్తూ కొందరు రచయితలదివరకు వ్రాసేరు. కాని 1921 లో మొహంజదారో - త్రవ్వకం - కనుపించి, ఆర్యులకు పూర్వుల సంస్కారం, నాగరికత, అంచనా వేయడానికి సాక్ష్యం దొరికిన తరువాత పాతనిర్ణయాలు తీవ్రంగా సవరించవలసివచ్చినది. నేటికి, వేదాలకు మధ్యనున్న కాలం కన్న హెచ్చుకాలమే వేదాలకు, మగ్గం వుత్పత్తికి మధ్య వుండ వచ్చునేమో అనిపిస్తున్నది. జాతులమధ్య ఇచ్చి పుచ్చుకోడం నిరంతరం జరుగుతూ, నాగరికత నిత్య నూతనరూపాలు దాలుస్తూనేవుంది. ఒక జాతి నాగరికతలో కొన్ని భాగాలు కాలక్రమేణా అంతరించిపోయినా మరి కొన్ని భాగాలు, భాష, పనిముట్లు కొత్త చారిత్రకదశలో గూడ కొనసాగుతూనే వస్తున్నాయి. మొహంజదారో త్రవ్వకంలో కనుపించిన నగరం ఋగ్వేదకాలానికి పూర్వం రెండువేల సంవత్సరములనాటిదని అందరు అంగీకరిస్తున్నారు. ఆ నగరంలో దొరికిన పురాతత్వ వస్తువులగురించి ఇండియాప్రభుత్వం ప్రకటించినగ్రంథం-"Mohonjedaro between 1927–31" పుట 431 లో పనిముట్ల వర్గంలో నె 55 రు గలది ఎముకతో చేయబడిన ఒక నేతపలక అని నిర్ధారణ చేయబడింది. కొన్ని వెండి, రాగి వస్తువుల మడతలమధ్యనున్న నుసి పరిశీలించగా గుడ్డముక్కలని తేలింది. ఇండియన్ సెంట్రల్ కాటన్‌కమిటీ, టెక్నలాజికల్ బులెటిన్ నెం 3 రు సీరీస్ 'బి' 1928 సం॥ ప్రచురణలో యీ త్రవ్వకాలలో దొరికిన గుడ్డముక్కలగురించి ప్రస్తావించేరు. ఒకముక్క 34 నెంబరు నూలు,

ఇంచికి 60 పోగులు పడుగు, 20 పోగులు పేక కొన్ని జములు పోగుల ముక్కలు కనిపించినవి.

వస్త్రభావంకన్న నేతభావం ముందుగా పుట్టింది. క్షేత్రగణిత (జియో మెట్రిక్) నేత బుట్టలల్లికగా ప్రారంభమై క్రమంగా వస్త్రంలోకి వచ్చింది. నేతవస్త్రముకు పూర్వమే ఆభరణీకరణ, రంగులద్దకం, గుడ్డలల్లిక ఉండేవి. నేటికీ బోర్నియో అడవులలో కోయవారు నారగుడ్డ చిక్కములు మగ్గం లేకండా అల్లి కట్టుకుంటున్నారు. అట్లే ఉత్తర కెనడాలో ఇండియను లనబడేవారు కుందేటి వెంట్రుకలతో చారల కంబళ్ల చేసుకుంటున్నారు.

మెడిటరేనియన్ రంగునార ప్రాంతంలో నారపోగుల పడుగు పైనుండి క్రిందకు రాళ్ళతో వ్రేలాడగట్టి పేకపోగులు నేస్తారు. ప్రత్తిశిల్పు లభించే ప్రాంతాల్లో పడుగును నేలమీద పరచివేస్తారు. ఈ రెండే ఆదిమగ్గా లలో రకాలు.

## 2. గ్రామ స్వయంపోషకత్వం.

మగ్గం పుట్టి, పెరగడం ప్రాచీన భారతదేశంలో సమాజవ్యవస్థ గ్రామ స్వయంపోషక సూత్రానికి పరిమితమైనపుడే జరిగిందని మరికొందరి అభిప్రాయము. కాని కొత్తసాక్ష్యము దానికి భిన్నముగా వున్నది. మొహం జదారో వద్ద త్రవ్వకం దొరికిన తర్వాత ఇండస్ లోయ నాగరికతకు సంబంధించిన అలాంటి చిహ్నముల కోసం వెతగ్గా అక్కడక్కడ ఉత్త రాన మరికొన్ని లభించినవి. నగరం లేక పట్టణ సాంప్రదాయం తగినంతగా విస్తరించినట్లు తేలినది. జీవనానికి కావలసిన సకల వస్తువులు వ్యాపార రీత్యా అక్కడకు, అక్కడనుండి మెసపటోమియా వరకు రవాణా జరి గేది. హరప్ప మొదలైన పట్టణాలలో అద్దకపు పరిశ్రమ వున్నట్టు సూచన లున్నాయి గాని వస్త్రోత్పత్తి పట్టణాల్లో తక్కువే అని తేల్చేరు. అనగా గ్రామ స్వయంపోషకత్వం మారిపోతూందని అర్థం. ఆ కాలంలోనే దేశంలో మరికొన్నిచోట్ల యీ నాగరికత ఇట్టి రాజ్యాంగము యింకా ఏర్పడక

స్వయంపోషక పద్ధతిలో గ్రామాలు గూడ వున్నమాట నిజమే. వరదలు, కరువులు, దాడులు, నదులకోత ఇత్యాది సమాజ సంహారకములు దాపురించినపుడు రక్షణ జ్ఞానములేని పూర్వయుగములలో అధికంగా హరించి పోవడం అల్పముగా మిగలడము జరిగేది.

## 3. నేత కులముల పుట్టుక.

పైనచెప్పిన తరంగములలో రెండవదైన ఆస్ట్రిక్ జాతి యీ మగ్గానికి ఆరంభకులు. వారున్ను, తరువాత వచ్చిన మంగోయిడ్ జాతివారున్ను కులవర్గవిధానములేని ఆదిమ సమాజములు. ఆ తరువాతకాలంలో ద్రవిడులు నగర నిర్మాణం చేసిన దశలో ద్వికుల - ద్వివర్గ - సమాజం రూపొందింది. ఓడింపబడినవారిని "దాసు" లనే కులంగా కేటాయించి, వారిచేత అదనపు ఉత్పత్తి చేయించుకుని నగర నిర్మాణం, నగర నివాసం సాధ్యపర్చుకొన్నారు. నేతవారపుడు చాలమంది దాసులలోనే వుండవచ్చును. ఆ వెంటనే వచ్చిన ఋగ్వేదదశలో గూడ ఆర్యులు, దాస్యులు - లేక శూద్రులు - అని రెండు వర్ణములుగా మాత్రమే సమాజ విభాగం కొనసాగింది. చాతుర్వర్ణ్య ప్రసక్తి ఋగ్వేదంలో లేనేలేదు. ఋగ్వేద సృష్టియైన ఇంద్రుని ఆర్య వర్ణము - తెలుపును కాపాడి, నల్లని వర్ణం గలవారిని తిరుగుబాటు చేసే అనార్యులను నాశనం చేయగలవారని వర్ణించేరు. రంగునుబట్టి అప్పటికి రెండే వర్గములు. చిట్టచివరి తరంగమైన ఆరవవారు ఆర్యులుగూడా "దాస" లేక "శూద్ర" విధానమే చాన్నాళ్లు అమలుపరిచేరు. యుద్ధం చేయవలసిన వారిని (క్షత్రియులు), మతమును నిలబెట్టగలవారిని (బ్రాహ్మణులు) కాయకష్టపు విధినుండి మినహాయించడానికి వీలైన దశ యీ దీర్ఘకాలపు అదనపు వుత్పత్తివల్ల యేర్పడి వుండవచ్చును.* బ్రాహ్మణ, క్షత్రియ యీ రెండు అంతర్విభాగములతో ఒక ముఠా యేర్పడి చాన్నాళ్ళకు తమ విధా

---

* డ్యాకోవ్ : డాంగేగారి ఆదిమ కమ్యూనిజమునుండి అన్న గ్రంథంమీద వ్యాఖ్య.

నముతో శూద్రులను శాశ్వతముగా తక్కువ స్థాయికి త్రోసివేయ గలిగేరు. ఆర్యులలో అప్పటికే అనేక మిశ్రమాలున్నాయి. వ్యవసాయం, చేతి పనులు, పశుపోషణ, వాణిజ్యం, యీ నాలుగు నిర్వర్తించడానికి వైశ్య కులాన్ని యేర్పరచేరు. ఆర్యవైశ్యులే ఎక్కువైనప్పటికి కొన్ని కొత్త విధుల ఏర్పాటువల్ల అనార్యులను కూడ వైశ్యులలో చేర్చక తప్పలేదు. ఈ దశలో కొందరు నేతపనివారికి గాయత్రి ధారణకు ఆర్యులలో పై మూడుకులాలతోపాటు అర్హత యివ్వబడింది.

పూర్వ ఆర్యులు క్రీ. పూ. 1700 సం. క్రితమున్ను, ఉత్తరార్యులు క్రీ. పూ. 1100 సం. క్రితమున్నూ, వచ్చినప్పటికీ క్రీ పూ 800 సం. నాడు మాత్రమే - అనగా యజుర్వేద కాలములో - చాతుర్వర్ణ్య విభాగం చేసుకోడానికి మరొక కారణమున్నది • కష్టకరము, మహామంచుప్రదము ఐన ఉత్తరమునుండి ఆర్యులు క్రమేణా తూర్పుకు వ్యాపిస్తూ వచ్చేరు. యెక్కువ వర్షపాతము, ఎక్కువ భూసారము గలిగిన మహా విశాలమైన గంగా పీఠభూమిని వాసయోగ్యంగా చేసుకుంటే అది స్వర్గమే అనుకున్నారు. దట్టమైన దీర్ఘమైన అడవిని నిరడవినిచేసి పల్లెలూ పట్టణాలు కట్టాలి. యీ బృహత్తర ప్రణాళిక రాజీద్వారా అనార్యులను కలుపుకోవడంవల్ల నెరవేరుతుందిగాని యుద్ధంవల్ల నెరవేరదు. వైశ్య (స్థిర నివాసంగల-) కులంలోనికి చాలామంది అనార్యులను కలుపుకోక తప్పలేదు. కొల్లలుకొల్లలుగా అనార్యులను శూద్ర (= సేవక) లలో చేర్చి ఆర్యమతం యిచ్చినది యీదశలోనే. పాతజాతులలో మిశ్రమమైయున్న నేతవారిలో కొందరికి ఆ మహోద్యమంలో కొన్నిచోట్ల మూడవ - వైశ్య - తరగతి (= గాయత్రి అర్హత-)దొరికింది. మిగతా వారికి నాలుగవ (= శూద్ర-) తరగతి దొరికింది.

---

• ఆచార్య కొసాంబిగారి "Introduction to the study of Indian History" 5 : 4.

కులమనే దానిని ఆశ్రయింపకుండానే నేత 3 వేల సం, పైగా నివశించి, తరువాత యిప్పటికి మరొక 2,800 సం.ల నుండి కులమును ఆశ్రయించుకొని - మొత్తం సుమారు 5.800 సం.లనుండీ - వస్తూవుంది. అడుగునవున్న కులములలో ఆర్యభాష మాట్లాడుతూ ఇండియా అంతా ఆస్ట్రిక్ జాతివారు కలసిపోయేరు. మధ్యరకం పొడవు, తప్పడిముక్కు-, పొడుగాటి శిరస్సు - అప్పట్లో నలుపురంగు - గల ఆస్ట్రిక్కులు తమ పేరు, తమభాష మరచిపోయి - ఆర్యజాతులతో విరివిగా మిశ్రమము అయినారు. ఈ చారిత్రక సత్యానికిన్ని, కులపరిమితులతో ప్రమేయం లేకుండా నేడు అస్సాంలో అందరూ మతరీత్యా మగ్గమును కలిగివుండడానికిన్ని రెంటికి సంబంధం వున్నదేమో ఎవరైనా శ్రమపడి పరిశీలించడం మంచిదే. ఇపుడు అస్సాంలో 175 భాషలు వున్నాయి. అనగా అనార్య తునకలు చాలా మిగిలేయి.

## 4. మగ్గము-మత దృష్టి-చారిత్రక దృష్టి.

ఫ్యాక్టరీలు వచ్చిన యీ కాలంలో పెట్టుబడిదారులు, కార్మికులు మొదలైనవారిని ఆర్థికసంబంధమైన వర్గములు అంటున్నాము. ఉత్పత్తి విధానము ఆదిమస్థాయిలో వున్న ఆనాడు, మన దేశంలో మత సంబంధమైన కులములన్నారు. * కాయకష్టం చేసేవాని అదనపు ఉత్పత్తికి కనీస నిర్బంధముతో అగ్రకులాలకు అందజేయగల మత విధానంతో కూడిన సాంఘిక చైతన్యం యీ కులం. • కుల - ఆచారము అనాది సర్వకాలి

---

* ప్రొ. కొసాంబి ; ఇస్కస్, సంపుటి ఒకటి, సంచిక ఒకటి.

• కానుంగో కమిటీకి సమర్పించిన 12 వ సమాధానములో 30 వ పేజీలో చేనేత కాంగ్రెస్‌వారు యీ వాదమే చేశారు. "ప్రభుత్వానికి నైతిక సాహసముంటే వస్త్రోత్పత్తి యావత్తు చేమగ్గాలకే విడిచిపెట్టి బట్టల మిల్లులు లేకుండా చేయవచ్చు. చిన్న ఒడుకు యంత్రాలు వచ్చేక నూలుమిల్లులుగూడ రద్దుచేయవచ్చును."

కము అని, మార్పు వుండబోదని, మార్పు పాపమని చాలకాలం మతము చెప్పడంవల్ల చరిత్రకు మనిషికి మధ్య కృత్రిమతెర ఏర్పడి పరిణామసత్యం మరుగై పోయింది.

చేమగ్గంపట్ల మనిషికున్న దృష్టిలో మూడు దశలు కనిపిస్తున్నాయి. ౧ చేమగ్గం మతమే: శాశ్వతము అన్ని ఆర్థికవాదాలకు అతీతమైనది. ౨. చేమగ్గం ఒక వుత్తమ ఆర్థిక వ్యవస్థకు అనివార్యం. అన్యవ్యవస్థలు అవాంఛితములు * ౩. చేమగ్గం యిప్పుడనివార్యం. రేపు అవసరం. యీ మూడింటిలో మొదటి వాదం సన్నగిలిపోయింది. రెండవ వాదం మన ప్లానింగ్ కమీషన్ తిరస్కరించింది. కాంగ్రెస్‌వారిలో గూడ సన్న గిలుతూవుంది. మూడవ వాదం ఇప్పుడిప్పుడే బలాన్ని పోసుకుంటూ వుంది. మన రెండవ పంచవర్ష ప్రణాళిక చిత్తు ముసాయిదాలో ఇది ప్రతిపాదింపబడింది చేమగ్గం యిప్పటికే అనవసరం అనే నాల్గవ వాదం కూడ అధికార, అనధికార వర్గాలలో కొంతవరకూ లేకపోలేదు. కాని యీ నాల్గవదృష్టి చేనేత వారిలో లేదనే చెప్పాలి.

పనిముట్లలో మార్పులు పరిణమించడం, వాటినిబట్టి వుత్పత్తి శక్తులలో మార్పులు, రావడం, వాటినిబట్టిసామాజిక వ్యవస్థలే మారిపోవడం గురించి శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన కారల్ మార్క్సు ( - జర్మన్ 1818_1883 -) అనన్యమైన పరిశీలన చేశాడు. దాని పర్యవసానాన్ని చారిత్రక — భౌతిక సిద్ధాంతంగా (Historical Materialism) రూపొందించేరు. యుగ యుగాలనుండి వస్తున్న మానవచరిత్ర అవగాహనలోని గందరగోళాన్ని తొలగించి చరిత్రకు శాస్త్ర హోదా ప్రసాదించేరు. ఆయనవాదంలోని సారాంశం క్లుప్తంగానూ గంభీ

* Preface to his own "Critique of Political Economy".

రంగాను ఒక పేరాలో కుదించి ఒక * పుస్తకం ఉపోద్ఘాతంలో వ్రాసిన దానికి స్వేచ్ఛానువాదం యీ దిగువను యివ్వబడింది.

సాంఘికోత్పత్తి చేయడంలో మానవులు నిర్దిష్టమైన సంబంధాలలోకి వస్తారు. ఈ ఉత్పత్తి సంబంధాలు అప్పటి వుత్పత్తి శక్తుల - పనిముట్లు వగైరా అభివృద్ధిలోని దశకు సంబంధించి వుంటాయి. ఈ సంబంధాల- సారాంశ రూపమే సంఘంయొక్క ఆర్థిక వ్యవస్థ న్యాయ, రాజకీయ వ్యవస్థలకు ఇదే పునాది. యీ పునాది నంటుకొనే సాంఘిక చైతన్యం యొక్క రూపాలుంటాయి. - యీ పునాది మార్పుచెందితే చైతన్యంకూడ మార్పు చెందుతుంది. భౌతికావసరాలను ఉత్పత్తిచేసే విధానమే సామాన్యంగా సాంఘిక రాజకీయ మానసిక వర్తనాన్ని మొత్తం దిద్దుతుంది. మానవుల జీవితాన్ని వారి చైతన్యంగాదు నిర్ధారణ చేసేది; సాంఘిక జీవనమే వారి చైతన్యాన్ని - మనోభావ సంపుటిని - నిర్ణయిస్తుంది. "ఉత్పత్తి శక్తులు – పనిముట్లు" వగైరా అభివృద్ధి చెందుతూ ఒక దశకు వచ్చేసరికి అప్పుడున్న ఉత్పత్తి "సంబంధాల"తో విరోధిస్తాయి. అనగా ఏ ఆస్థి సంబంధాల చట్రంలో అంతవరకు తిరుగుతున్నాయో ఆ చట్రంతో ఉత్పత్తి శక్తులు విరోధిస్తాయి. ఉత్పత్తి శక్తులకు పురోగమనరూపాలుగా వుండే స్వభావం అంతమై ఆ సంబంధాలు వాటికి సంకెళ్లుగా మారడం ప్రారంభమౌతుంది. అదే సాంఘిక విప్లవ యుగారంభం. ఆర్థిక పునాదిలో మార్పు వచ్చి మొత్తం ఉపరిభాగం అంతా క్రమంగా రూపాంతరం పొందుతుంది. ఆర్థిక పునాదిలో మార్పులను పరిశీలించినపుడు బద్దతో కొలవగల భౌతికంగా – ఉత్పత్తి విధానంలో – వచ్చిన విప్లవాన్ని విడిగా

---

* ఆదిలో స్వంతంగా నేసుకొని గ్రామంలోనే అమ్ముకోడం, తరువాత ఎగుమతిదారైన మాష్టరు పీవరు క్రింద తన మగ్గంమీదే మజూరికి నేయడం కాలం మారేక పెద్ద మిల్లులో వేలాది కార్మిక వర్గంలో ఒకనిగా కూలికి నేయడం యిట్లా ఒక్కొక్క సామాజిక దశలో తన సంబంధానికి ఒక్కొక్క రూపం ఏర్పడుతుంది.

విచారించాలి; బద్ధతో కొలవ శక్యంకాని రాజకీయ, సాంఘిక, మత తాత్త్వికాది రంగములలో — ఆలోచనా విధానములో — వచ్చిన భావ విప్లవాన్ని వేరుచేసి పరిశీలించాలి.

ఉత్పత్తి పరికరాలపట్ల చారిత్రక భౌతిక దృక్పథమే సరియైనదని, అన్యదృక్పథం అవాస్తవికం అని ఇపుడు దాదాపు అందరూ అంగీకరిస్తూన్నారు.

## 5. భారతదేశము - పారిశ్రామిక విప్లవము.

మనము దాదాపు రెండు శతాబ్దములు బానిస దేశముగా నుండిపోయాము. అందువల్ల వివిధ శాస్త్రములు మానవాళి అభ్యుదయానికి వేసి పెట్టిన బాటలనుండి మనము దూరమైనాము.

రెండవ ప్రపంచ యుద్ధం కారణంగా జర్మనీ, ఇటలీ, జపాన్ ఫాసిజం నిర్మూలింపబడడం, అదివరకున్న రష్యాతోపాటు క్రొత్తగా తూర్పు యూరప్ (సుమారు పన్నెండు) దేశాలలో సోషలిస్టు వ్యవస్థ నిర్మింపబడడం, ఇంగ్లండ్, ఫ్రాన్సు పెద్ద సామ్రాజ్య దేశాలు బాగా బలహీన పడిపోవడం, ఇండియా, యీజిప్టు మొదలైనవి (ఇరవై వరకు) వలసదేశాలు రాజకీయ స్వాతంత్ర్యం పొందడం, చైనా గూడా విముక్తి జెంది సోషలిజంవైపు శీఘ్ర పురోగమనం చేపట్టడం, ఒక్క పదేళ్ళలో ప్రళయ పరిణామం ఇంత జరిగినతరువాత యీ యిరువైయవ శతాబ్దం రెండవ అర్థభాగంలో ప్రపంచచరిత్ర కొక క్రొత్తపోకడ వచ్చింది. ఎవో రెండు మూడు సామ్రాజ్యదేశాల ఇనపపాదములక్రింద మిగతా యావత్ప్రపంచ మానవకోటి తరతమ భేదాలతో బానిసలై మ్రగ్గవలసినదశ అంతమైంది. రాజకీయ, సైనిక రంగాలలో సామ్రాజ్యవాద ఆధిక్యతను పడగొట్టడమేగాక, అసలు పెట్టుబడిదారీ సిద్ధాంతాన్నే తాత్త్విక రంగంలో ఓడించి (ఇండియాలో గూడా) సోషలిజం ఒక ప్రపంచ శక్తిగా స్థాపితమైంది.

స్వాతంత్రం పొందిన వలన వ్యావసాయిక దేశాలన్నీ సోషలిస్టు కాక పోయినా, సోషలిస్టు దేశాలనుండి బలిష్ఠమైన సహాయమును పొందుతూ, సామ్రాజ్య దేశాలు కల్పించే తుచ్ఛమైన అడ్డంకులన్నింటిని అధిగమించి ముందుకు పోతున్నాయి. తాముకూడ పారిశ్రామిక దేశాలుగా శీఘ్రంగా అభివృద్ధి పొందాలనే తహతహ ఉవ్విళ్ళూరుతూంది.

ఎందుకు ఈ పారిశ్రామిక విప్లవం ? :— యంత్ర సహాయంతో మాత్రమే దేశంలో మొత్తంమీద "తలసరి ఉత్పాదకశక్తి" పెరగగలదు. అది పెరిగినపుడే ప్రజల జీవనప్రమాణం పెరగడానికి బాట యేర్పడుతుంది. యంత్రములు వ్యవసాయంలో ప్రవేశపెట్టడానికి ఎక్కడా ఎప్పుడూ పరి మితులెక్కువగానే ఉంటాయి. దానికన్న పరిశ్రమలలో ప్రవేశబెట్టడం తేలిక. ముందు పరిశ్రమలలో యాంత్రికంగా అభివృద్ధి జరుగుతున్నప్పుడే దీని ప్రభావంవల్ల విద్యుత్‌శక్తి, రసాయినిక యెరువులు, రవాణా సౌకర్య ములు, వ్యవసాయ యంత్రములు మొదలగునవి లభించుచున్నకొద్దీ వ్యవ సాయోత్పత్తికూడా పెరుగుతుంది. ప్రపంచములో కేవల వ్యవసాయ దేశ ములలో ప్రజల జీవన ప్రమాణం, కుటీరపరిశ్రమలవారితో సహా, హీనంగా వుండడానికిదే కారణం. వ్యవసాయరంగంనుండి కుటీర పరిశ్రమల రంగం నుండి గాని శ్రమజీవుల సమూహములో కొంత కొంత శాతము యంత్ర పరిశ్రమల రంగంలోకి మారుతున్నకొలది "తలసరి వుత్పాదక" స్థాయి, దానితోపాటు జాతీయ ఆదాయం, "తలసరి ఆదాయం" పెరుగుతాయి. కాని వ్యవసాయంలోకన్న, యంత్రపరిశ్రమలో "తలసరి పెట్టుబడి ఎక్కువ కావాలి". పెట్టుబళ్ళ సేకరణ సమస్యతో పెనవేసుకొని వున్నది. పారిశ్రామి కీకరణ క్రమమంతా. ఐతే యీ పెట్టుబళ్లు సేకరించడం ఎల్లా ?

## 6. పారిశ్రామికీకరణకు పెట్టుబడుల సమస్య.

దీనిపట్ల అర్థశాస్త్ర జిజ్ఞాసులలో పాతవారికి కొత్తవారికి వ్యతిరేక దృక్పథాలు వున్నాయి. పాతవారి సూత్రీకరణ :—దేశంలోని సకలవుత్ప

క్షులను రూపాయిలలోకి మార్చి మొత్తం చేయాలి. దాని నుండి దేశంలో వినియోగానికి అవసరమైన సముదాయాన్నంతని కూడా రూపాయల్లోకే మార్చి మొదటిదానినుండి తీసివేయాలి. మిగిలినదెన్ని రూపాయిలుంటే అంతే మన మూలధనం (సంచితం). దీని పరిమాణమే మనం ప్రారంభింప గల (ప్రారబ్ధం) పరిశ్రమ నిర్మాణాలకు పరిమితి. మనలాంటి పేదదేశంలో అట్టి మూలధనం అతి స్వల్పంగానే వుంటుంది. శేష ప్రాప్తమైన యీనిధి (మార్జిన్) ని పెంచాలంటే వినియోగాన్ని తగ్గించుకోడంద్వారానే కొంత సాధ్యమవుతుంది. ఉత్పత్తుల నధికంచేసే ఆనిధిని గణనీయంగా పెంచడా నికి తగినన్ని అవకాశములులేవు. అంతేగాక ఆ మూలధనంగా మిగిలే స్వల్పమైన దాన్నికూడా సమీకరించి యంత్ర పరిశ్రమల పెట్టుబడులవైపు మళ్లించే సాంప్రదాయములు, సంస్థలు వెనుకబడ్డ దేశంలోవుండవు. మన ఈ ప్రత్యేక పరిమితులతో ప్రమేయం లేకుండా భారీగా పెట్టుబడులు పెడుతూ పరిశ్రమల విస్తరణకు పూనుకుంటే ద్రవ్యోల్బణముపొంగి మొద టికే మోసం వస్తుంది.

కొత్తవారి సూత్రీకరణ :— ఇద్దరు కృషిచేస్తే సరిపోయే భూమి మీద అనవసరంగా ఆ కృషినే నలుగురు చేసి బ్రతకవలసి వస్తున్న దేశా లలో వ్యవసాయ రంగంనుండి కొంత జనాభాను పరిశ్రమల నిర్మాణానికి మళ్ళించవచ్చును. అందువల్ల ఆహార రంగంలో "తలసరి ఉత్పత్తి" గాని "తలసరి తిండి" గాని తగ్గదు. కొత్త నిర్మాణాలు కావలిస్తే అటు మళ్ళింప బడిన శ్రమజీవుల తిండికోసం రైతులు తమ "తిండిని తగ్గించుకుని మూల ధనం కూడబెట్టక తప్పదు;" అన్న సిద్ధాంతం ఇక్కడ అర్థరహితమైనది. కొత్త పరిశ్రమల్లో పెట్టిన యీ విధమైన పెట్టుబడి వ్యవసాయానికేమి పోటీరాదు. అంతేగాక అచిరకాలంలో పరిశ్రమల ఫలితాలు ప్రారంభ మవగానే అధిక వ్యవసాయోత్పత్తికి అదనపు వనరులు సమకూడి రెండూ పరస్పర సహాయకంగా వుండగలవు. ఈ సూత్రానికి తగిలించిన

వెంటనే ఆలోచనా చక్రమే మారి పారిశ్రామికీకరణ చర్చ అంతా కొత్త జీవనాన్ని పోసుకుంటుంది. అయితే ఈ విధంగా పారిశ్రామిక విప్లవం సాధించడానికి వివిధ ఆర్థిక — ముఖ్యంగా పెట్టుబడిదారీ, సోషలిస్టు — వ్యవస్థలలో ఏది పటుతరమైన పనిముట్టుఅని ఇక్కడొక ప్రశ్నవేయవచ్చు. కాని ఆ ప్రశ్నను పురస్కరించుకొని వచ్చే సమస్యలు చిక్కులు అదొక వేరే రాజకీయమైన కథ. ఈ కొత్తవారి ప్రతిపాదనలో ఆర్థిక చిక్కులు ప్రధానమైనవి గావు; గాని నిర్మాణ చిక్కులు క్లిష్టతరంగానే వుంటవి. వాటిలో కొన్ని ముఖ్యమైనవి ;

యంత్రజ్ఞానం గల జనం :— వ్యవసాయిక దేశాల్లో వీరు తక్కువ వుంటారు. కాని యీ లోపం "కూడబెట్టిన మూలధనం"తో తీరేదిగాదు. పరిస్థితులను బట్టి ఎప్పటికప్పుడు యంత్రశిక్షణ పథకాలు వేసుకోవాలి. అసలు—అభివృద్ధిచెందిన యంత్ర పరిశ్రముల వాతావరణంనుండి నిరంతరం నిపుణుల సృష్టి జరిగినపుడు ఈ సమస్య పూర్తిగా పరిష్కారమవుతుంది.

యంత్రముల సరఫరా :— విద్యుదుత్పాదక యంత్రాలు, లోహం కరిగించే గొప్ప కొలిమిలు (- బ్లాస్టుఫర్ నేసెస్ -) యంత్రాలను తయారు చేయు యంత్రాలు మొ. విదేశాలు అప్పు యిచ్చినంతవరకు తెచ్చుకోవాలి. మిగిలినవాటిని మన చిన్నపరిశ్రమల సరుకుల. వ్యవసాయ పంటల ఎగుమతులతో కొనాలి. ఎగుమతి చేసినమేరకు మనం తిండి వగైరా తగ్గించుకోవాలిగదా అని అడగవచ్చు; కాని తగ్గించుకోనక్కరలేదు. దేశంలోని అదనపు శ్రమజీవులలో (నిరుద్యోగులలో) కొంత శాతాన్ని మాత్రమే కొత్త పారిశ్రామిక ప్రణాళిక ప్రస్తుతం తీసుకోగలదు. నూటికి నూరు మందిని తక్షణం భరించలేదు. కనుక మిగతా శాతమును ఎగుమతుల కనువైన వస్తూత్పత్తికి మళ్లించవచ్చును. దిగుమతులలో విచక్షణ వహించి ప్రస్తుతం అప్రధానమైనవి తగ్గించవచ్చును. ఇంతకూ ఇక్కడ మన మెదురుకోవలసిన సమస్య. "ఒకానొక రకమైన మెషినరీ" లోటు అంతమాత్రమే.

**అధిక ధరలు-అధికోత్పత్తి:**— కొత్త పరిశ్రమల నిర్మాణంలోని లక్షలాది జనానికి చేకూరే కొత్తడబ్బు సరుకులకోసం బజారుకు వస్తుంది. వెంటనే బజారులో గొలుసు కట్టి చలనం ప్రారంభమవుతుంది. ముఖ్యంగా ఆహారదినుసుల ధరలు హెచ్చుముఖం పడతాయి ధరల ముఖం హెచ్చువైపు వుంటే చాలు. వ్యాపారులు, భూస్వాములు సరుకును బిగబట్టి మార్కెట్ (సప్లయి) ప్రవాహానికి అంతరాయం కల్పిస్తారు. అందుచేత ధరలింకా పెరుగుతాయి. ఆదాయం పెరగడంవల్ల పెద్దరైతులు తీవ్రతర కృషినుండి సాధారణకృషికి మారి సుఖపడడం ప్రారంభిస్తారు. దీనివల్ల పంటా తగ్గుతుంది: ధరా యింకా పెరుగుతుంది. పరిస్థితులు ముదిరి దేశంలో అత్యధిక జనాభా భరించలేనంతవరకు ధరలు పెరిగిపోయి మొత్తం ప్రణాళికకే తూట్లు పడవచ్చు ఒక విషయం అంగీకరించాలి. పరిశ్రమాభివృద్ధి ప్రణాళికకు ప్రమాదం తేగల చిక్కులలో ఒక అతి ప్రధానమైనదానిని పేర్కొనమంటే అది యిదే. పంటను మార్కెటుకు తేవడం....కాని యీ ప్రమాదం అనివార్యంకాదు. వివిధ వ్యవసాయ వ్యవస్థల - భారీ కమతాలపద్ధతి, చిన్న కమతాలపద్ధతి, సాధారణ వ్యవసాయం, తీవ్రతర వ్యవసాయం. కోపరేటివ్ వ్యవసాయం, గుత్త భూస్వామిక విధానం, ఇట్టి విభిన్నతలబట్టి మార్కెటుకువచ్చే శాతంగూడ మారుతుంది. పారిశ్రామికీకరణ ప్రణాళిక కనువైనవిధంగా భూసంస్కరణలు రూపొందించుకోవాలి.

ఈ సమస్య సోవియట్ రష్యాకు ప్రారంభంలో చాలా చిక్కు తెచ్చింది. పెట్టుబడిదారీ దేశాలలో సాధారణంగా అధిక ధరలవల్ల ప్రోగైన అదనపుడబ్బును రైతునుండి తీసుకోడానికి ప్రభుత్వ ఋణపత్రాలమ్ముతారు; అదనపు పన్నులద్వారా గూడా కొంత లాక్కుంటారు. కాని సోషలిస్టు దేశాలలో కమతంవద్దనే, అదనపు పంటలో కొంత శాతం ప్రభుత్వం కొని, ఖరీదిచ్చివేస్తారు. ఈ కొనుబళ్లు దేశమొత్తంమీద సకాలంలో జరగగా ఏర్పడిన ధాన్యపు నిధులతో ప్రభుత్వమే గుత్త టోకు వ్యాపారిగా

వ్యవహరించి ధరలను అదుపులోపెట్టి ప్రాంతాలవారీగా సప్లయిలు క్రమ బద్ధం చేస్తుంది. అంతేగాని ప్రజలు తిండి తగ్గించుకొని, ప్రభుత్వ ఖజానాకు డబ్బు కూడబెడితే (- సేవింగ్ ఫండ్ -) తీరే సమస్యగాదిది. ఎవ్వరూ తిండి తగ్గించుకోనక్కరలేకుండా పరిశ్రమాభివృద్ధి సాధించే మార్గాలు లేకపోలేదు. కాని అధికలాభాలు, స్పెక్యులేషను అరికట్టక పోతే చాలామందికి తిండి తగ్గక తప్పదు.

పెట్టుబడుల క్రమం :- దేనికిముందు పెట్టుబడిపెట్టాలి? ఆహారాన్ని ముడివస్తువులనుపెంచే వ్యవసాయ విస్తరణకు ప్రాధాన్యత నివ్వాలా, లేక ఒకవైపు నిరుద్యోగ నివారణకు మరొకవైపు సమగ్ర ఆర్థికాభివృద్ధికి అవకాశాలుకల్పించే పారిశ్రామికీకరణకు ప్రాధాన్యమివ్వాలా ? పరిశ్రమలకే యిస్తే. వినియోగ వస్తుపరిశ్రమలకా ? ఉత్పత్తి (-కీలక-)వస్తు పరిశ్రమలకా ?....వినియోగవస్తు పరిశ్రమలలో పెట్టిన పెట్టుబడికి త్వరలోనే ప్రతిఫలం ప్రారంభమవుతుంది. అవి యిముడ్చుకొన గలిగినంత మందికి వెంటనే జీవిత ప్రమాణంగూడా పెరుగుతుంది. కాని యీ పద్ధతివల్ల చేతి పరిశ్రమలలోని నిరుద్యోగం అంతగా నివారణకాదు, పైగా పెరగవచ్చు కూడా. అంతేగాదు: పారిశ్రామిక పరివర్తనంలో యీ పద్ధతివల్ల భవిష్యదభివృద్ధి కుంటుపడుతుంది....ప్రత్యామ్నాయంగా ప్రస్తుతం ఉత్పత్తి వస్తు పరిశ్రమలకే ప్రాధాన్యమిస్తే అవి దేశంయొక్క ఉత్పాదక శక్తిని విస్తరించుకోడానికి అవసరమైన పునాదిని మాత్రం యీ ప్రారంభదశలో వేయగలవు. తరువాత దశలలో యీ పునాదులమీద వినియోగ వస్తుపరిశ్రమల స్థాపన. విస్తరణ సులభతర మవుతుంది. అంతేగాదు; దీనివల్ల ఉత్పత్తి అయ్యే ఉక్కు, ఇనుము మొదలైనవి నిరుపయోగంగా వృధాకాకుండా వుండాలంటే శీఘ్ర పారిశ్రామికీకరణ ప్రణాళిక అనివార్యమే కావచ్చు. ఈ లోగా కావలసిన అదనపు వినియోగ వస్తువులకు ఫ్యాక్టరీలు పెంచము గాబట్టి చిన్న పరిశ్రమలలో నిరుద్యోగ నివారణ అవకాశాలు అపారంగా పెరుగుతాయి ...

పెట్టుబడి క్రమం (దేనికిముందు ?) గురించిచేసే నిర్ణయాలే భవిష్యదభివృద్ధి క్రమాన్నిగూడా నిర్ణయించివేస్తాయి; గనుక దీర్ఘకాలిక దృష్టిలో ప్రవర్తించాలి. ఇంగ్లండ్ అమెరికాలు విస్తారంగా ఉత్పత్తి పరిశ్రమలను చారిత్రకంగా ఆదిలోనే సంక్రమింప జేసుకున్నాయి. తరువాత పారిశ్రామికీకరణ చేసుకుంటున్న మిగతా పాశ్చాత్య దేశాలను ఉత్పత్తివస్తు పరిశ్రమలపై హెచ్చు పెట్టుబడులు పెట్టకుండా యీరెండు దేశాలు నిరుత్సాహ పరిచేయి. "అన్నివస్తువులు అన్ని దేశాల్లో ఉత్పత్తిచేయడం మూర్ఖత్వమని; మనుష్యశక్తికన్న పెట్టుబడిశక్తి హెచ్చుగల దేశాలు ఎక్కువ పెట్టుబడి ఆవసరమైయ్యే పరిశ్రమలపై కేంద్రీకరించాలని, పెట్టుబడి శక్తికన్న మనుష్యశక్తి అధికంగాగల దేశాలు ఎక్కువ మనుష్యులు అవసరమయ్యే పరిశ్రమలపై కేంద్రీకరించాలని" ఒక సిద్ధాంతాన్ని ఉపదేశిస్తున్నాయి. ప్రపంచాధిపత్యం తమ కున్నన్నాళ్లు యీ పద్ధతిలో అంతర్జాతీయ ఆర్థిక లావాదేవీలను కుదించడంవల్ల వ్యవసాయిక దేశాలు ఏదో ఒక దశకన్న పైకి రాలేక ఆగిపోయేయి. పారిశ్రామిక దేశాలలోగూడా కొన్ని బలహీనంగానే వుండిపోయి ముందుగా బలిసిన యీ రెంటి మీద ఆధారపడి బ్రతకక తప్పడంలేదు. ఈ అవ్యవస్థకు ఆవిధానమే కారణము ఈ నాడు ఏదేశానికెంత ఆస్తి పాస్తు (కాపిటల్ ఎన్‌డౌమెంటు) లున్నవో ఆస్థాయిని ఖాయపర్చుకుని చేస్తేస్థాణు వాదనిది. వెనకబడ్డ దేశాలలో ఈకీలక (కాపిటల్ ఎండౌమెంటు) నిధులను సాధ్యమయినంతవేగంగా పెంచుకోవడమెలాగు అన్నది ప్రధాన సమస్య. కీలక పరిశ్రమలకు ప్రాధాన్యతనిస్తూ ప్రారంభించిన కార్యక్రమంవలనే ఆసమస్య పరిష్కారం కాగలదు.

## 7. వివిధ రంగాల అన్యోన్య సంబంధం, వికాసవేగాన్ని కాపాడగలగడం.

ఒకరంగంలో ఒకపెద్ద నిర్ణయం చేయగానే దాని ప్రభావం అనేక రంగాలమీద పడుతుంది. ఒక అడవిలో ఒక ఎరువులఫ్యాక్టరీకట్ట నిర్ణయింపబడింది. దానికొక కొత్త రైలుమార్గం ఒక నూతన పట్టణనిర్మాణం గూడా కావాలి కనుక విస్తారంగా పెట్టుబళ్లు కావాలి. దీనికోసం అహమ్మ

దాబాద్ మిల్లు యజమానులవద్ద పేరుకున్న లాభాలను ఇటు మళ్ళించాలి. ఎరువుల నిర్ణయంవల్ల బట్టలమిల్లు విస్తరణ నిలుపుచేయవలసి వచ్చింది. బట్టలమిల్లు విస్తరణ ఆపడంవల్ల చేనేత పరిశ్రమను విస్తరింపజేసి బజారులో బట్టలలోటు రాకుండా చూచుకోవాలి. దీనికి పెట్టుబడులుకంటె నిర్మాణవ్యవస్థ ప్రధానం. ఇట్లా ఒక రంగంలోని నిర్ణయాన్ని పురస్కరించుకొని అనేక రంగాల్లో అనివార్యంగా పెద్దమార్పులు చేయవలసిన పదునైన తరుణంలో అహమ్మదాబాద్‌లోని మిల్లు యజమానులు తమ పెట్టుబడులమీద పెత్తనం తమదే అంటారు. తామేమో ఐక్యమై అడవిలో ఎరువుల ఫ్యాక్టరీ కట్టడానికి ఇచ్చగింపరు. పోనీ, ప్రభుత్వానికి ఆపెట్టుబళ్లు వడ్డీకిమ్మంటె కిట్టదంటారు. ఎరువుల లోటువల్ల దేశానికి వస్తున్న కష్టంతో తమకేమీ సంబంధంలేదు. చిన్న పరిశ్రమల నభివృద్ధిపరచి నిరుద్యోగాన్ని నివారించవలసిన పూచీ తమకులేదు. చివరకు అటు కీలక పరిశ్రమల నభివృద్ధిగాకుండాచేసి తమకు - అధిక లాభము, అధిక అనుభవము - గల బట్టలమిల్లుల విస్తరణకే పూనుకుంటారు. దేశం పెట్టుబడులలో ఎక్కువ శాతం ప్రయివేటు వ్యక్తుల చేతులలో వుండడంవల్ల వివిధరంగాల అన్యోన్యసంబంధం వైరుధ్యాలకు గురియవుతుంది. ప్రణాళికా చక్రం తూట్లుపడుతుంది; దేశం నత్తనడక నడుస్తుంది. వివిధరంగాల అన్యోన్యసంబంధం అనే ఒక వస్తువులో సమిష్టి అభివృద్ధికి అంతరాయం కల్పించగల ఒక లక్షణంవుంది. ప్రైవేటురంగం పబ్లిక్ రంగంకన్న విస్తారంగావుండడమే ఆలక్షణం. ఈలక్షణంనుండి ఆవస్తువును విముక్తి చేయగలిగినదేశం ముందుకు పోతుంది. లేనిదేశం వెనుకబడి వుంటుంది. వ్యక్తి - ఆస్తి - వ్యవస్థలోనే సాహసోపేతంగా ఉత్పత్తిశక్తులభివృద్ధి చెందుతాయనే వాదనకు కాలదోషం పట్టిందని యిక్కడే రుజువవుతుంది. జాతీయార్థిక వ్యవస్థలో ప్రయివేటు రంగంకన్న ప్రభుత్వరంగం ప్రబలంగా వున్నప్పుడే గమనవేగాన్ని కాపాడగలం. కనీసం పెట్టుబళ్ళ నిర్ణయాధికారం వ్యక్తిపరిమితినుండి సమాజపరిధిల్లోకి మార్చుకోడం అత్యవసరం. బ్యాంకులను జాతిపరం చేయడంలాంటి ప్రాథమిక పనులుగూడ ఇండియాలో యింకా జరగలేదు.

## 8. చేనేత ఉద్యమం - కేంద్ర వివాదంపై చర్చ.

ప్రథమ ఆంధ్రరాష్ట్ర చేనేత మహాసభ 1936 సం.లో తూర్పు గోదావరిజిల్లా ఉప్పాడలో జరిపి, చీరలు ధోవతులు చేనేతకు కేటాయించి రక్షణ కల్పించమని తీర్మానించబడింది. నాటినుండి నేటివరకు ఇదే కేంద్ర వివాదం. అనేక రాష్ట్ర శాసనసభలు దీనినే బరపరుస్తూ తీర్మానించి కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి చేసినవి. ఇది అమలు జరిగిఉంటే కొన్ని కష్టాలు తప్పకపోయినను చేనేతకు గణనీయమైన రక్షణ ఏర్పడిఉండేది.

నూతన వస్త్రవిధానం 1956 లో కేంద్రప్రభుత్వం ప్రకటించి చేనేతకు - రకాలు కాదుకాని - రాసి కేటాయించారు. 840 కోట్లు గజాలు ఉత్పత్తిలో 240 కోట్లు చేనేతకిచ్చేరు. ఇది ఇప్పుడు అమలుజరుగుతున్నది. నేడు చేనేతబట్ట విడుదలకాక నిరుద్యోగం, అర్ధనిరుద్యోగం వ్యాపిస్తూఉంది. మిల్లుబట్టకూడ విడుదలకాక మిల్లులు షిఫ్టులు తగ్గించడం, లాకౌట్‌లు చేయడం వింటున్నాము.

మొదటి పంచవర్ష ప్రణాళికలో మిల్లులు 371 కోట్ల గజాలనుండి 470 కోట్లకు పెంచనిర్ణయించితే 510 కోట్లవరకు పెరిగింది. అదే కాలములో చేనేతగుడ్డ 84 కోట్లనుండి 170 కోట్లకు పెంచాలంటే 145 వరకు మాత్రమే పెరిగింది. మిల్లుల ఉత్పాదకశక్తి 1955 నాటికి 495 కోట్లని అంచనావేస్తే దానికిమించి ఉత్పత్తి చేశారు. చేనేత ఉత్పాదకశక్తి 400 కోట్ల గ. అని అంచనావేస్తే 145 వరకు రాడానికి కటకటలాడిఓ్దది. ప్రభుత్వ సహాయమంతా చేనేతలో కోపరేటివులకే పరిమితం చేసినా, 1955-56 లో వాటిలో 10 లక్షలు చేరినా, సాలుకు అవి 17 కోట్ల గ. మాత్రం ఉత్పత్తి చేసేయి. అనగా మగ్గానికి రోజుకి 17 ఇంచెలు అయింది. దామాషాను రోజుకి 6 గజాలు నేయగల మగ్గాలు ఈ విధంగా పనిచేస్తే కోపరేటివుల నిర్వీర్యతకు మరొక నిదర్శనం అక్కరలేదు. ఒక్క కోపరేటివులతోనే ప్రధాన సమస్య పరిష్కారం కాదని తేలిపోయింది.

ఏ ఆర్థిక రంగంలోనైనా కొనుగోలుశక్తి అత్యంత ప్రధానమైన సమస్యే. నిష్కపటమైన భూసంస్కరణలు మొదలగు చర్యలమీద దాని పరిష్కారం ఆధారపడుతుంది. అందువల్ల అది జాతీయనినాదం. చేనేత పునరుజ్జీవనానికి అది చక్కని వాతావరణం సృష్టించగలదుగాని అదే చేనేతరంగానికి కేంద్రనినాదం కాలేదు.

ఇక కేటాయింపు పంథాలో రెండు బలహీనతలు ఉన్నాయి. (1) ప్రాంతీయ ఆచారాల మార్పువల్ల (పంజాబు, కాశ్మీరు ప్రాంతంలో చీరలు ధోవతులు ఉపయోగించరు) ఈ పంథా జాతీయపంథా కాలేదు. (2) మార్కెటింగ్ బాధ్యత ప్రభుత్వం తీసుకుంటేనేగాని సక్రమంగా అమలు జరగదు.

నేటి వ్యావసాయకదేశాన్ని సత్వరం పారిశ్రామిక దేశంగా, సోషలిస్టు నమోనాలో అభివృద్ధి పరచాలనే రెండవ పంచవర్ష ప్రణాళిక మన పార్లమెంటులో ఆమోదింపబడినది మొదలు జాతీయ వాతావరణంలో వికాసవంతమైన పెద్ద మార్పు వచ్చింది. దీనికి వ్యతిరేకశక్తులు ప్రబలంగా వుండి ఆచరణలో గణనీయంగానే విఫలము చేయగల్గుతున్నవికాని చారిత్రక వాతావరణాన్నిమాత్రం త్రిప్పలేకపోతున్నవి.

కొత్తగా వికసించిన ఈ వాతావరణం తాత్కాలికమైనది కాదు. దీనిని గుర్తించకుండా నినాదాలను నిర్ణయించరాదు. మన ఆర్థిక వ్యవస్థలో ఒడుదుడుకులు ప్రకృతిసిద్ధమని, అవి ముదిరి ప్రమాదించినపుడు మాత్రమే ప్రభుత్వం తాత్కాలికచర్య తీసుకోకలదని, ప్రభుత్వ పాత్ర ఇంతకుమించి ఉండబోదని, ఇదివరకు భావించి-చీరలు, ధోవతులు కేటాయించమన్నాము. ఈ రక్షణకన్న మరణమునుండి కాపాడుకోడానికి మరొక ఉపాయం లేదనుకొన్నాము. ప్రభుత్వస్థాయిలో సోషలిజంమాట ఎత్తడానికే అనుకూలం కాని రోజులవి. ఒడుదుడుకులు ఉదయించనివిధంగా క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థను రూపొందించుటకు ప్రభుత్వం స్వయంగా కర్తృత్వం వహించాలని ఈ ప్రణాళిక నిర్దేశించింది. భూసంస్కరణలను వాయిదావేయలేని స్థితి

వచ్చింది. భీమావ్యాపారము, కొన్ని సరుకుల విదేశవ్యాపారము జాతిపరం ఐనవి, మరికొన్ని అవనున్నవి. పెట్టుబళ్ళలో హెచ్చుభాగం ప్రభుత్వ రంగానికి ప్రజాళికలో ఇవ్వబడింది. ఆ పెట్టుబళ్ళన్నీ కీలకపరిశ్రమలకే మళ్ళించి, వినియోగసరుకుల అదనపు ఉత్పత్తి చిన్నపరిశ్రమలకే కేటాయించమన్న వాదన దేశంలో బలం సంపాదించుకొంటూవుంది.

ఈ వాతావరణంలో చేనేతగుడ్డ విడుదల బాధ్యతంతా ప్రభుత్వమే తీసుకోవాలనే నినాదం ఉచితమైనదే. ఈ ప్రతిపాదనను బాధ్యతకలవారంతా ఆలోచించాలి. ఉత్పత్తి కోపరేటివు, ప్రయివేటురంగాలకు విడిచిపెట్టవచ్చు.

మనతో పోలికలుగల చైనాలో ఏనాడో యీపనిచేసేరు. మనకన్న వెనకనుండే చైనా చారిత్రక కారణాలవల్ల నేడు మనకన్న ముందుకుపోతూ వుంది. 1949 సెప్టెంబరు 29 న చైనాలో ప్యాసైన "కామన్ ప్రోగ్రాం" 37 వ ఆర్టికల్‌లో యీవిధంగా వుంది.... "స్పెక్యులేషన్ కఠినంగా నిషేధించబడును. దేశంలో ఉత్పత్తికి వినియోగానికి మధ్య, వివిధవస్తు ధరవరలమధ్య, సమన్వయించేబాధ్యత ప్రభుత్వ వ్యాపారసంస్థలు స్వయంగా నిర్వహించుతాయి." అక్కడ యింకా మూడుమెట్లు పైకివెళ్ళేరు. చేనేతలో కనీసవేతనం నిర్ణయించేరు. మిల్లుగుడ్డలు చేనేతగుడ్డలు అన్ని టోకు వ్యాపారంఅంతా ప్రభుత్వం గుత్తవ్యాపారంగనక రెంటిధరలను తానే సమన్వయపరచి మార్కెటుకు విడుదలచేస్తుంది. ఉద్యోగులు, ప్రభుత్వ ఫ్యాక్టరీల్లో పనిచేయువారు తమజీతాల్లో కొంతభాగం యీ రకమైన వస్తురూపేణా తీసుకొనేవిధానం అమలుజరుపుతూంది.

అన్నిమెట్లు చర్చించవలసిన తరుణం మనకింకా రాలేదు; కాని ప్రభుత్వ వ్యాపార (స్టేట్ ట్రేడింగ్) రంగంలోనికి చేనేతవస్త్ర మార్కెటింగ్‌ను టోకువ్యాపార దశవద్ద తీసుకోమని ఆందోళనచేయవచ్చు. ఇప్పటికే కొంత ఆలస్యమైనదిగూడా.

దీనివల్ల ప్రస్తుతం పీడిస్తున్న రెండు పెద్దవైరుధ్యాలు తొలగుతాయి. (1) గుదిబండలాంటి యీ అల్పాదాయవృత్తిని ఇంకెంతకాలం జీవించనీయడం అని చేనేతరంగంలో పవర్ మగ్గాలను ప్రభుత్వం ప్రవేశబెట్టింది.

దీనిని చేనేతవారంతా, కొన్ని స్టేట్ ప్రభుత్వాలుగూడా వ్యతిరేకిస్తున్నాయి. చేనేతలో టోకువ్యాపారమంతా ప్రభుత్వపరం అయితే పవర్‌మగ్గాలను సంతోషంగా స్వీకరిస్తారు. పవర్‌మగ్గాలకు ప్రభుత్వం పెట్టుబడిపెట్టనక్కర లేకుగూడాను. మాస్టర్ వీవర్లు కొన్ని సొసయిటీలు పెట్టుకోగలరు. ఈ విధంగా ప్రభుత్వానికి రు. 7 కోట్లు మిగులుతాయి. అనుకున్నదానికన్న త్వరగా, సులువుగా పనిముట్లలో విప్లవంరాగలదు. (2) తక్కువ పెట్టుబడితో నిరుద్యోగాన్ని పూర్తిగా నిర్మూలించగలదు. కాబట్టి యీ చేనేతకు ఎంతైనా డబ్బు కేటాయిస్తాం, తీర్మానానికి మించిగూడా యిస్తాం. అంటున్నారు ప్రభుత్వం. కాని నిర్మాణదారుఢ్యం లేక అల్పంగా కేటాయించిన ద్రవ్యాన్నిగూడా పూర్తిగా వినియోగించుకోలేకపోతున్నాము. కాని స్టేట్ ట్రేడ్‌లోనికి తీసుకున్ననాడు నిర్మాణపటిమ ఏర్పడుతుంది; వారివ్వగలిగినంత డబ్బు వినియోగించగలం; పూర్తిగా నిరుద్యోగ నివారణగూడసాధ్యమే. తలసరి ఉత్పత్తి, జాతీయఉత్పత్తి, తద్వారా జాతీయాదాయం పెరుగుతుంది.

రెండు సూత్రాలమీద ఆధారపడి నూతన వస్త్రవిధానాన్ని 1956 లో శ్రీ టి టి. కె. ప్రారంభించేరు. (1) తక్కువ సమర్థతగల పరిశ్రమల నుండి ఎక్కువ సమర్థతగల పరిశ్రమలకు వనరులను తరలించడం (2) ఆటోమేటిక్ మగ్గాలు (రేషనలైజేషన్) మిల్లుల్లో అమలుపరచి తక్కువ కిట్టింపైన మిల్లుగుడ్డలను ప్రపంచ పోటీమార్కెటులో అమ్మి. తద్వారా విదేశీ మారకద్రవ్యాన్ని సమకూర్చి. దానితో పారిశ్రామికీకరణకు కావలసిన యంత్రాలను కొనడమే వివేకం అన్నాడాయన. చివరకు యీ జూదపు పథకంలో భారతదేశం చిత్తైంది. అస్థిరము, అరాజకము అయిన ప్రపంచ మార్కెటులో జూదమాడబోయి దేశంలో సంక్షోభం తెచ్చుకున్నాం. ఆటోమేటిక్ మగ్గాలకు కేటాయించిన మేరకు కీలకపరిశ్రమాభివృద్ధికిలోటు చేతులారా తెచ్చుకున్నాం, బడుగుదేశాలలో యీ రెండు అవివేకమైన సూత్రాలని రుజువైంది. బడుగుదేశాలలో ఈవిధమైన ఎగుమతుల కన్న నిరుద్యోగులు; నిర్వ్యాపారుల పునరావాసం, ఆర్థికాభివృద్ధి ప్రధానమని తక్కువ సమర్థతనుండి ఎక్కువ సమర్థతకు వనరులను తరలించడంకన్న

నిరుపయోగంగా పడివున్న ఉత్పాదకశక్తులకు తరలించడంవల్లనే ఆర్థి
వ్యవస్థకు నిజమైన పుష్టినివ్వగలదని ప్రభుత్వం గ్రహించాలి. ఈవిధంగ
ఆందోళన జేయడమే నేడు చేనేత ఉద్యమానికి ప్రధానహంశంగా వుండాలి

కేంద్రం ప్రారంభించేదాగా ఆగకండా రాష్ట్రప్రభుత్వాలు ఒక పం
మితిలో ప్రారంభించవచ్చు. స్టేట్ ట్రేడింగ్‌కు రాజ్యాంగంలో స్టేట్‌కు
గూడా అధికారంవుంది.

ప్రభుత్వవ్యాపార మనగానే - పరిపాలనా యంత్రంలోని శీలము, సామర్థ్యము చర్చలోకి వస్తాయి. అదెంత అశ్లీలము, అసమర్థము ఐనప్ప టికి ఇపుడు దేశ ఆర్థికవిధానానికి వచ్చేదానికన్న హెచ్చునష్టంరాదు. వచ్చినా తాత్కాలికంగావుండి తరువాత సర్దుకుంటుంది. స్టేట్ కాపిటలిజం గురించి లెలిన్ చెప్పిన (వాల్యూం II పు 704 ట) వాక్యాలు గుర్తుకు తెచ్చి ముగిస్తాను. "విధ్వంసక శక్తులపైన అరాజకంపైన విజయం సాధిం చగల విద్యకావాలంటె దానికి స్కూలుజీతం (ట్యూషన్ ఫి) చెల్లించాలి. ఇపుడు మనం నష్టబోయే దానికన్న హెచ్చుమొత్తమే ఆజీతంగా ఖర్చు పెట్టినను, ఉత్తమవ్యవస్థ, ఉన్నతనిర్మాణము, సోషలిజంకు "సరియైన"బాట నిస్సంశయముగా సాధించగలము గనక ఫరవాలేదు."

చేనేత - స్టేట్ ట్రేడ్ అనే హంశంమీద యిదివరకు ఏ చేనేతసంస్థ తీర్మానాలు చేయలేదు. బాధ్యతగల సంస్థలన్నీ దీని కర్తవ్యమగురీతిని చర్చిం చుటకు యీ ప్రతిపాదన చేయబడింది.

ఈ పుస్తక రచనలో అనంతపురంజిల్లా ఉరవకొండ మిత్రులు, రాష్ట్ర చేనేతసంఘ కార్యవర్గ సభ్యులు అయిన శ్రీ బంకా చినరామప్పగారు చేసిన సహకారమునకు కృతజ్ఞుడను.

ఉప్పాడ
5—2—58

పుత్సల సత్యనారాయణ, యం. యల్. ఎ.
ఉపాధ్యక్షులు : ఆంధ్రరాష్ట్ర చేనేతసంఘం.

ఒకటవ ప్రకరణం.

# భారతదేశంలో చేనేతపరిశ్రమ స్వరూపము, చారిత్రక పరివర్తనము.



1830 నుండి మిల్లుబట్టల పోటీ చేనేతపరిశ్రమకు ప్రారంభమయింది. అదివరకు అనేక చిక్కుల నొందుచుండిన ఈ పరిశ్రమ ఆ తర్వాత చాలా క్లిష్టసమస్యలకు గురి అయింది. అంతకు పూర్వం గ్రామీణ స్వయంసంపూర్ణ వ్యవస్థలో భాగంగావున్న ఈ పరిశ్రమలో పెట్టుబడిదారులు మధ్యమనుష్యులుగా చేరడంతో చాలా రూపాంతరములు కల్గినవి. అదివరలో పనిముట్లు, నూలు, నేతనేయడం, ఇతర సహాయకపనులు, గుడ్డ విక్రయము మొదలగునవన్నీ ఒక్కరే నిర్వహించే రూపంపోయి, కూలికి నేతనేయడం, మాస్టరు పీవన్ను అనే వర్గం తయారవడం, వ్యాపారానికి కొందరు ప్రత్యేకం కావడంనుంచి తుదకు కార్ఖానాల రూపంకూడా దాల్చింది.

అస్సాంరాష్ట్రంలో ఈ పరిశ్రమ సార్వజనీనం. పెండ్లి కూతురు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు తాను స్వయంగా వడికి నేసిన గుడ్డలనే ధరించి పోవలెనని నియమముండట. ఆ గుడ్డ నాణ్యమునుబట్టి ఆమె బుద్ధికుశలతను గమనించేవారట.

భారతదేశంలో వర్ణవ్యవస్థ వృత్తులనుబట్టి ఏర్పడింది. కాలప్రవాహంలో ఈ వ్యవస్థ బద్దలయిపోతూండడం మనం చూస్తూనే వున్నాము. చేనేతవృత్తివారిని నాలుగు వర్ణములలో మూడవవర్ణం (అంటే వైశ్యులలో) చేర్చినట్లు, గాయత్రీ ధారణవల్ల వారికి ద్విజత్వం పౌరాణికముగా ప్రాప్తించినట్లు భారతప్రభుత్వం 1942 లో నియమించిన "ఫేక్ట్స్ ఫైండింగ్ కమిటీ" (విషయసేకరణ సంఘము) వారు వ్రాశారు.

చేనేతవారి కులములివి :—

వింధ్య పర్వతాలకు దక్షిణమున (1) సాలె (2) దేవాంగ (3) కైకాల (4) కోస్టి (5) ఖత్రి (6) తొగట (7) కురుహీన (8) కోరి (9) కాడ (10) బలాహి (11) మహేద్ (12) పంకా (13) రంగని (14) హాన్సి (15) గాడ (16) పత్ర.

సాలెవారు ప్రధానంగా ఆంధ్రప్రదేశ్ లో వున్నారు. చేనేతజనాభా అధికసంఖ్యాకులై చాలారాష్ట్రాలలో వ్యాపించి యున్నారు. పద్మ, పట్టు, సుగుణ, స్వకుల, శివ ఇత్యాది విభాగములుగా వీరున్నారు.

దేవాంగుల జన్మస్థానం బహుశః కర్ణాటకం కావచ్చునని విషయసేకరణసంఘంవారి నివేదికలో వుంది.

కైకాలుల లేక సింగుండ, వెల్లాలముదలియార్ అనబడే వీరిజన్మస్థానం పల్లవరాజ్యంలోని కాంచీపురం అయియుండును.

కోష్టి అనబడేవారి ప్రథమ జన్మస్థానం మహారాష్ట్రం. తర్వాత వీరు పరిసరరాష్ట్రాలకు వ్యాపించారు.

తర్వాత "తంతీలు" అనేవారు బెంగాలులో వున్నారు.

మహమ్మదీయులలో "మోమినులు" "జులహాలు" అనే చేనేత తెగలున్నవి. బరోడా (గుజరాత్) లో "షేకులు", తిరునల్వేలి (తమిళనాడు) లో లబ్బీలు అనే తెగలు కూడా వున్నవి.

మన దేశంలో ఈస్టు ఇండియా కంపెనీ ప్రారంభానికి పూర్వమే ఈ పరిశ్రమలో "కార్ఖానాస్వరూపం" ప్రవేశించింది. దీనికి ప్రధానంగా దూరప్రాంతాలకు ప్రయాణానుకూల సాధనములు లభ్యంకావడం ఒక కారణం. "కార్ఖానా స్వరూపం" అంటే ఒక యజమాని (లేక మాస్టరు వీవరు) కొన్ని మగ్గాలు పెట్టి కూలికి నేత నేయించుకొని ఆ గుడ్డను ఇతర వ్యాపారులకు అమ్మివేయడము. ఈ విధంగా పరిశ్రమలో "మధ్యమనుష్యులు" ప్రవేశించారు. దానితో ఈ పరిశ్రమకు పట్టణప్రాంత స్వరూపం కలిగింది. 1942 సం॥ నాటికి బొంబాయి రాష్ట్రంలో యావత్తు చేనేత జనాభాలోను 100 కి 40 మంది 26 పట్టణ ప్రాంతాల లోను, అలాగే మద్రాసు రాష్ట్రంలో మొత్తం చేనేత జనాభాలో 100 కి 39 వంతులు 49 ప్రాంతాలలోను నివసిస్తున్నారు. అంటే దీని అర్థం చేనేత పరిశ్రమ గ్రామీణ స్వయం సంపూర్ణ ఆర్థికవ్యవస్థావిధానంలోని గ్రామీణ పరిశ్రమాస్వభావమును

విడిచి, పట్టణపరిశ్రమగా కార్ఖానాల స్వరూపం ధరించినదన్న మాట. ఇంకా అనేకగ్రామాలలో చేనేతవారున్నప్పటికీ సాధారణంగా వ్యవసాయంతో నిమిత్తం లేకుండా స్వవృత్తిపైననే ఆధారపడివున్నారు.

పట్టణ ప్రాంత పరిశ్రమగా రూపొందడంతో ఆయా పరిసరముల అభిరుచులను బట్టి ఒక్కొక్క చేనేత కేంద్రానికి ఒక్కొక్క ప్రత్యేకత కూడా సిద్ధించినది. కోయంబత్తూరు (తమిళనాడు) లో ఒక ప్రత్యేకమగు సన్నని చీరలూ, బనారస్ (కాశి) లోను, ఉప్పాడ (తూర్పు గోదావరి జిల్లా) ధర్మవరం (అనంతపురం జిల్లా) బెంగుళూరులలో శిల్కు బుటా చీరలు, ఢక్కా (ప్రస్తుతం తూర్పు పాకిస్తాన్ రాజధాని) లో మస్లినులు మొదలుగాగల విశిష్టత కల్గిన గుడ్డలు తయారగుచున్నవి.

పద్మశాలీయులు, దేవాంగులు మొదలగువారు తమ తమ కులాలకు అఖిలభారతప్రాతిపదికపై కులసంఘాలను ఏర్పరచుకొన్నారు. ప్రాంతీయంగా వృత్తి సంఘాలను నిర్మించుకొన్నారు. ఈ ఆధునిక కాలంలో ట్రేడ్ యూనియన్ స్వరూపం కూడ పొందుచున్నారు.

వడుకునూలుపద్ధతి పడిపోవడం, మిల్లునూలుమీద ఆధారపడటం, పల్లెప్రాంతాలనుండి పట్టణప్రాంతాల నివాసం ఖాయపడటంవల్ల ఈ మధ్యమనుష్యుల ప్రవేశం అనివార్యమూ, సుకరమూ అయింది. నాడు చేనేత పారిశ్రామికుడు రైతు

కుటుంబం తన తీరికసమయాలలో వడికిన నూలును యిస్తే నేసేవాడు. నేడాపరిస్థితి లేదు. ముందుగా డబ్బు పెట్టుబడి పెట్టి నూలునుకొని నేయడం వచ్చింది.

## ప్రస్తుత పరిస్థితి.

ఈ యాధునిక కాలంలో వ్యాపారధరల హెచ్చుతగ్గుల వల్ల అతడు నష్టపడలేకపోయాడు. ఇందువల్ల లాభనష్టాలతో నిమిత్తంలేని కూలికినేసేపద్ధతిని ఐచ్ఛికంగానే వరించాడు. అంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని తనకు తానే ఆహ్వానించాడన్నమాట.

ఎగుమతులు చేసి, ఆ డబ్బు తిరిగి వచ్చేవరకు ఆగగల స్తోమత లేనందువల్లకూడా అతడు పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలకు తలొగ్గినాడు.

చాలినంత పనిలేకపోవడం, మార్కెట్టు ధరవరలలో ఎగుడు దిగుడులవల్ల నష్టం రావడం సర్వేచేయగా మద్రాసులో 100 కి 90 మంది, మైసూరులో 100 కి 95 మంది ఋణగ్రస్తులైనట్లు విషయసేకరణసంఘం తన నివేదికలో చెప్పింది.

రాష్ట్రప్రభుత్వాలనుండి తెప్పించిన అంకెలనుబట్టి దేశంలో 28 లక్షల 64 వేల చేమగ్గాలున్నవని కేంద్రప్రభుత్వం మొదటిపంచవర్ష ప్రణాళిక (మొ॥ పం॥ వ॥ ప్ర) కాలంలో నిర్ణయించింది. వీటికి సాలుకు 300 రోజులు పని వున్నా 500

కోట్ల గజాల బట్ట ఉత్పత్తి చేయగల శక్తి వున్నది. కాని, 1954 లో 130 కో॥, 1955 లో 145 కో॥ గజాలు మాత్రమే ఉత్పత్తి జరిగింది. అనగా కనీసం మూడింట ఒక వంతు మాత్రం ఉత్పత్తికి వినియోగపడి మిగతా రెండు వంతులు వ్యర్థమైపోతున్నది. వీటిలో కొన్ని పనిచేయనిమగ్గాలుగా అంచనావేసినను, మొత్తం చేనేతలో నిరుద్యోగం, అర్ధనిరుద్యోగం చాలా ఉధృతంగా వుందని అర్థం.

ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల మాంచెష్టరు గుడ్డకు మన చేనేతగుడ్డ పోటీగా వుందని చెప్పి మేలురకం చేనేతవారి బొటన వ్రేళ్ళను 100 సం॥రముల క్రితం నరికించినారని చరిత్రలో వున్నది. ఏమైనప్పటికి పారిశ్రామిక విప్లవం పూర్తి కాని మన దేశంలో ఏ బలహీనంగానో నేటికీ జీవించేవున్నది. మన జాతీయార్థిక విధానంలో చేనేతకింకా స్థానమున్నదని చెప్పి, మొదటి పంచవర్ష ప్రణాళికలో మిల్లులకు చేనేతకు "సమన్వయ ఉత్పత్తి పథకం" ఉండాలని వ్రాసేరు. ఆ తీయని పలుకులు కాగితం మీదనే నిలచిపోయేయి. ప్రణాళిక ప్రారంభమయిన మరుచటి సంవత్సరమే చేనేతవారిలో ఆకలిచావులు, ఆత్మహత్యలు, అత్యధిక జనం భిక్షుకులుగా మారడం మొదలయింది. రాష్ట్ర ప్రభుత్వాలు ఆందోళన జెంది కేంద్రాన్ని కదపగా కానుంగో గారి ఆధ్వర్యాన ఒక విచారణ కమిటీ వేయబడింది (1952). చావులు పెరుగుతున్న చేనేతవారి గురించి సలహాలు ఆలో

చించడానికి ఈ కమిటీ రెండేళ్ళ కాలం తీసుకొని చేనేతకిక స్థానం లేదు, క్రమంగా పరిశ్రమను రద్దు చేయాలి. పంచవర్ష ప్రణాళికల్లో అనేక అభివృద్ధి నిర్మాణపథకాలు అమలు జరుగు తవిగనక వీరిని ప్రత్యామ్నాయ వృత్తులు చూచుకోమని చెప్ప వచ్చునని (1954) వ్రాసేరు.

ఇది వ్రాసిన మరుచటి సంవత్సరం కేంద్రప్రభుత్వంచే ఆదేశింపబడి ఆచార్య మహలనాబిస్‌గారు భారతదేశానికి రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా (1955) వ్రాసేరు. కానుంగో కమిటీ సూచనలలోని తత్వం, దృక్పథం, విధానం, లక్ష్యం అన్నింటిని త్రోసివేసి కొత్త సూత్రాలను మహలనా బిస్ ప్రతిపాదించేరు. "వినియోగవస్తువుల పరిశ్రమలలో మిల్లుల విస్తరణ అరికట్టి, చేతిపరిశ్రమల నభివృద్ధిపర్చడంద్వారా దేశ అవసరాలు తీర్చుకోవాలన్నారు. జనాభా ఎక్కువగల దేశం గనక నిరుద్యోగ నివారణ ప్రస్తుతం దీనివల్ల తీరి, మనకు ఉన్న కొద్దిపాటి పెట్టుబడులను అరాచకంగా అన్ని మిల్లుల విస్తరణకు ఉపయోగించేబదులు, పారిశ్రామిక విప్లవానికి కీలకమైన ఇనుము, ఉక్కు, రసాయనములు, పెట్రోలు, ఎలక్ట్రిసిటి మొదలైన వాటి స్థాపనకు ఉపయోగించాలన్నారు.

చేనేతపరిశ్రమపై మరణశాసనం కానుంగో సిఫారసు తాత్పర్యం. మూలనున్న మగ్గాలుగూడా తీసి, మగ్గాల సంఖ్యను విస్తృతపర్చి, అభివృద్ధికి అన్నివిధాలా అవకాశాలు కల్పించడం,

మగ్గాలవారికేగాదు, దేశానికే అవసరమని మహాలనాబిస్‌గారి సూత్రంలోని తాత్పర్యం.

మహాలనాబిస్‌గారి అన్నిరంగాలకు వర్తించే ఆర్థికసూత్రమును కేంద్రప్రభుత్వం అంగీకరించి రెం॥ పం॥ వ॥ ప్ర॥ వివరాలను తయారు చేయుమని సిబ్బందికి ఆదేశించింది. వారు తయారు చేసేరు.

కాని, కేంద్ర మంత్రివర్గంలో ఒక ముఠా – దీనిలో శ్రీ టి. టి. కృష్ణమాచారిగారున్నారు– మిగతా పథకాల మాట ఎలాగున్నా, వస్త్రపథకంమాత్రం యీ సూత్రంతో తయారుచేసినది “అంగీకరించము” అన్నారు. పార్లమెంటుకు ప్రణాళిక వచ్చింది. ఒక్కొక్క పథకంమీద చర్చ జరుగుతూంది (1956 మే). వస్త్రపథకం విషయంలో మాత్రం మంత్రులమధ్య ఏకాభిప్రాయం యింకా కుదరలేదు. అందుచేత అదొక్కటి వాయిదావేసి మిగతా ప్రణాళికంతా ప్యాస్ చేసేరు.*

---

* ప్రథమ ప్రణాళిక అటులాగితే కామంగో గారిటు, మళ్ళీ మహలనాబిస్ అటులాగితే కృష్ణమాచారిగారిటు. అంతా గందరగోళానికి గురియైంది. వస్త్రవిధానంలోనేగాదు వ్యవసాయ విధానం మొదలైనవాటిలో గూడ నిర్దిష్టతలేదు. బహుశా యిది మనసులో పెట్టుకొనేకాబోలు, శ్రీ మహలనాబిస్‌గారిటీవల సోషలిస్టు ప్లానింగ్ నిర్మాణ పద్ధతులు చైనాలో స్వయంగా పరిశీలించి, ఇండియా ప్రభుత్వానికిచ్చిన రిపోర్టులో చాలా ప్రముఖంగా ఒక వాక్యాన్ని వాడేరు : “చైనా ప్రణాళికా కర్త మనస్సులు తేటగా వున్నాయి.”

నూతన వస్త్రవిధానం జూన్ 1956 లో శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రకటించేరు. కానుంగో సూత్రాన్ని విడిచిపెట్టలేదు. అదనంగా 14,600 ఆటోమేటిక్ పవర్ మగ్గాలు, 35,000 సాధారణ పవర్ మగ్గాలు స్థాపించి, వాటిపై పెట్టుబళ్ళు పెట్టవలసిందే నన్నారు. కొత్త సూత్రంతో కొంతవరకు రాజీపడుతూ, చేమగ్గాలమీద 1956–57 లో 148 కోట్ల గజాలుత్పత్తి— 1961 - 62 నాటికి 248 కోట్లవరకు పెరగడానికి అనుమతిస్తామన్నారు.

1952 నుండి మిల్లుగుడ్డమీద గ॥ 1కి 3 పాత పైసలు చొ॥న సెస్ విధించి, ఆ నిధిని చేనేతకు ఉపయోగిస్తున్నారు. సాలీనా 4½ కోట్ల రూ. సెస్సు కోఆపరేటివ్ చేనేతసంఘాలకే వినియోగిస్తున్నారు. కాని, బైటవారికి దానివల్ల సహాయంలేదు. ఐనప్పటికి 1–4–56 తేదీనాటికి కోఆపరేటివులలో 10,26,500 మగ్గాలు వున్నట్టు లెక్కకు వచ్చింది. గాని, వాటి ఉత్పత్తి మాత్రం 1955–56 లో 17 కోట్ల గజాలుమాత్రమే అనగా మొత్తం చేనేత ఉత్పత్తిలో సుమారు పదింటఒకవంతు– 4 ఏళ్ళు సెస్సుస్కీములు అమలు జరిగిన తరువాత—అవుతున్నది.

పని లేనివాళ్ళకులేకపోగా ఉన్నవాళ్ళకు ఎంతకూలి కిటుతున్నది? కానుంగో కమిటీవారే శాంపిల్ సర్వే 1953 లో

చేయించినారు. 32 మంది నిపుణులను ఇండియాలోని 350 చేనేత గ్రామాలకు పంపి పరిశోధన చేయించినారు. వారు తేల్చిన లెక్కలలో మచ్చుకు ఏలూరు తీసుకుందాం. ఇక్కడ 1951 జనాభా లెక్కప్రకారం 1137 మగ్గాలు. కలెక్టరాఫీసులో కనుక్కుంటే 2255 మగ్గాలన్నారు. స్వయంగా లెక్కపెడితే 2187 వున్నాయి. అక్కడ అక్కడ 65 మగ్గాలను ఆకస్మికంగా, ఆలోచించకండా (రేండం) ఎంచి వారి ఉత్పత్తులు ఆదాయ వ్యయాలు పరిశీలించేరు. ఈవిధంగా దామాషా వచ్చింది 1951 - 52 లో మగ్గం 1కి నెలకు $46\frac{1}{3}$ గజాలు, 1952-53 లో $39\frac{1}{2}$ గజాలు, 1953-54 లో 45 గజాలు ఉత్పత్తి. 1953-54లో మగ్గం 1కి ఆదాయం రు 44-4-11 లు. కుటుంబవ్యయం రు 52-8-1. ఇందులో ఆహారవస్తువులకు రు 31-1-5. నెలవారీ ఋణం రు 8-3-2. 1954 డిశంబరులో అ. భా. చే. బోర్డు వారు ఏలూరులో మరల సర్వే చేయించగా నెలవారి ఆదాయం 1954 జూన్ — డిశంబరు మధ్య రు 40/- వచ్చింది.

1953-54 లో అవస్థ హీనంగా ఆ విధంగావుంటే సెస్ స్కీములు, పం॥ వ॥ ప్రణాళికలు అమలు జరగడంవల్ల ఈ 1957 లో ఎంతవరకు మెరుగైనదో చూద్దాం.

అభివృద్ధికి నిజమైన కొలతబద్ద చేనేతవారికి మిగిలేకూలి. ఈ ప్రాతిపదికను టారిఫ్ బోర్డువారు, విషయసేకరణ కమిటీ వారూ కూడ నొక్కి చెప్పేరు. కూలి, నిజమైన కూలి రెంటిని

విడదీసి చూడాలి. ఉదాహరణకు : శేరుబియ్యం రు 0-6-0 లకు అమ్మినపుడు కూలి రోజుకు ఆరణాలు వచ్చిందనుకుందాం. శేరు బియ్యం రు 0-12-0 అమ్మినపుడు, కూలి తొమ్మిదణాలు అయిందనుకుందాం. అనగా కూలిలో 50 శాతం పెరిగింది; బియ్యంలో నూరు శాతం పెరిగింది. గనక అందులోనుండి దీనిని తీసివేస్తే యింకా 50 శాతం నిజమైన కూలి తగ్గినట్టే లెక్క.

ఆహారధాన్యాల టోకు ధరలు 1939 లో 100 పాయింట్లయితే 1953 లో 444, ఈ 1957 జూలైలో 567 పాయింట్లు అని ధరలసూచి చెపుతున్నది. చేనేతవారు నూలు ఎక్కువ వినియోగించితే ఎక్కువ పని చేసినట్లు, తద్వారా ఎక్కువ సంపాదించుకుంటున్నట్టు ప్రభుత్వం అంచనా వేసుకుంటూ వుంది. ఎంత లోపభూయిష్టమైనప్పటికి ఆ పద్ధతినే చూచినా 1953 లో నెల 1కి సగటు ఫ్రీయారన్ * 73,101 బేళ్లు అయితే 1956 జనవరి మార్చి మధ్య-నెలవారీ సప్లయి 84312. ఆ తరువాత అంకెలు లేవుగాని వెయ్యి బేళ్లు అటో ఇటో వుండవచ్చునేమో. అనగా నూలు సప్లయి 15 శాతం పెరిగితే-ఆహారధాన్యాల ధరలు 28 శాతం పెరిగింది. ఒకడుగు ముందుకు, రెండడుగులు

* మిల్లులుపయోగించుకోగా పవర్ మగ్గాలకోసం, చేమగ్గాలకోసం, మార్కెటుకు వచ్చిన నూలును "ఫ్రీయారన్" అంటారు. దీనిలో నూటికి 76 వంతులు చేనేతకు 14 వంతులు పవర్ మగ్గాలకు, 10 వంతులు ఇతరములకు.

వెనక్కి పడ్డాయి. 10 ఏళ్లై స్వరాజ్యం వచ్చినా 7 ఏళ్ళ నుండి ప్లానింగ్ అమలు జరుగుతున్నా, 4 ఏళ్ళనుండి సెస్సు స్కీములు నడుపుతున్నా—చేనేత జనాభాలో నిరుద్యోగం, అర్ధనిరుద్యోగం యింకా దారుణ రూపంలోనేవుంది. దానికితోడు యీ హెచ్చు ధరలు వచ్చి మరీ కృంగదీస్తున్నాయి.

ప్లానులో క్రమబద్ధమయిన ప్రణాళిక కాగితంమీద వుండిపోయింది. కష్టజీవుల జీవన రంగంలో మాత్రం అరాచకము, అస్థిరత్వము, ఆందోళన తగ్గలేదు. ప్లాను ప్రకారం ప్రాజెక్టులు ప్రారంభమైనమాట నిజమేగాని ప్లాన్ ప్రకారం ప్రజల జీవనస్థాయి పెరగడంలేదు.

ఆహారధాన్యాలు, నూలు మొదలైనవాటి న్యాయమైన ధరల స్థిరీకరణమీద మాత్రమే ఏ చేనేత పథకమైనా విజయం సాధించడానికి అవకాశం కలుగుతుంది. కనీస నేత కూలి నిర్ణయం స్థూలంగానైనా చేసి, సొసైటీలలోనైనా నిర్బంధంగా ప్రవేశపెట్టాలి. వెంటనే సగానికిపైగా మగ్గాలు కోఆపరేటివ్‌లలోకి తీసుకుని ప్రతినెలా 26 రోజులకు తక్కువగాకండా పని చెప్పాలి. సొసైటీల బట్ట అమ్మకంలో ప్రభుత్వం బాధ్యతను పంచుకోవాలి. ప్రమాదం వచ్చినపుడు అప్పు యిచ్చినంత మాత్రాన సరిపోదు. *

* చైనాలో అన్ని వస్తువులలోను దేశం మొత్తంమీద జరిగిన చిల్లర అమ్మకంలో వివిధరంగాల వాటాలు.

| | శాతములు | | | | |
|---|---|---|---|---|---|
| | 1950 | 1952 | 1953 | 1954 | 1955 |
| మొత్తం | 100 | 100 | 100 | 100 | 100 |
| ప్రభుత్వ దుకాణాలు- | 7·9 | 15·8 | 17·0 | 19·5 | 27·0 |
| సహకార సంఘాలు- | 4·9 | 18·3 | 24·3 | 38·3 | 30·5 |
| పెట్టుబడిదారులు ప్రభుత్వం కల్సిన జాయింటు వ్యాపారాలు – రోడ్డు ప్రక్కబడ్డీలవారి కోపరేటివులు – | 0·2 | 0·3 | 0·4 | 4·7 | 12·7 |
| స్వంత వ్యాపారస్థులు, రైతులు స్వంతంగా అమ్ముకున్నవి కల్పి. | 87·0 | 65·6 | 58·3 | 37·5 | 29·8 |

నిజమైన సోషలిస్టు పరివర్తనకీ పట్టి నిదర్శనం.

1956 లో చైనాలో ఈ పరివర్తనం యింకా ముందడుగు వేసింది. ప్రైవేటు పరిశ్రమదారు (మిల్లులు, కార్ఖానాలు గలవారు) లలో నూటికి 99 మంది, వ్యాపారాలు చేసేవారిలో నూటికి 80 మంది "ప్రభుత్వం–పెట్టుబడి దారు జాయింటు" రంగంలోనికి ఇచ్ఛికంగా వచ్చినారు. చేతిపరిశ్రమల్లో నూటికి 90 మందికి పైగా కోపరేటివ్‌లలో చేరిపోయేరు. 1956 తో సోషలిస్టు విప్లవం పూర్తి అయిందని భావించుకోవచ్చునన్నారు. దీనివల్ల ఉత్పత్తులు తగ్గి దేశంలో కరువు వచ్చిందా? లేదు. ఐక్యరాజ్యసమితియొక్క ప్రపంచ ఆర్థిక రిపోర్టు 30-6-57 సంచికలో యీ విధంగా వ్రాసేరు. "1956 సం॥లో భూమండలంమీద అన్ని దేశాలలోకన్న చైనాలో పారిశ్రామికోత్పత్తి ఉరకలు వేసుకుంటూ అభివృద్ధి పొందింది."

రెండవ ప్రకరణం.

# అఖిలభారత చేనేత బోర్డు - నిర్మాణం.

ఇండియా ప్రభుత్వ తీర్మానం నెం. 48 (23-C. T.(A) 52 తేదీ 25-10-1952 ప్రకారం ఈ బోర్డు నియమించబడినది. ఈ బోర్డు కేంద్ర వాణిజ్య, పరిశ్రమల మంత్రిత్వశాఖక్రింద పని పనిచేయును (ప్రస్తుతం అంటే 1956 లో ఈ రెండు శాఖలు విభజింపబడినవి. ఈ బోర్డు వినిమయవస్తువుల, పరిశ్రమలశాఖ క్రింద పనిచేయును).

## బోర్డు సభ్యులు.

1. ఇండియా టెక్స్టైల్సు కమీషనర్ (బొంబాయి) అధ్యక్షులు.
2. బొంబాయి టెక్స్టైల్సుకమీషనర్ ఆఫీసులోని డైరెక్టరు [నూలు, చేనేత]. బోర్డు కార్యదర్శి.

సభ్యులు :—

3. (శ్రీ) యన్. జి. రంగా. యం. పి (ఆంధ్రప్రదేశ్)
4. ,, అబ్దుల్ క్వాయూమ్ అన్సారీ (బీహార్)
5. ,, యం. సోమప్ప (ఆంధ్ర)ఎమ్మిగనూర్.(ఆంధ్రప్రదేశ్)

6. శ్రీ యం. పి. నాచిముత్తు మొదలియార్. ఈరోడ్డు. మద్రాసు స్టేటు సొసైటీ ప్రశిడెంటు.
7. ,, యస్. ఆర్. వాసవదా. అహమ్మదాబాద్. మిల్లు కార్మిక సంఘం.
8. ,, ఆర్. వి. నాయుడు. మిల్లు యజమానుల సంఘం. కోయంబత్తూర్.
9. ,, జేమ్సు ఆంద్రూ. మధురై.
10. ,, ఆర్. ఏ. పోదార్. బొంబాయి.
11. ,, యన్. యల్. బాలేకార్. నాగపూర్ (స్టేటుసొసైటీ)
12. ,, యస్. బెనర్జి. సిరాంపూర్. హుగ్లీ జిల్లా, పశ్చిమ బెంగాల్.
13. ,, నవాబ్ అజీజ్ రసూల్. యం. యల్. ఏ. సందీలా. ఉత్తరప్రదేశ్.
14. ,, కొండా లక్ష్మణ్. యం. యల్. ఏ. ఆంధ్రప్రదేశ్.
15. ,, కె. బాలకృష్ణ మరార్. త్రిచూర్. కేరళ.
16. ,, యఫ్. యం. భరద్వాజ్. హుబ్లి. కర్ణాటక.
17. ,, యం. యం. పట్నాయక్. ప్రభుత్వ ఖాది సలహాదారు (ఒరిస్సా)
18. శ్రీమతి కమలా దేవి ఛట్టోపాధ్యాయ (లేక ఆమె ప్రతినిధి)
19. శ్రీ అబ్దుల్ మజీద్. మద్రాసు.
20. ,, డైరెక్టర్ ఆఫ్ యిండస్ట్రీస్. ఉత్తరప్రదేశ్.
21. ,, ,, ,, బీహారు.

22. ,, రిజిస్ట్రార్ ఆఫ్ కోఆపరేటివ్ సొసైటీస్. మద్రాస్.
23. ,, ,, ,, ,, ఆంధ్రప్రదేశ్.
24. ,, డైరెక్టర్ ఆఫ్ యిండస్ట్రీస్. మధ్యప్రదేశ్.
25. ,, డైరెక్టర్ ఆఫ్ సెరికల్చర్ (ప్యూర్‌శిల్కు) అండ్ వీవింగు. అస్సాం.
26. ,, డైరెక్టర్ ఆఫ్ సెరికల్చర్ (ప్యూర్‌శిల్కు) అండ్ వీవింగు. పశ్చిమబెంగాల్.
27. ,, డైరెక్టర్ ఆఫ్ సెరికల్చర్ (ప్యూర్‌శిల్కు) అండ్ వీవింగు. కేరళ.
28. ,, జాయింటు రిజిస్ట్రార్, యిండస్ట్రియల్ కోఆపరేటివ్స్ అండ్ విలేజ్ యిండస్ట్రీస్. బొంబాయి.
29. ,, కోఆపరేటివ్ రిజిస్ట్రార్. ఒరిస్సా.
30. ,, ఇండస్ట్రీస్ డైరెక్టర్. పంజాబ్.
31. ,, రఘునాథసింగు. యం. పి. బనారస్.
32. ,, కేంద్రప్రభుత్వ ఆర్థికశాఖ. (బొంబాయి మకాం) లోని అండర్ శెక్రటరీ. బొంబాయి.
33. ,, డైరెక్టర్ ఆఫ్ యిండస్ట్రియల్ జేషన్, మైసూరు.
34. శ్రీమతి పుపుల్ జయకర్.

స్టాండింగుకమిటీ (స్థాయీసంఘం)

ఈ బోర్డువారు తేదీ 13-12-1953 న క్రిందివారితో స్టాండింగు కమిటీని ఏర్పరచినారు.

1. బోర్డు అధ్యక్షులే స్టాండింగు కమిటీకి గూడా అధ్యక్షులు.
2. శ్రీ యన్. జి. రంగా. యం. పి. సభ్యులు.
3. ,, అబ్దుల్ క్వయూమ్ అన్సారి ,,
4. ,, మాచాని సోమప్ప ,,
5. ,, కొండా లక్ష్మణ్ ,,
6. ,, నవాబ్ అజీజ్ రసూల్ ,,
7. ,, మద్రాస్ కో.ఆ. రిజిస్ట్రార్ ,,
8. ,, బొంబాయి కో.ఆ. రిజిస్ట్రార్ ,,
9. ,, బొంబాయి మకాంలోని కేంద్ర ఆర్థికశాఖ అండర్ శెక్రటరీ ,,

బోర్డు ఆఫీసు.

1954 ఫిబ్రవరినుండి పనిచేస్తున్నది. అడ్రసు:- ఆలిండియా హాండ్‌లూం బోర్డు. షాహీబాగ్ హౌస్, విటెట్ రోడు, బల్లార్డ్ ఎస్టేటు, బొంబాయి. 1.

చరిత్ర.

ఫేక్టు ఫైండింగు కమిటీ:—

1940 డిశంబర్‌లో ఢిల్లీలో ఇండియా ప్రభుత్వంవారు ఒక హాండులూం కాన్ఫరెన్సు (చేనేత మహాసభ) ను ఏర్పాటు చేశారు. దానిలో రాష్ట్ర ప్రభుత్వాలు, మిల్లుయజమానులు, చేనేత ప్రతినిధులు పాల్గొన్నారు. వారు పరిస్థితులు పరిశీలించ

డానికై ఒక కమిటీని నియమించాలని కోరుతూ ఏకగ్రీవంగా తీర్మానించారు. ఆ ప్రకారం 1941 లో "ఫేక్ట్సుఫైండింగుకమిటీ" (విషయసేకరణ సంఘం) ని ప్రభుత్వం ఏర్పరచింది.

కమిటీ సభ్యులు :—

1. శ్రీ డాక్టర్. పి. జె. థామస్. యం. ఏ. B. Lit. D. Phil. (ఆక్సుఫర్డు) కమిటీ చైర్మన్.
2. శ్రీ రాయబహాదూర్, హెచ్. ముఖర్జీ. ఎ. యం. సి. టి.
3. శ్రీ బి. పి. అడార్కర్. యం. ఏ. (కేంబ్రిడ్జ్) కమిటీ శ్రెకటరీ.

వీరి నివేదిక ఈ పరిశ్రమమీద ప్రధానమయిన మొదటి పుస్తకం; అధికార పూర్వకమయినదీనూ. దానిలోని సంఖ్యా వివరములు పాతబడినప్పటికీ కొన్ని ముఖ్యమైన సిఫార్సులకు నేటికీ విలువవుంది. చేనేతపనివారల కష్టములన్నీ వాస్తవములనీ, వాటిని ఆలోచించి నివారించుటకుగాను కృషిచేయు నిమిత్తం ఆలిండియా హాండులూంబోర్డు నిర్మించాలని సిఫార్సు చేసింది వీరే.

1945 లోనే ఆలిండియా హాండులూంబోర్డు ఏర్పరచబడింది. ఆ బోర్డు ఒక ప్రధానమయిన కోర్కెను కోరుతూ తీర్మానించింది. క్రొత్తగా మిల్లుల్లో అమర్చుతున్న కదుళ్ళలో 100 కి 50 వంతులు మిల్లుమగ్గాలకు సంబంధంలేకుండా చేనేతకు కేటాయించుమని కోరింది. కాని, ప్రభుత్వం ఇండియా మొత్తంమీద

100 కి 25 వంతులు మాత్రం నిర్ణయించి, రాష్ట్రప్రభుత్వాల కివ్వబడిన నూలుకోటాలలో వారు తమకిష్టమయిన వైఖరి నవలంబించవచ్చునని చెప్పింది. అందువల్ల మద్రాసుప్రభుత్వం తన కొచ్చిన నూలుకోటాలో 100 కి 50 వంతులు చేనేతకు కేటాయించింది.

మరొక ముఖ్యమయిన తీర్మానమేమంటే చేనేత సహకారోద్యమ వ్యాప్తికి ముఖ్యంగా ఎక్స్‌మిల్లు రేటుకు (అంటే బట్టల మిల్లులకు లభించే ధరకు) నూలు సప్లయి చేయుటకు కృషిచేయుమని చెప్పింది. నాటికీ నేటికీ కూడా యీావన్నంది చేనేతవారి కోర్కెగా ఇది అలాగే వుండిపోయింది. ఇది చేనేతపరిశ్రమకు ప్రాణాధారమయిన హంశమనడంలో సందేహంలేదు. చేనేత పారిశ్రామికునకు ఎక్స్‌మిల్లు రేటుకు నంబరునూలు సప్లయి అయితేనేతప్ప బట్టను కొంటే ప్రస్తుతమిస్తున్నట్లుగా "రిబేటు" వంటి "గోసాయి చిట్కా" లతో చేనేత పరిశ్రమ సంపూర్ణంగా కాపాడబడదు. ఈ "రిబేటు" కూడా సొసైటీలలో తయారైన గుడ్డకుమాత్రమే యివ్వబడుతున్నది. సొసైటీల బయటగల 100కి 75 వంతుల పరిశ్రమకు యిందువల్ల ఏలాంటి సదుపాయం లేదు. ఎక్స్‌మిల్లు రేటుకూ, చేనేత పారిశ్రామికుని చేతికందినప్పుడు యిచ్చుకొనే ధరకూగల వ్యత్యాసాన్ని పూరించడానికి "సెస్సునిధి"ని వినియోగిస్తే ఎంతోలాభం. అయితే ప్రస్తుతం వసూలవుతున్న రు. $4\frac{1}{2}$ కోట్ల సెస్సునిధి చాలుతుందా అని అంటే, చాలకపోయిన జనరల్ రెవిన్యూ నుండే కేటాయించవచ్చును.

బంగారులక్క, చక్కెర, తగరం, అల్యూమినియంవంటి మరెన్నో పరిశ్రమలకు "మైనర్ పరిశ్రమలు" అనే పేరుతో వాటి రక్షణకు ఏటేటా కోట్ల ద్రవ్యం కేటాయిస్తున్నట్లుగానే, యావద్భారతంలో వ్యవసాయం తర్వాత రెండవ పరిశ్రమయైన చేనేతను కాపాడడానికి సొమ్మును జనరల్ రెవిన్యూనుంచి కేటాయించడంలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. ఈ విధంగా బట్ట కొను గోలుపై రిబేటుగాకుండా నూలు కొనుగోలుపై రిబేటు యిస్తే-అది సహకారరంగమైనా, బయటిరంగమైనా-మొత్తం పరిశ్రమకంతా సమానంగా వర్తిస్తుంది. అంతేగాక ప్రస్తుతం సెస్సునిధి వినియోగం, అమలుజరుపుటలలో అయ్యే దుర్వినియోగాలు పోవడమేగాక, కార్వేకమిటీవారన్నట్లు రిబేటు పంపకానికి ఏర్పరచిన పద్ధతిలోగల రకరకాలచిక్కులు కూడా వైదొలగగలవు. ఈ పద్ధతిని "నూలుకొనుగోలుపై రిబేటు" ను అమలుచేయడానికి తగిన పటిష్ఠమయిన వ్యవస్థనుమాత్రం యోచించి ఏర్పరచవలసియుంటుంది. యిందుకు యావన్మంది చేనేతవారు ఆందోళన, కృషి చేయవలసివుంది.

1945 లో ఏర్పరచిన ఈ బోర్డును 1947 లో రద్దుచేసేరు.

1948 లో స్టాండింగు హాండులూం కమిటీ (చేనేత స్థాయీసంఘం) ని కాటేజ్ యిండస్ట్రీస్ బోర్డులో ఒక శాఖగా నిర్మించారు.

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం కొన్ని సంవత్సరాలుగా భారతప్రభుత్వం చేనేతపరిశ్రమాభివృద్ధికై ప్రతి ఏటా

రు. 5 లక్షలు యిచ్చేది. దానిని రాష్ట్రప్రభుత్వాలు తమకిష్టమైన స్కీములకు వినియోగించేవారు.

యుద్ధానంతరం పారిశ్రామిక అభివృద్ధి పథకముల క్రింద అనేక బాపతులుగా రాష్ట్రములకు కేంద్రంచేత డబ్బు యివ్వబడుతున్నదనే నెపంతో ఈ రు. 5 లక్షల గ్రాంటును 1947-48 సం॥ నుండి నిలిపివేశారు.

దీన్ని పునరుద్ధరించమని అప్పటి ఆలిండియా హాండ్‌లూం బోర్డు ఒత్తిడిచేసింది. తుదకు 1949 లో ఇండియాప్రభుత్వం రు. 10 లక్షలతో "చేనేతఅభివృద్ధినిధి"ని నెలకొల్పి పైస్టాండింగు హాండులూం కమిటీకి అప్పగించింది. రాష్ట్రప్రభుత్వాలు దాఖలు చేసే స్కీములు ఈసొమ్ముతో అమలుజరిపేవారు. దీనికి 1950లో మరొక రు.5లక్షలు కలిపి మొత్తం రు15లక్షలుగా యిచ్చేవారు.

1953లో చేనేతపరిశ్రమ సహాయంనిమిత్తం మిల్లుగుడ్డపై గజానికి రు 0-0-3 ప్రకారం * సెస్సునిధి వసూలుచట్టం ప్యాసు చేసి, దాని వినియోగార్థం క్రొత్తగా (ప్రస్తుత) ఆలిండియా హాండులూంబోర్డును ఏర్పరచడంతో పై పాతవ్యవస్థలు కాలదోషంపట్టి సహజంగానే రద్దయిపోయినవి.

---

* ఈ సెస్సుఫండు స్కీము 10 సం॥లు అమలుజరుపవలెనని నిర్ణయము. మొదట్లో యిందువల్ల ఏటా రు. 6 కోట్లు రాగలదని అంచనా వేశారు. కాని ఆ తర్వాత విదేశాలకు ఎగుమతిఅయ్యేగుడ్డను ఈ స్కీము నుండి మినహాయింపు చేయడంతో యిందువల్ల వచ్చే సెస్సుఫండు ఆదాయము రు. 4½ కోట్లకు తగ్గిపోయినది.

## కార్యక్రమము — నివేదిక.

1. సెంట్రల్ మార్కెటింగు ఆర్గనైజేషన్ సంస్థ.

యుద్ధకాలంలో ఇండియాప్రభుత్వానికి నూలు కంట్రోలరుగానున్న శ్రీ యం. ఆర్. రాజమీనాగారు ఈ స్కీమును తయారుచేసి ఆలిండియా హాండులూంబోర్డు (అ. భా. చే. బోర్డు) వారిచే ఆమోదింపజేశారు. యిది ముఖ్యంగా దేశంలోని ఆంతరంగిక మార్కెటింగు అభివృద్ధికి ఉద్దేశింపబడింది. ఈ సంస్థ మార్కెటింగువ్యవహారంతోపాటు కో-ఆపరేటివుల నిర్మాణం, చేనేత ఉత్పత్తిలో రేషనలైజేషన్ (క్రొత్తపనిముట్ల ప్రవేశం), రిసెర్చి (క్రొత్తపనిముట్ల పరిశోధన), పబ్లిసిటీ (ప్రచారం) ఈ అంశములను గూడా చూడవలసియుండును.

ఈ సంస్థ తేదీ 1-7-53 న యిండియా అంతటికీ కేంద్ర ఆఫీసును మద్రాసులో ఏర్పరచుకొన్నది. 1955 మార్చిలో బనారస్ (కాశి) లో ఏర్పరచి దానికి ఉత్తరభారతదేశమంతా అప్పగించి, మద్రాసులోని ఆఫీసు దక్షిణభారతదేశంమాత్రం చూచుకుంటున్నది. దీని అడ్రసు యిది:—ఆలిండియా సెంట్రల్ మార్కెటింగ్ ఆర్గనైజేషన్. 98 మాబ్రేస్ రోడ్డు, మద్రాసు-18. మరియు బొంబాయి, కలకత్తా, నాగపూర్, గ్వాలియర్, సికింద్రాబాద్, త్రివేండ్రంలలో ప్రాంతీయ ఆఫీసులున్నవి.

వీటి ఉపప్రాంతీయ ఆఫీసులను యిటీవల స్థాపించారు. విజయవాడ (18/343 మునగాలహౌస్, పూర్ణానందంపేట) లో యిట్టిదొకటుంది.

2. ఎగుమతుల స్కీము.

శ్రీ జె. సి. రేయూన్ (మద్రాసు కో.ఆ. రిజిస్ట్రారు. ప్రస్తుతం రిజర్వుబ్యాంక్ అఫ్ ఇండియాకు బదిలీ అయినారు) గారు ఈ స్కీముకు తయారుచేసి ప్రభుత్వంచే ఆమోదింప జేశారు. దీనిప్రకారం చేనేత మార్కెటింగు ఆఫీసర్లు బాగ్దాద్ (ఇరాక్), రంగూన్ (బర్మా), సింగపూర్ (మలయా), కొలంబో (లంక) లలో 1954 లో ఏర్పడినారు. ఎంపోరియం (విక్రయ శాల) లు 8 చోట్ల స్థాపింపబడినవి. కొలంబో, ఏడెన్ (అరే బియా) సింగపూర్, రంగూన్, బాంగ్ కాక్, (సయాం) కరాచీ (పాకిస్తాన్), చిట్టగాంగ్ (తూర్పుబెంగాల్), కౌలాలంపూర్ (మలయా) లలో ఏర్పరచారు. 1954–55 లో మొత్తం 7 లక్షల రూ॥లు, 1955–56 లో 12 లక్షల రూ॥ అమ్మినారు.

3. అమెరికాలో చేనేత వ్యాపారకేంద్రం.

19 ఈస్టు. 49 స్ట్రీట్, న్యూయార్కులో 17–1–1955 తేదీన తెరువబడింది. లండనునగరంలోగూడా యిండియా హైకమీషనర్ ద్వారా ఒక చేనేతప్రదర్శనశాల (ఎగ్జిబిషన్ షోరూం) ను 1953 డిశంబర్‌లో అ. భా. చే. బోర్డు ఏర్పరచింది.

4. ఆఫ్ఘన్ రాయబారవర్గం.

ఆరుగురు ఆఫ్ఘన్ ప్రముఖులు చేనేతపరిశ్రమను పరిశీలించ డానికి 1954–55 లో యిండియావచ్చి దేశమంతా తిరిగి బోధ పరచుకొని వెళ్ళినారు.

5. సెంట్రల్ రిసెర్చి యిన్‌స్టిట్యూట్ (కేంద్ర పరిశోధనాశాలలు).

బనారస్‌లో ఉత్తరప్రదేశప్రభుత్వం యిట్టిదాన్ని ఒకటి నడుపుతున్నారు. దీనినే ఇండియాప్రభుత్వం తీసికొన్నారు. యింకనూ పెద్ద సాంకేతికనిపుణులను నియమించడానికి అ. భా. చే. బోర్డు పూనుకొన్నది. ఇది ఉత్తరదేశానికి ఉపయోగపడుతుంది. అలాగునే మద్రాస్‌లోని చేనేత ఇన్‌స్టిట్యూట్ కేంద్రప్రభుత్వం కొనివేసి సేలంకుమార్చి దక్షిణదేశానికి కేంద్రపరిశోధనాశాలగా చేయడానికి సంకల్పించేరు.

6. సెంట్రల్ డిజైన్ సెక్షన్ (కేంద్ర డిజైనులశాఖ).

1953 లోనే దీనికి రు. 20,000 అ. భా. చే. బోర్డువారు ఖర్చుచేయడానికి యిండియా ప్రభుత్వం శాంక్షన్ చేసింది. పైనుదహరించిన బనారసు సంస్థలో దీనినేర్పరచి ఖర్చుచేయనుద్దేశింపబడింది. బొంబాయి, మద్రాస్, ఢిల్లీలలో గూడ అఖిలభారత డిజైన్‌సెంటర్లు స్థాపింపబడ్డాయి. ఉపసెంటర్లు కాంచీపురం, చందేరీ, సూరత్‌లలో పెడతారు.

7. రిజర్వుబ్యాంకుద్వారా పరపతి సౌకర్యాలు.

(1) 1954–55 లో చేనేతకు పరపతిసౌకర్యాలు భారీగా కలుగజేయుటకు రిజర్వుబ్యాంకు చట్టం 17 వ సెక్షన్‌కు ఒక సవరణ చేయబడింది. దానిప్రకారం ఆ బ్యాంకునుండి తీసికొన్న అసలు, వడ్డీలకు రాష్ట్రప్రభుత్వం గ్యారంటీ యివ్వాలి. (2) సదరు ఋణము 12 నెలలలో తీర్చవలెను. (3) ఈ డబ్బును చేనేత

బట్టఉత్పత్తికిగాని, మార్కెటింగుకుగాని మాత్రమే వినియోగించవలెను. (4) డబ్బును స్టేటు కో॰ఆ. బ్యాంకు ద్వారాగాని, స్టేటు ఫైనాన్సు కార్పొరేషను ద్వారాగాని, ప్రభుత్వం నేరుగా గాని (గ్రాంటు) తీసికొనవచ్చును. స్టేట్ సొసైటీ షేర్ కాపిటల్ రిజర్వు ఫండ్ కలిపిన మొత్తానికి మూడురెట్లు అప్పు యివ్వబడుతుంది. వడ్డి 3½%. మొత్తం రు. 30 కోట్లు అప్పుకావలసి వుండునని అంచనా.

ఈ సమాచారాన్ని రిజర్వుబ్యాంకు పంపగా అనేక రాష్ట్రప్రభుత్వాలు ఉత్సాహంగా సమాధానములు పంపలేదు. బహుశః రాష్ట్రప్రభుత్వపు గ్యారంటీఅనే షరతు యిందుకు కారణమై యుండవచ్చును. ప్రస్తుతం ప్రాథమిక కో॰ఆ. సొసైటీలకుగాని, స్టేటు కో॰ఆ. సొసైటీలకుగాని అప్పులు సెస్సుఫండు నుండి యివ్వబడుతున్నవి. ఇది తాత్కాలికపు ఏర్పాటు మాత్రమే. అంతేగాక మొత్తం అవసరాలన్నీ తీర్చడానికి ఈ ఫండు ఏమాత్రం చాలదు. అయినప్పటికీ రాష్ట్రప్రభుత్వాలకు చేనేతపరిశ్రమ లాభదాయకం కాదేమోననే సంశయం వున్నందువల్ల - రిజర్వుబ్యాంకు కలుగజేసిన ఈ సౌకర్యమును అన్ని రాష్ట్రములు అంతగా వినియోగించుకొనడంలేదు.

8. స్టాటిస్టిక్సు (సంఖ్యావివరాలు).

చేనేతపరిశ్రమయొక్క వివిధ సంఖ్యావివరములు సేకరించి పంపుమని రాష్ట్రప్రభుత్వాలను అ. భా. చే. బోర్డు కోరగా

4

ఆ పనికి తగిన సిబ్బంది లేదనీ, సిబ్బందికిఖర్చు బోర్డువారిస్తే పని జరుగుతుందనీ వారు తెలిపారు. అందువల్ల ఈ పనికి వివిధరాష్ట్ర ప్రభుత్వాలకు అ. భా. చే. బోర్డు 1954-55 లో రు. 4,20,000 శాంక్షన్ చేశారు.

9. విశ్వవిద్యాలయంవారిచే పరిశ్రమను సర్వేచేయించుట.

మగ్గాలసంఖ్య మొదలుకొని చేనేతకు సంబంధించిన అనేక సంఖ్యావివరములు, మజూరీ, ఉద్యోగ నిరుద్యోగములు, చేనేత వారి జీవనపరిస్థితులు, వ్యాపారసరళి మొదలైన అన్ని అంశముల మీద సర్వే జరగాలని అ. భా. చే. బోర్డు నిర్ణయించినది. ప్రస్తుతం ఒక్క మద్రాసు విశ్వవిద్యాలయమునకు మాత్రమే యిందుకై రు. 65,000 లు యిచ్చి 18 నెలలలో (1956 ఆగస్టు నాటికి) సర్వేరిపోర్టు పంపుమని కోరింది. ఈ సర్వేకు ఆ విశ్వ విద్యాలయంలోని అర్థశాస్త్ర ప్రధానాధ్యాపకుడు డా॥ బాల కృష్ణ. యం. ఏ., పి. హెచ్ డి. గారు నియమించబడినారు. క్రమ క్రమంగా యితర విశ్వవిద్యాలయములకుగూడ సర్వేపనిని అప్ప గించి దేశమంతా సర్వే పూర్తిచేయించాలని బోర్డువారి సంకల్పం. (సర్వే అన్నంతమాత్రాన ప్రతిచిన్న చేనేత కేంద్రమూ చూడబడదు. ముఖ్యమైనవే చూడబడుతాయి).

1955-56 లో బోర్డున్ను, స్థాయిసంఘమున్ను చేసిన కొన్ని తీర్మానములు.

(1) <u>చేమగ్గాల స్థానంలో పవర్ మగ్గాలను</u> ప్రవేశపెట్టా లన్న హాంశంతప్ప మిగతా కానుంగోకమిటీ సిఫారసులను

స్థూలంగా బోర్డు అంగీకరించింది. చేమగ్గాలలోనే అధికంగా ఉత్పత్తి చేయగల క్రొత్తగా కనిపెట్టబడే మగ్గాలను ప్రవేశపెట్టాలనే బోర్డు అభిప్రాయం. రకాలకేటాయింపు చేనేతరంగానికే వర్తించాలని— ఆ రకాలింకా ఎక్కువకావాలని బోర్డు కోరింది. (ది 2-8-55)

(2) గ్రామీణ చిన్నపరిశ్రమలకమిటి (కార్వే రిపోర్టు)ను బోర్డు చర్చించింది. అంబర్ చర్ఖాను యింకా పరీక్షించవలసి వుంటుందని, అంతవరకు నూలుమిల్లులకు కొత్తకదుళ్ళ లైసెన్సు ఆపరాదని, ఈ లైసెన్సులు సాధ్యమయినంతవరకు కోఆపరేటివ్ రంగంలోగాని, పబ్లిక్ రంగంలోగాని యివ్వాలని బోర్డు కోరింది. (ది 28-11-55)

(3) విదేశాల కెగుమతి అయ్యే చేనేత గుడ్డలమీద నాణ్యం తనిఖీ చేసి మార్కు వేయడంవల్ల విశ్వాసం ఏర్పడుతుంది. విశ్వాసంవుంటేనే వ్యాపారం అభివృద్ధి పొందుతుంది. కేంద్రప్రభుత్వంచే స్థాపించబడి 1947 నుండి పనిచేస్తున్న భారతీయ వస్తు ప్రామాణీకరణసంస్థ (ఇండియన్ స్టాండర్డ్సు ఇన్స్టిట్యూట్, ఢిల్లీ-8) యొక్క వస్తువిభాగానికి కొన్ని చేనేతగుడ్డలు పంపబడినవి. ప్రమాణముద్ర (క్వాలిటీమార్కింగ్) పద్ధతి విదేశాలకెగుమతి చేసే అన్నిసరుకులలో వున్నట్టే వీనిలో ప్రవేశపెట్టుటకు సూచనలు చేయమని స్థాయిసంఘం ఒక సబ్ కమిటీని నియమించింది.

(4) <u>పరిశోధనాలయానికి</u> ఆంధ్రలో స్థలానికి భవనానికి రు. 50,000 ఉచితంగా యిమ్మని కోరితే అప్పుగాయిస్తామని కేంద్రప్రభుత్వం చెప్పింది. అప్పు అక్కరలేదని తన స్వంతసొమ్ము యిస్తామని రాష్ట్రప్రభుత్వం చెప్పింది.

(5) <u>విదేశాలకు చేనేతబట్ట ఎగుమతిచేసే స్కీము</u> (ఎక్ట్సెర్నల్ మార్కెటింగ్‌స్కీం) అంతా ఫాబ్రిక్స్ మార్కెటింగ్ సొసైటీయే నిర్వహించాలన్న సూచన లోతుగా ఆలోచించవలసివున్నది.

(6) <u>ప్రభుత్వమే స్టేట్ సొసైటీలలో వాటాదారుగా</u> వుండాలన్న హంశం ఆలోచనలో వున్నది. ప్రాథమిక సొసైటీలలో వాటాదారుగా వుండనక్కరలేదని ప్రస్తుతం నిర్ణయించింది.

10. కోపరేటివ్‌లకు బైట.

మాస్టరు వీవరుక్రిందగాని, మరొకవిధంగాగాని వున్న చేనేతవారికి సహాయము, సెస్సునిధినుండి ఎలాచేస్తే బాగుంటుందో విచారించి సలహాయివ్వడానికి సబ్ కమిటీ వేయబడింది. వారు రిపోర్టు దాఖలుచేసేరు. కాని, యింకా దానిలోని వివరాలు బైటపడలేదు.

11. కోఆపరేటివ్ చేనేతకార్ఖానా సొసైటీలు.

మలబార్‌లో రెండు మచ్చుకు ప్రారంభింపబడ్డాయి. అక్కడ కార్ఖానాపద్ధతి అమలులో వుంది. పాతకార్ఖానాలు, మాస్టరు వీవర్సుయొక్క స్థలము, షెడ్, మగ్గములు కొనివేయ

బడెను. కార్ఖానాలో పనిచేసేవారితో సహకారసంఘం స్థాపింప బడింది. ఒకదానికి రు. 70,000 వడ్డీలేని అప్పు యివ్వబడెను. (దీనిలో 75 మగ్గాలకు రు. 30,000 వర్కింగ్ కాపిటల్ అప్పు) సబ్ రిజిస్ట్రారును కార్యదర్శిగా యిచ్చేరు. నెలకు రు. 400/- సిబ్బందిఖర్చు ఉచితం గ్రాంట్ యివ్వబడింది. ఎన్నికైన డైరెక్టర్ల బోర్డుక్రిందనే పనిచేసింది. 11 మాసములకు 75,000 రూ॥ సరుకు తయారైంది. నెలకు దామాషాను రు. 55/- నేత ఆసామీకి ముట్టినది. సొసైటీకి 11 మాసములకు లాభం రు. 11000/- నికరలాభం రు. 4000/- రెండవదానిలో 52 మగ్గాలు, 9 మాసములకు రు. 92500/- సరుకు ఉత్పత్తిచేసి రు. 10,000 లాభం, రు. 8000/- నికరలాభం తీసింది.

రెండూ సంతృప్తికరంగానే పనిచేసేయి. కరూర్‌లో ఒకటి, షోలాపూర్‌లో ఒకటి మరల తీసుకోడానికి నిర్ణయింప బడింది. 3 ఏళ్ళపాటు చూచి యీ పద్ధతి బాగా పనిచేస్తే భవిష్యత్తుకు మార్గదర్శికంగా వుండవచ్చునని అ. భా. చే. బో. రిపోర్టులో వ్రాసేరు.

12. ఫిల్ములు : ప్రచారము.

ఢిల్లీలో కేంద్రప్రభుత్వ ఆధ్వర్యాన జరిగిన పెద్ద పారిశ్రామిక ఎగ్జిబిషన్‌లో అ. భా. చే. బో. వారు ఘనమైన స్టాల్ ఏర్పాటు చేసేరు. అనేకవేల చేనేతవస్త్ర నమూనాలు ఉంచబడ్డాయి. ముఖ్యమైన నమూనాల చుట్టూ కథ అల్లి గేవా

కలర్‌లో ఫిల్ము తీయడానికి మెస్సర్సు పటేల్ లిమిటెడ్‌వారితో కంట్రాక్టు జరిగింది. ముఖ్యంగా విదేశాలలో చూపబడుతుంది... బర్మాషెల్ కంపెనీవారు "మెయిందారీలో చేనేతవారు" అనే ప్రబోధకరమైన ఫిల్ముతీసేరు. ఆ పల్లెలో చేనేత తమ సమస్యను కోఆపరేటివ్ ద్వారా ఎట్లా పరిష్కరించుకున్నారో చూప బడింది. ఈ ఫిల్ముకాపీలు అ. భా. చే. బో. కొని ఉచితంగా ఒక్కొక్క రాష్ట్రానికొక్కొక్క టిచ్చి మోబైల్ వేనుల ద్వారా చూపమని కోరింది.

13. విదేశాలకు చేనేతబట్ట ఎగుమతుల లెక్క.

1950 లో రు. $6\frac{1}{2}$ కోట్లు, 1951 లో రు. $10\frac{1}{3}$ కోట్లు, 1952 లో రు. $9\frac{1}{4}$ కోట్లు, 1953 లో రు. $14\frac{3}{4}$ కోట్లు, 1954 లో రు. 8 కోట్లు, 1955 లో రు. $7\frac{3}{4}$ కోట్లు విలువగలవి జరిగేయి. అభివృద్ధి సంతృప్తికరంగా లేదు,

14. నూలుసప్లయి లెక్కలు : సూత్రాలు.

నెలవారీగా చేమగ్గాలకు, పవర్‌మగ్గాలకు కల్పి 1949 లో 72,869 బేళ్లు సప్లయి చేయబడ్డాయి. అలాగే 1950 లో నెల వారీగా 49,026, 1951 లో 51,768, 1952 లో 67,540, 1953 లో 73,101, 1954 లో 80,302, 1955 లో 88,567 నెలవారీగా బేళ్ళు సప్లయి చేయబడినవి.

నూలు బేలు 1కి 400 పౌనులు. పౌనుదారానికి $4\frac{1}{2}$ గజాలు చేనేతగుడ్డ తయారు. మిల్లుల్లోవిగాక మిగతా పవర్

మగ్గాలు మొత్తం 24000 వున్నాయని కానుంగోకమిటి రిపోర్టులో ఉదహరింపబడింది.

ఒక్కొక్క పవర్‌మగ్గానికి సాలుకు 1000 పౌనుల నూలు దాదాపాను వినియోగపడుతున్నదని విషయసేకరణసంఘం అంచనా.

14. నూలుధరలలో అస్థిరత్వం,

తరుచుగా బాధిస్తూవుంది. నె. 40 రు నూలు 1955 ఆగస్టులో ఆంధ్రలో 10 పౌనులపెట్టి రు. 21-10-0. అదేపెట్టి 1956 మార్చిలో రు. 25-5-0. నూలుధరలను కంట్రోల్ చేయాలని ప్రభుత్వానికి విన్నపాలు వచ్చేయి. కాని సప్లయిపెరిగితే ధరలు తగ్గుతాయిగదాఅని సప్లయి పెరగడానికి కృషి చేస్తామన్నది.

15. ఫ్రీయారన్.

బట్టలమిల్లులు ఉపయోగించగా మిగిలిన, మార్కెట్‌కు వచ్చిన నూలుకు ఫ్రీయారన్ అని పేరుపెట్టబడింది. దీనిలో అల్లికబనీనులు, వలలు మొదలైనవాటికి 10 శాతం, పవర్ మగ్గాలకు 14 శాతం, మిగిలిన 76 శాతం చేనేతవారు ఉపయోగిస్తారని లెక్కకడుతున్నారు. నూలు పౌ 1కి 4½ గ॥ గుడ్డ చొ॥ 1945 లో 150 కోట్ల గజాలు, 1949లో 120 కోట్లు, 1950లో 80 కోట్లు, 1954 లో 130 కోట్లు, 1955 లో 145 కోట్ల గజాలు, చేనేతలో మొత్తం ఉత్పత్తి. ఇందులో కోఆపరేటివ్‌ల ఉత్పత్తి 17 కోట్లు. 31-3-56 నాటికి భారతదేశంలో 8 వేల

సొసైటీలలో 10 లక్షల మగ్గాలు కోఆపరేటివ్‌లలో వుండివుండ వచ్చునని అంచనా వేసేరు. (అనగా సొసైటీలోని మగ్గం 1కి సాలుకు 170 గజాలు లేక రోజుకు 17 అంగుళాలు చొ॥న ఉత్పత్తి ఐనదన్నమాట.)

16. చిన్ననూలుయంత్రం.

పెద్దనూలుమిల్లులకు బదులు, చిన్నయంత్రాలు చేనేత కేంద్రాలలో స్థాపించి స్థానికంగా నూలు ఉత్పత్తి జరగడానికి అనువుగా, బొంబాయి టెక్నలాజికల్ లేబరేటరీలో (శ్రీ) వి. వి. గుప్తగారు ఒక నూలు యంత్రాన్ని తయారుచేసేరు. దానిని వ్యాపారరీత్యా కిట్టుబాటుధరలోనికి తేడానికి, 100 కదుళ్ళు అమర్చడానికి వీలుగా అభివృద్ధిపర్చమని ఆయనకు ప్రభుత్వం రు. 36,000/- యిచ్చింది.

17. చేనేతవారి ఋణభారం.

దీనిని పరిశీలించడానికి అ. భా. చే. బో. కార్యాలయం వారు కొన్ని రాష్ట్రప్రభుత్వాల సహాయంతో కృషి చేస్తున్నారు. కేంద్రప్రభుత్వం యీ విషయంలో మచ్చునకు ఒకటి రెండు చోట్ల స్కీములు అమలుజర్పి చూడడానికి సమ్మతించింది.

18. 1955-56 లో మొత్తంఖర్చు.

1-4-55 నుండి 31-3-56 వరకు మొత్తం దేశంలో చేనేతపథకాలక్రింద రు. 5 కోట్ల 73 లక్షలు ఖర్చయింది.

19. చేనేత పునరావాసం.

చేనేతపరిశ్రమ సెస్ ఫండ్ సహాయంతో 1953 నుండి కృషిచేయగా "పునరావాసం సాధించిందని" చెప్పవచ్చును అన్నారు రిపోర్టులో.

కనికరనాటకంలో కడపటిరంగం.

"దేశంలో గుడ్డకు గిరాకీ పెరుగుతూంది. అదనపు గిరాకికి కావలసినగుడ్డ సప్లయి చేయమని చాలామట్టుకు చేనేతకు కేటాయించేరు. ఈ మంచితరుణంలోనే చేనేతవారు తమకాళ్ళమీద తాము నిలుచోడానికి, "తాత్కాలికంగా ప్రభుత్వంచేసిన సహాయములనుండి విముక్తి పొందడానికి, కృషిచేయుడం శ్రేయస్కరం" అని ఆఖరున హెచ్చరిక చేసినారు.

1956 రిపోర్టులో యీ హెచ్చరికచేసి, 1957 లో చేనేత గుడ్డమీద రిబేటు తగ్గిస్తూ ప్రకటనచేసేరు. భూతదయతో నాలుగేళ్లు సెస్ ఫండ్ స్కీము అమలుపరచి "పునరావాసం" అనే పాలకజాతివారి మనోరధసిద్ధి పూర్తిఅయింది. ఇక నిక్కడినుండి, ఇటు రిబేటు తగ్గి, అటు 14600 ఆటోమగ్గాలు, 35000 పవర్ మగ్గాలు రంగంమీదకు వచ్చి, కొత్తగా సోషలిస్టుపరివర్తన నాటకం ప్రారంభం అవుతుంది!

జాతీయవనరులన్నీ తమకు దైవమిచ్చిన ఆస్థిఅనుకొని, చేనేత మొదలైనవారిపట్ల, పాలకవర్గంవారు అపుడపుడు

'తాత్కాలికం'గా చూపే మెహర్బానీవైఖరి యిది. అ. భా. చే. బోర్డులోని చేనేతప్రతినిధులు దీనితో ఏకీభవించకపోవచ్చు.

మార్పుకు లొంగనిదానిని గాముసుమూ అని చెప్పుకొంటున్న ఈ రెం. పం. వ. ప్రణాళికను అనేక కారణాలవల్ల అందరూ అంగీకరించేరు.

## మాటలు కోటలు దాటుతాయి.

రెం. ప్రణాళిక 33 వ పుటలో యిలా వ్రాసేరు. "ఆర్థికాభివృద్ధికి విస్తారంగా పెట్టుబడులు, నూతన సాంకేతిక సాధనాలు ప్రవేశపెట్టినపుడు సమాజంలో వర్గాలమధ్య అసమానతలు, దేశంలో నిరుద్యోగము యింకా పెరిగిపోవడానికి అవకాశమున్నది. కార్మికసంఘాలు, ప్రజాస్వామికభావాలు ప్రబలమైతే వాటిని కొంతవరకు సాధారణంగా అదుపులో పెడతాయి. వెనకబడ్డ దేశాలలో జాతీయార్థికాభివృద్ధి, అసమానతల తగ్గింపు, రెండూ విడదీయరాని, ఏకధర్మంగానే గుర్తించి, ఉత్పత్తివనరులను, వర్గసంబంధాలను, సమరేఖకు తెచ్చి సంధి కుదర్చవలసివుంటుంది. సారాంశమేమనగా సోషలిస్టు సమాజాలో అభివృద్ధిజరగాలి......ప్రజాస్వామికంమీద, క్రమబద్ధమైన మార్పుమీద మనకున్న గౌరవం, అసమానతలను సమర్థించడానికి ఒక కారణం కాగూడదు" అన్నారు. ఆ యధ్యాయంలోనే మరోచోట యింకా యిలాఅన్నారు. "ఆదాయాలకు గరిష్ఠప్రమాణం పెట్టడంవల్ల ప్రయోజనం ప్రస్తుతంలో

లేదుగాని కనీస జీవితప్రమాణాన్ని ఒకదాన్ని నిర్ణయించి, అది అందరికి గ్యారంటిచేయడం అవసరం....నేరుగా స్వాధీనపరుచుకొనడాన్ని ప్రజాస్వామిక ప్లానింగ్ మానుకొంటుంది. కాని, ప్రత్యామ్నాయంగా పన్నులు, సెస్సులు, కంట్రోళ్లు, కేటాయింపులు, ధరలు, యీ పరికరాలను ఉపయోగించుకుని లక్ష్యాన్ని సాధించుకుంటుంది" అన్నారు.

ఐతే, ఎగుమతులకోసం కేటాయించిన 100 కోట్ల గజాలు మిల్లుగుడ్డ కేంద్రప్రభుత్వంచే స్థాపించబడ్డ * స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ చేత విధిగా ప్రతి సంవత్సరం కొనిపించి, తామే విదేశాలకెగుమతి చేయరాదా ? అలాగైతే చేనేతవారి ఆందోళన కొంత తగ్గుతుందే. ప్రపంచ వస్త్రమార్కెటులో మన ఎగుమతులకు అవకాశాలు సన్నగిలుతున్న యీ దశలో ఎగుమతి పేరుతో తయారుచేసిన గుడ్డ చివరకు మార్కెటులో చేనేతకే పోటీగా ఎదురైయ్యే ప్రమాదం లేకపోలేదుగదా. చేనేతఉత్పత్తి శక్తిలో కొంతభాగాన్ని వ్యర్థపర్చి, నిరుద్యోగానికో అర్థనిరుద్యోగానికో ఏల గురిచేయవలెను ? దేశంలో పెట్టుబళ్ళకెంతో కటకటపడుతున్న ఈ దశలో ఆటోమగ్గాలకు, పవర్ మగ్గాలకు దూబరాగా పెట్టుబళ్ళు ఏలపెట్టవలెను ?

---

* స్టే.ట్రే. కార్పొరేషన్ అనే పేరుతో కేంద్రప్రభుత్వమే స్వయంగా ఎరువుల, ఆహారపదార్థాల దిగుమతి, కొన్ని లోహాల ఎగుమతి వ్యాపారం చేస్తున్నది.

## ప్రణాళికకు దాపురించిన ప్రమాదాలు.

౨౦. ప్రణాళికను పెట్టుబడిదారీ విధానం బలపడేవిధంగా అమలుజరుపుకోవాలని కొన్ని శక్తులు పనిచేస్తున్నాయి. వారు కీలకస్థానాల్లో అ. భా. చే. బో. లోగూడ వున్నారు. ప్రభుత్వంలో పలుకుబడి హెచ్చు. సోషలిజంమాట దేవుడెరుగు, కనీసం ప్రజలకు శ్రేయస్కరంగా వుండేట్లు అయినా అమలుపరచాలని మరికొన్ని శక్తులు పనిచేస్తున్నాయిగాని వీరు కీలకస్థానాల్లో లేరు. ప్రభుత్వంలో పలుకుబడి తక్కువ. ఇది నేటి రాజకీయసమస్య.

అప్పుకోసం అమెరికాకు వెళ్ళిన బీర్లాగారు న్యూయార్కులో 3-10-57 న మాట్లాడుతూ యీ విధంగా అన్నారు: "ప్లానింగ్ అనేది మొదట రష్యాలో ప్రారంభం కావడంవల్ల ఆ మాటకే ఒక దుర్వాసన ఉన్నమాటనిజం. కాని, ఇండియా ప్లాను ప్రజాస్వామికప్లాను. దాని నియమావళి నియంతలు తయారు చేయలేదు. ప్రైవేటు పెట్టుబడిదారులు ఏ పరిశ్రమలు పెట్టలేరో, వాటినిమాత్రమే ప్రభుత్వం పెడుతూవుంది. అక్కడ గూడా ప్రభుత్వవిధానం మళ్ళీ మారుతూవుంది. బాధ్యతగల మంత్రులే యిటీవల ఔదార్యంగా చెపుతున్నారు. ప్రణాళికలో పబ్లిక్ రంగానికి (అనగా ప్రభుత్వ పరిశ్రమలకు) నూటికి 33 వంతులు, ప్రైవేటు రంగానికి 67 వంతులు పెట్టుబళ్లు కేటాయించవచ్చునంటున్నారు".

పార్లమెంటులో ప్యాసైన ప్రణాళికలో ప్రైవేటు రంగానికి నూటికి 39 వంతులు—పబ్లిక్ రంగానికి నూటికి 61 వంతులు కేటాయించేరు. కాని, యిపుడు తారుమారవుతూవుంది.

స్టేట్ బ్యాంక్ ఆఫ్ యిండియా ఉపాధ్యక్షుడు శ్రీ యస్. వి. గాడ్గిల్‌గారు దేశంలో ప్రణాళిక అమలుజరుగుతున్న తీరు పట్ల తీవ్ర అసంతృప్తి తెలుపుతూ (20-8-57 హిందూ) ఇలా అన్నారు. "దేశ ఆర్థికజీవితంలో ప్రైవేటురంగం 92 శాతం ఆక్రమించుకొనివుంది. అది 'తనపాత్రను దేశభక్తి పూరితంగా నిర్వహించక దేశాన్ని ఈ క్లిష్టపరిస్థితికి తెచ్చి యిపుడు ప్రణాళికలోని ప్రధాన నిర్ణయాలనే మార్చుకోవలసివుంటుందని అంటున్నారు. పెద్ద పెట్టుబడిదారుల పట్ల మెత్తని వైఖరి మార్చుకొని, ప్రభుత్వం కఠినంగా వుండాలి. హింసాయుత విప్లవానికి ప్రత్యామ్నాయ మార్గం మన దేశంలో "విప్లవాత్మకంగా రాజ్యాంగ చట్టాన్ని ఉపయోగించుకోవడ మొక్కటే." ఒకప్పుడు పాపం! ఈయన కేంద్రమంత్రివర్గంలో వాడే. రాజీనామా యిచ్చి వచ్చేసేరు. ఇపుడు కృష్ణమాచారిగారి నూతన శస్త్రవిధానం మొదలైన కొన్ని హంశములలో భేదించిన శ్రీ గుల్జరిలాల్ నందాగారు గూడ కేంద్రమంత్రిపదవికి త్వరలోనే రాజీనామా పెట్టవచ్చునని పత్రికలలో అంచనాలు పడుతున్నాయి.

## కుటీరపరిశ్రమలు - మన రాజ్యాంగచట్టము.

మన రాజ్యాంగచట్టం 43 వ ఆర్టికల్‌లో "...కుటీర పరిశ్రమదారులను వ్యక్తిపద్ధతిలోగాని, కోఆపరేటివ్ పద్ధతిలో

గాని ప్రభుత్వం అభివృద్ధిపర్చడానికి కృషిచేస్తుంది" అన్నారు. చైనా రాజ్యాంగచట్టం 4 వ ఆర్టికల్‌లో "ప్రభుత్వయంత్రాంగంతో పరిశ్రమలలో సామ్యవాద పరివర్తనం తేవడంద్వారా, మానవుడు మరొక మానవుణ్ణి దోచుకునే విధానాన్ని క్రమంగా అంతరింపజేసి సోషలిస్టు సమాజాన్ని నిర్మిస్తామని ప్రభుత్వం 'హామీ' యిస్తున్నది" అన్నారు. రష్యారాజ్యాంగచట్టం 4 వ ఆర్టికల్‌లో "పెట్టుబడిదారీ విధానాన్ని రూపుమాపుకొని, ఉత్పత్తి పరికరాలన్నిటిని సమాజపరం చేసుకున్న సోషలిస్టు వ్యవస్థ ఈ రాజ్యాంగానికి ఆర్థిక పునాదిగా వుండగలదు" అన్నారు. దోపిడి విధానములనుండి ముక్తి పొందడంలో తరతమ భేదములు వీటిలో కనుపిస్తాయి.

మన దేశంలో రెం. ప్రణాళిక అడుగునుండి తయారు చేయబడుతుందన్నారు. అంచేత ఏ రంగానికి ఆ రంగంవారినే, ఏ గ్రామస్థుల కా గ్రామస్థులనే ముందు ప్లానులు తయారుచేసి పంపమన్నారు. అ. భా. చే. బో. కేవలం ప్లానింగ్ కమీషన్ నిర్ణయించిన పరిమితులకు లోబడి 130 కో॥ రూ॥ పథకాలు తయారుచేసి పంపింది. దానిని ప్లానింగ్ కమీషన్ యొక్క ఉప సంఘంలో (కార్యకమిటి) మొదటి వడపోతలో 80 కోట్లకు తగ్గించేరు. చివరకు తుదిప్లాన్‌లో 59½ కోట్లు శాంక్షన్ చేసేరు. ఇందులో బహుశా అంత్యమందు చూచుకుంటే 50 కోట్లలోపే ఖర్చు అవవచ్చు.

చైనా కుటీరపరిశ్రమలన్నీ కోఆపరేటివ్‌లుగా మారా లని నిర్ణయించిన రెండేళ్ళలో దేశంఅంతా మారిపోయింది. 1956 మొదటి మూడుమాసాలలో కుటీరపరిశ్రమలకు వారి చ్చిన 170 మిలియనుల యువానుల ఋణాలు మన రూపాయిల లోకి మారిస్తే 34 కోట్లు రూ॥ అయినవి. 1956 నాటికే చేనేత వారి ఇళ్ళల్లో యిరుకు తగ్గడానికి పేటలమధ్య కోఆపరేటివ్ కార్ఖానాలు పద్ధతి ఏర్పరచినారు. ప్రభుత్వ పరిశ్రమల్లోని పని వారికి, ఇతర ఉద్యోగులకు జీతంలో ఒకభాగం గుడ్డలురూపంగా యిచ్చేరివాజు ఏర్పర్చుకొన్నారు. అందువల్ల యీ కోఆపరే టివ్‌లు సప్లయి చేయలేనంతగుడ్డకు ప్రభుత్వ ఆర్డర్లే నిత్యమూ వుంటున్నాయి. ఈ కోఆపరేటివ్‌లలో చేమగ్గాలబదులు పవర్ మగ్గాలు ప్రవేశపెట్టడం 1958 లో ప్రారంభించి 1967 నాటికి, జరిపనికి, నగిషీపనికితప్ప, చేమగ్గాలిక ఒక పరిశ్రమగా ఉండనవ సరంలేనిస్థితి రాగలదని పథకాలు వేసేరు. ఐతే మనవలె పెట్టు బడిదారీ దేశంకాక, అది సోషలిస్టుదేశంగనక నిరుద్యోగపీడ మొదలేలేదు గనుక చేనేతవారు ఉత్సాహంగా ఆ పథకాల్లో పాల్గొంటున్నారు. (పీపుల్సు చైనాసంచిక 1-8-56)



మూడవ ప్రకరణం.

# అ. భా. చే. బోర్డువారు ప్లానింగు కమీషన్‌కు (రె. ప. వ. ప్రణాళికలో చేర్చుటకు) సమర్పించిన స్కీములు.



రెండవ పంచవర్ష ప్రణాళికాచట్టమును ప్రొఫెసర్ మహలనోబిస్‌గారు తయారుచేసినారు. దానిలో వివిధశాఖలకు యేర్పరచబడిన లక్ష్యములను సాధించుటకు ద్రవ్యము నెంతెంత ఖర్చుపెట్టవలెనో లెక్కలను నాలుగు శాఖలవారు తయారు చేశారు.* ఆ చిత్తుప్రణాళికలో మొత్తం కుటీరపరిశ్రమలు చిన్నతరహాపరిశ్రమలకూకలసి రు. 200 కోట్లరూపాయలను కేటాయించినారు.• 1960 నాటికి తలసరి వస్త్రవినియోగము 18 గజాలు వుండుననే అంచనామీాద లెక్కలు తయారైనాయి.

---

* నాలుగు శాఖలివి :— (1) కేంద్ర ఆర్థికమంత్రిత్వ శాఖలోని ఎకనామిక్ డివిజన్. (2) ప్లానింగ్ కమీషన్‌కు చెందిన ఎకనామిక్ డివిజన్ వీరిద్దరూ, (3) యిండియన్ స్టాటిస్టికల్ యిన్‌స్టిట్యూటు. కలకత్తా. (4) సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్, ఢిల్లీ. వారల సహాయంతో తయారు చేసినారు.

• రెండవ పంచవర్షప్రణాళిక పరిష్కరించవలసిన అతిముఖ్యసమస్యలలో నిరుద్యోగ నివారణ ఒకటి. ఈ దృష్టిలోనే కుటీరపరిశ్రమలకు, రు. 200 కోట్లు కేటాయించబడినవి.

గత రెండు సంవత్సరముల అనుభవము అ. భా. చే. బోర్డుకు ఒక విశ్వాసమును కల్గించినది. తగినంత తక్కువకాలంలో జాతీయ ఆర్థికవ్యవస్థలో చేనేతపరిశ్రమకు అర్హమయిన స్థానమును కలుగజేయవలెనంటే సెస్సుఫండు ఎంతమాత్రం చాలదని నమ్ముతున్నారు.

అంతేగాక చేనేతపరిశ్రమాభివృద్ధికి కృషిచేసే ఉద్యోగ బృందములను ఆయారాష్ట్రీయప్రభుత్వములు కూడా పెంచుకో వలసివుంటుంది. 30 లక్షల పనిచేయగల దారుఢ్యం వున్నవాళ్ళకు చేనేతవృత్తి పనిచెప్పగలదని కానుంగో కమిటీ రిపోర్టులో చెప్పబడినదాన్ని బట్టి చూస్తే నిరుద్యోగనివారణకు యిది ఎంత అమోఘమయినదో బోధపడగలదు.

ప్రణాళికలో రు. 130 కోట్లు కిమ్మతు కలిగిన 19 చేనేత స్కీములు తయారు చేయబడినవి. (ఈ స్కీము వివరాలు ఈ అధ్యాయం ఆఖరున పేర్కొనబడినవి).

సంవత్సరవారీగా చేయవలసిన ఖర్చులు.

| | |
|---|---|
| 1956–57 | రు. 16 కో. 91 ల. |
| 1957–58 | రు. 23 కో. 6 ల. |
| 1958–59 | రు. 27 కో. 86 ల. |
| 1959–60 | రు. 28 కో. 66 ల. |
| 1960–61 | రు. 33 కో. 51 ల. |
| మొత్తం | రు. 130 కోట్లు. |

ఈ మొత్తం ఐదేండ్లలో సెస్సుఫండు మొత్తానికి సుమారు 5 రెట్లు కాగలదు. అయినప్పటికీ అవసరాన్ని చూచినా, అవకాశాన్నిబట్టి చూచినా ఈ మొత్తం సబబైనదే.

ఉత్పత్తి లక్ష్యం.

1 పౌను దారమునకు 4½ గజములగుడ్డచొప్పున చేనేత పరిశ్రమలో 300 కోట్ల గజాలగుడ్డ తయారుకావలెనంటే 16 లక్షల 37 వేల బేళ్ళనూలు (బేలు 1కి 400 పౌనులు) కావలెను. అనగా నెల 1కి 1,39,000 బేళ్ళు కావలెను. ఈ నాడు నెల 1కి 64,000 బేళ్ళు మాత్రమే చేనేత రంగానికి సప్లయి అవుతున్నది. అందువల్ల 1960 నాటికి అదనంగా మరొక 75,000 బేళ్ళు నెల 1కి సప్లయి కావలసివుంది.

ప్రణాళికాకాలంలో చేనేతకు అతిప్రధానంగా కావలసినది అదనంగా నూలుసప్లయి. ఇందుకోసము రు. 5 కోట్లు కేటాయించబడినది. ప్రాథమిక చేనేతసొసైటీలు వాటి స్వంత నిధులతో కోఆపరేటివు నూలుమిల్లులను తగినన్ని స్థాపించుకోడానికి ప్రస్తుతం అవకాశములు లేవు. దేశంమొత్తంమీద అన్ని చేనేతసొసైటీల స్వంతనిధులు లెక్కవేస్తే రు. 4 కోట్లకు మించి లేను. ఇదిన్నీ రిజర్వుఫండూ కలిసి వ్యాపారపెట్టుబడులుగా టర్నోవర్ చేసుకుంటున్నాయి.

చిన్న చిన్న స్పిన్నింగ్ఫ్రేమ్సు (వడుకుసాధనాలు) ను ఆచరణయోగ్యంగా చేయుటకు ప్రస్తుతం (1955 సెప్టెంబరు) పరిశో

ధనలు జరుగుచున్నవి. అవి సఫలమయితే ఈ రు. 5 కోట్ల నుండి ఎక్కువడబ్బు వాటికే వినియోగించబడును.

కనీసం దేశంలో 22 లక్షల మగ్గాలుమాత్రమే వున్నవని అనుకొన్నప్పటికీ సాలుకు 300 రోజులు పనిచేస్తే రోజుకు మగ్గం 1కి 5 గజాలు చొప్పున మొత్తము 300 కోట్ల గజాలగుడ్డ తయారగును. *

## సహకార రంగం.

8,70,000 మగ్గాలు నేడు (1950) నామకః సొసైటీలలో వున్నప్పటికీ అవి వాటికి సాలు పొడవునా పని చెప్పలేకపోతున్నవి. సహకారోద్యమం స్థిరపడవలెనంటే రెండు షరతులు వున్నవి. ఒకటి, అవి సాలుపొడవునా పనియివ్వగల స్తోమతు కలిగియుండవలెను. రెండు, వాటిలో నేసేవారికి న్యాయమయిన కనీసవేతనం గిట్టుబాటుకావలెను. ఈ రెండు షరతులు అమలు జరిగితే అత్యధిక సంఖ్యాకులను సులభంగా సొసైటీలలోనికి ఆకర్షించగలము. 1960-61 నాటికి మగ్గాలలో మూడింట రెండు వంతులు—అనగా 14 లక్షల—మగ్గాలను సొసైటీలలో చేర్చు

* 22 లక్షల మగ్గాలు రోజుకు 5 గజాలవంతున నేసినా సంవత్సరంలో 300 రోజులకు 330 కోట్ల గజాలు తయారగును. కాని మగ్గం 1కి రోజుకు అధమపక్షంగా చూచినా 6 గజాలు నేయవచ్చుననేది సర్వాంగీకార విషయం. ఆ లెక్కన సాలు ఉత్పత్తి 396 కోట్లు సులభంగా కాగలదు. కాని, బోర్డు ఎందుకిట్లు వ్రాసిందో దురూహ్యము. కానుంగో కమిటీగూడ దినసరి ఉత్పత్తి 6 గజాలనిఅంది.

కో నేటర్లు చేయవలెను. అనగా 200 కోట్ల గజాలు ఈ రంగంలో ఉత్పత్తి కావలెను.

మొత్తం మగ్గాలలో కనీసము సగమయినా సొసైటీలలో సంతృప్తికరంగా పనిజేస్తే దాని ప్రభావంవల్ల మాష్టరువీవర్ల క్రింద పనిచేసే చేనేతకార్మికుల పరిస్థితులు అభివృద్ధిపొందగలవు. అక్కడక్కడ సర్వేటీంవారు పరిశీలించగా, యిట్టి అభివృద్ధి ధోరణి 1954 కంటే యిప్పుడు ఎక్కువగా కనిపిస్తున్నది.

## సొసైటీలలోని వీవర్సుకు షేరుధనం.

ప్రస్తుతవిధానం ప్రకారము రు. 25/-లు షేరు విలువ అయితే అందులో 8 వ భాగం అంటే రు. 3-2-0 ను వీవరు పెట్టుకొంటే తక్కిన 7 భాగాలు రు. 21-14-0 ప్రభుత్వం అప్పు యిస్తుంది.

శిల్కుమగ్గాల విషయంలో సాధారణముగా షేరు 1కి రు. 100-0-0 లు వుంటుంది. దానికిగూడా పైవిధానమే వర్తిస్తుంది.

ఆ లెక్కన 72,000 శిల్కు మగ్గాలతోసహా మొత్తము 4,50,000 మగ్గాలను అదనంగా సొసైటీలలో చేర్చడానికి రు. 1,38,60,000 లు కావలసియుంటుంది.

## వర్కింగ్ కాపిటలు (లేక వ్యాపార పెట్టుబడి లేక బండవాళం).

ప్రత్తినూలుమగ్గం 1కి రు. 200 లు వంతున 3,78,000 మగ్గాలకు రు. 7 కోట్ల 56 లక్షలున్నూ, సిల్కుమగ్గం 1కి

రు. 500 లు చొప్పున 72,000 మగ్గాలకు రు. 3 కోట్ల 60 లక్షలు కావలసియుండును.

1953 అక్టోబరునాటికి 6,80,000 మగ్గాలు కేవలం నూలు పంపకం సొసైటీలలో సభ్యత్వం కలిగియున్నవి. ఆ సొసైటీలన్నీ నూలు రేషనింగు కాలంలో బయలు దేరినవి. మిగతా సొసైటీలు 1953 సం॥ పూర్వమే స్థాపింపబడి ఉత్పత్తి మరియు విక్రయ సొసైటీలుగా పనిచేస్తున్నవి. ఈ రెండింటి విషయంలోనూ మగ్గానికి రు. 100 లు చొప్పున వ్యాపార పెట్టుబడి యివ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది.* 1953–54, 1954–55 ఈ రెండేళ్ళలోను ఈ పద్దుక్రింద 1,29,000 మగ్గాలకు రు. 80 లక్షల రూపాయలు శాంక్షన్ అయింది. మిగతా మగ్గాలకు కావలసిన వ్యాపార పెట్టుబడి కేటాయింపులలో (టేబిలులో) చేర్చబడింది.

ప్రభుత్వం సిబ్బంది వగైరా ఖర్చులకు చేసే ఆర్థికసహాయం యిది వరకటిది చాలదనిన్నీ, ముందు పెంచమనిన్నీ ఒత్తిడి చేయబడుతున్నది. అందువలన వ్యాపారపెట్టుబడిగా శాంక్షన్ కాబడిన మొత్తంలో 100 కి 4 వంతులుమించి డైనందిన సిబ్బంది వగయిరాకు ఖర్చుచేయబడరాదు. కాని, మోటారు వ్యాన్సు, ఫినిషింగ్‌ప్లాంటు (బట్టను నునుపుచేసి మెరుగుబెట్టు

* 1953 కు పూర్వంనుండీ మెంబరుగావున్న మగ్గానికి వ్యాపార పెట్టుబడిగా రు. 100 లు మాత్రమే యివ్వబడును. అదే సొసైటీకో 1953 తర్వాత చేరిన మగ్గాలకు రు. 200 లు వంతున యివ్వబడుతుందని దీని తాత్పర్యం.

నవి) లు, ప్రత్యేక స్కీముప్రకారం పెట్టే సేల్సుడిపోలు వగైరా లకయ్యే ఖర్చులకు ఈ సూత్రం వర్తించదు. 1960-61 నాటికి సహకార సొసైటీలలో చేరునని ఊహించబడిన 14,50,000మగ్గా లకు 250 మగ్గాలకు ఒక మార్కెటింగు డిపోచొప్పున 5800 డిపోలు కావలెను. 1953-55 రెండు సంవత్సరాలలోను 1200 డిపోలు శాంక్షన్ అయినవి. యింకనూ 4600 డిపోలు అదనంగా పెట్టవలసియుంది.

ఒక్కొక్క డిపోకు మొదటిసంవత్సరం సిబ్బంది వగ యిరా ఖర్చులు నిమిత్తము రు. 4000 లు వంతున ప్రస్తుతం శాంక్షన్ చేయబడుతున్నది. ఈ మొత్తం క్రమక్రమంగా తగ్గించుతూ నాలుగవ సంవత్సరాంతమున ప్రభుత్వం యింకేమియూ యివ్వరు. అప్పటికవి స్వయంపోషకం కావలెను.

## మోబైల్ వ్యానులు (మోటారువ్యానులు).

20,000 మగ్గాలలోపుగాగల రాష్ట్రములకు యిట్టి వ్యాను యివ్వబడదు. 75,000 లోపుగలవాటికి ఒక్కటిమాత్రం యివ్వ బడును.

ఆ పైన ప్రతి 75,000 మగ్గాలకూ ఒక్కొక్క వ్యాను చొప్పున యివ్వబడును. అనేక దూర గ్రామాలకు వెళ్ళి ప్రచారము, అమ్మకము సాగిస్తున్నందువలన ఈ వ్యానులు చాల ఉపయోగకరమని భావిస్తున్నాము. అందువలన యికముందు 10,000 మగ్గాలకే ఒక్కొక్క వ్యాను యివ్వవలెనని సిఫార్సు

చేయబడింది. వ్యాసులకయ్యే రిపేరీ, పెట్రోలు, సిబ్బందిఖర్చులు మొదటి సంవత్సరంలో పూర్తిగానూ, తర్వాత క్రమంగా తగ్గించి నాలుగేండ్ల అనంతరం ఏమీ యివ్వకుండా వుండేపద్ధతి అనుసరించబడును. ఈ వ్యాసులు కేంద్రప్రభుత్వపు ఆస్తిగా ఎంచబడును. వాటిని అమ్మినప్పుడు ఆ సొమ్మును కేంద్రప్రభుత్వానికి యిచ్చివేయవలెను.

## రిబేటు (గుడ్డ అమ్మకంపై).

కాంపొజిట్ (వడుకు, నేత రెండు కలిగిన) మిల్లులవారికి కిట్టే రేటుకన్న నూలు చాల హెచ్చురేటుకు చేనేతవారికి గిట్టుతున్నది కనుక ఈ తేడాను రిబేటు కొంత భర్తీ చేస్తుందని తలంచబడుతున్నది. సమాన నెంబరు నూలుతో నేసిన మిల్లుబట్టనూ, చేనేతబట్టనూ వాటిగిట్టింపుధరల విషయంలో యింటీవల లోతుగా పరిశీలన చేయబడింది. గిట్టింపులో గణనీయమైన తేడావుండి అది మిల్లుల కనుకూలంగా వున్నట్లు ప్రభుత్వం అంగీకరించినది. ఈ తేడా కొనసాగినంతకాలం రిబేటు సమర్థనీయమే. ఈ తేడాను చాలవరకు తగ్గించడానికి రెండువైపులనుండి కృషిచేయడం ప్రభుత్వోద్దేశ్యము.

1. పన్నులను పెంచే విధానము ఈ విషయంలో పనివచ్చునట్టుగ ఉపయోగించడము.

2. పురాతన చేమగ్గాలను విడచిపెట్టి ఉత్పత్తిని అధికం చేయగల క్రొత్తమగ్గాలకు అలవరచి గిట్టుబాటు రేటును తగ్గించడము.

రానున్న 5 సం॥లోను ద్విముఖముగు ఈ కృషిని సాగిస్తూ తేడాలను తగ్గించవలసియున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమంతా 1-0-0 కు 0-1-6 చొప్పున దేశమంతటా ఒకే రేటున రిబేటు యివ్వడానికి నిర్ణయించడమైనది.

## ఇండస్ట్రియల్ కో-ఆపరేటివులు.

మలబారు మొదలగుచోట్ల వున్న చేనేత ఫ్యాక్టరీలను యిండస్ట్రియల్ కోఆపరేటివులుగా మార్చడానికి ప్రయోగాత్మకంగామాత్రమే నిర్ణయించబడినది.

రానున్న 5 సం॥లోను 20,000 మగ్గములు కలిగిన ఫ్యాక్టరీలు తీసుకోబడును. ఫ్యాక్టరీ యజమానులు యావత్తు పరికరములతోను ఫ్యాక్టరీని కోఆపరేటివుకు అమ్మివేయవలెను. ప్రభుత్వము అట్టి కోఆపరేటివులకు రు. 1 కోటీ 8 లక్షల 50 వేలు యివ్వవలెనని సిఫార్సు చేయబడింది.

గిట్టుబాటుధర తగ్గేటట్లు, ఉత్పత్తి ఎక్కువ జరిగేటట్లు చేయడానికి స్వంత రంగులకార్ఖానాలు కావలెను. నాడివిసిరే గోతిమగ్గం మచ్చులాగే మగ్గంగా మారవలెను. టేక్ ఆఫ్ మోషన్ అటాచిమెంటు కావలెను. జాకార్డులు మొదలైన అధునాతన పరికరములు అమర్చుకోవలెను. వీటికి తగురీతిని కేటాయింపులు చేయబడినవి.

## చిల్లరమల్లరస్కీములు.

(1) పరికరములను తయారుచేయుట :—

ప్రస్తుతం సెస్సుఫండునుండి సొసైటీలకు మగ్గాల పనిముట్లు సప్లయి చేయబడుచున్నవి. వాటిని రాష్ట్రప్రభుత్వములు గాని స్టేటుసొసైటీలుగాని ప్రయివేటు వర్తకులవద్ద, వడ్రంగుల వద్ద కొంటున్నారు. ఈ పనిముట్లన్నీ ప్రమాణీకరణం (స్టాండర్డైజు) చేసి సాధ్యమయినంత తక్కువధరకు సప్లయిచేయుటకు కృషిచేయుట అవసరము. అధికసంఖ్యలో చేమగ్గాలున్న కేంద్రాలలో కుటీరపరిశ్రమపద్ధతిలో ఈ పనిముట్లను తయారు చేయించవలెను.

(2) రంగులు, రసాయనములు నేరుగా దిగుమతిచేయుట వగైరా :—

చేనేతపరిశ్రమ రంగులు, రసాయనములను చాలా భారీగా వినియోగిస్తున్నది. ప్రయివేటు వ్యాపారస్థులద్వారా ఇవి విదేశాలనుండి దిగుమతి యగుచున్నవి. ప్రభుత్వ సహాయంతో ఒక కేంద్ర దిగుమతిసంస్థను ఏర్పరచుకొంటే కొంచెం తక్కువ ధరలకు వీటిని చేనేతవారలకు అందించవచ్చును. స్వదేశీ రంగులయొక్క ప్రాముఖ్యతను, అనాదిగా సాంప్రదాయ సిద్ధమయిన కొన్ని అద్దకపువిధానములను మనం తృణీకరించనక్కర లేదు. ఆ రంగులను, ఆ పద్ధతులను అభివృద్ధిచేసి ప్రమాణీకరణం (స్టాండర్డైజేషన్) చేయుడానికి పెద్ద చేనేతకేంద్రాలలో పరిశోధనాలయాలను ప్రభుత్వ సాయంతో స్థాపించవలెను.

(3) వీవింగ్‌యూనిట్ (చేనేతపరిమాణం) :—

గుడ్డ విడుదలకు సౌకర్యములు కలుగజేయడమేకాకుండా మారుతున్న నూతన అభిరుచుల కనుగుణ్యముగా క్రొత్తక్రొత్త

డిజైను (నమూనా) లను ప్రోత్సహించవలెను. స్టేటుసొసైటీలకు అనుబంధముగా కొన్ని ముఖ్య చేనేత కేంద్రములలో డిజైనుల కృషికోసం ఎక్స్‌పరిమెంటల్ వీవింగు యూనిట్లు (ప్రయోగాత్మక చేనేత కేంద్రములు) స్థాపించుకోవలెను.

(4) కోఆపరేటివులకు బయట :—

ఈ బయటవున్న మగ్గములమీదకూడా అధిక వస్త్రోత్పత్తి జరుగునట్లు ప్రోత్సహించడానికి ఆయా రాష్ట్రప్రభుత్వములు ఈ గుడ్డకు కొనుగోలుసంస్థను స్థాపించడం వాంఛనీయము. ఆ సంస్థలద్వారా ఆ గుడ్డను ప్రమాణీకరణం చేయవచ్చునుగూడా. ఈ గుడ్డ విడుదల కావడంకోసం ప్రత్యేకపు ఏర్పాట్లు జరగవలెను. యిందుకు ప్రత్యేక సేల్సుడిపోలు స్థాపనకు సిఫార్సు చేయడమయినది.

(5) నేసేపద్ధతులను అభివృద్ధిపఱచుట :—

అభివృద్ధి నేతవిధానమును ఎక్కువమంది అనుసరించితే దేశంలో ఎక్కువబట్ట ఉత్పత్తి కావడానికి తోడ్పడినవారు కాగలరు. అంతేగాక నాణ్యమునుగూడా అభివృద్ధిచేయగలరు. అందువలన కొన్ని కేంద్రములలో ట్రైనింగు సెంటర్లును ఏర్పరచుటకు సిఫార్సు చేయడమైనది.

(6) కేంద్ర గొడౌనులు :—

చేనేతబట్టను నిలువ వుంచుటకు అక్కడక్కడ వీటిని స్థాపించుటకు సిఫార్సు చేయడమయినది.

పైనుదహరింపబడిన చిల్లరమల్లర స్కీములన్నింటికి ఒక కోటిరూపాయలు కేటాయించగోరబడినవి.

## త్రిఫ్టుఫండు.

ప్రస్తుతము 1-0-0 కు ఒక అణా కు మించకుండా సొసైటీలలో మజూరీనుండి దీనిని పట్టుకొనడం ఒక అలవాటుగా వుంది. అది అతని కత్యవసరం వచ్చినప్పుడు యివ్వడంగానీ, అతని పేరువాటాను హెచ్చించడానికిగాని యివ్వబడుతున్నది. మాష్టరువీవరు త్రిప్టు తీయకుండా అప్పటికప్పుడే యిచ్చివేయును.

యిండియాప్రభుత్వం ఒక త్రిఫ్టుఫండును ఏర్పాటు చేయవలెను. సొసైటీలలో యిచ్చే మజూరీలనుండి రూపాయకు 0-1-0 చొప్పున తీసిన త్రిఫ్టు ఈ ఫండుకు చేరిచే దానికి సమానమైన మొత్తము ప్రభుత్వంగూడా సబ్సిడీగా యివ్వవలెను. అనగా మగ్గందారు తానుసంపాదించే ప్రతి 1-0-0 మజూరీకి 0-2-0 త్రిఫ్టుగా వస్తుందన్నమాట. అందులో అణా తనదీ, మరొక అణా ప్రభుత్వమిచ్చేదీనూ. దీనివలన ఎక్కువమంది సొసైటీలలోనికి వచ్చే అవకాశంగూడ కలుగుతుంది. ఈ ఫండు దుర్వినియోగం కాకుండా కొన్ని ఏర్పాట్లు జరగవలెను. మగ్గందారునకు అత్యవసర పరిస్థితులలో ఈ డబ్బు కావలసివచ్చినప్పుడు దీనినుండి అప్పుగామాత్రమే యిస్తుండవలెను. అదియూ తాను చెల్లించినమేరకే యివ్వవలెను. కాని పేరు కాపిటలు పెంచుటకుగాని, యిల్లు కట్టుకొనేదానికిగాని ఉపయోగించుకొనేటప్పుడు పూర్తిమొత్తం (అంటే అతను చెల్లించినదానికి సమానంగా ప్రభుత్వమిచ్చేదానితో సహా) అప్పుగా యివ్వవచ్చును.

ప్రచారము :—

దేశంలో చేనేతగుడ్డను కొనుమని చేసిన ప్రచారంకొంత ప్రయోజనాన్ని యిచ్చింది. ముఖ్యంగా విద్యార్థులలో విస్తృతమైన ప్రచారం జరగవలెను. విదేశాలలోనూ ప్రచారం చేయవలెను. సొసైటీలలో చేరుమని చేనేతవారిలోగూడా కొంత ప్రచారం చేయవలెను. ఈ అన్ని ప్రచారాలకు కొంత డబ్బు కేటాయించడమైనది.

యిండ్ల కాలనీలు :—

ఫ్యాక్టరీ కార్మికులు నివసించుటకు యిండ్ల కాలనీలు కట్టే స్కీము కొంతకాలంనుండి మన దేశంలో అమలుజరుగుతూనే వుంది. అట్టిస్కీము చేనేతవారికి కూడ ఒకటి తయారుచేసి అమలుజరిపేవిషయం ప్రభుత్వంచేత ఆలోచింపబడినది. తుదకు సొసైటీలలో వుండే చేనేతవారికి యిందునిమిత్తం కొంత విరాళముగాను కొంత అప్పుగాను యిచ్చుటకు తీర్మానింపబడినది. రు. 18 కోట్ల 75 లక్షలు ఈ ప్రణాళికలో ఈ పద్దుక్రింద కేటాయించుమని సిఫార్సు చేయబడింది.

ముగింపు :—

పైన పేర్కొన్న స్కీములన్నింటిమొత్తం రు. 130 కోట్ల రూపాయలయినది. అందులో రు. 65 కోట్ల 38 లక్షలు విరాళములునూ, రు. 64 కోట్ల 62 లక్షలు ఋణములున్నూ చేరియున్నవి.

–("ది హాండ్‌లూం జర్నల్" 1955 సెప్టెంబరు, అక్టోబరు సంచికనుండి).

నాలుగవ ప్రకరణం.

# అ. భా. చే. బోర్డు తనద్రవ్యమును వ్యయపరచు సాధారణ నియమములు.

(జనరల్ ప్రిన్సిపుల్స్)

## ఋణములు.

చేనేతవారికి షేరుకాపిటలు.

(ఎ) ప్రాథమిక చేనేతసహకార సొసైటీలకు షేరుకాపిటలుగా రెండేండ్లలో తీర్చవలసిన వడ్డీలేని ఋణములివ్వబడును.

(బి) ఆ యా రాష్ట్రాలలో సహకారేతర మగ్గాలెన్ని వున్నవో వాటిలో 4 వ వంతు చొప్పున మాత్రమే ఒక్కొక్క సంవత్సరంలో సొసైటీలలో చేర్చుకోవచ్చును.

(సి) 1955-56 సం॥ తర్వాత ఏ చేనేత కార్మికుడయినా క్రొత్తసొసైటీలోగాని, పాతసొసైటీలోగాని చేరినయెడల అతనికి షేరుకాపిటలులో 100 కి $87\frac{1}{2}$ వంతులు అప్పు యివ్వవచ్చును. మిగతా $12\frac{1}{2}$ వంతులు అతడే చెల్లించుకోవలెను. అప్పుడు అనుకూలమయిన పద్ధతిలో వాయిదాలప్రకారం తీర్చుకోవచ్చును.

(డి) సాధారణంగా మగ్గం కలిగినవారికిమాత్రమే సొసైటీలో మెంబరుగా వుండే అర్హతవుంది. కాని, కొన్ని ప్రత్యేక

పరిస్థితులలో మినహాయింపు లేకపోలేదు; ముఖ్యంగా కార్ఖానాల పద్ధతి ఉన్న చోట్ల.

(ఇ) పేరుకాపిటలు ఒక మెంబరుకుగాని, ఒక సొసైటీకిగాని ఎంత వుండాలనేది ఆ యా రాష్ట్రప్రభుత్వాలే నిర్ణయించుకోవచ్చును. దేశమంతా ఒకేపద్ధతి వుండనక్కరలేదు. కాని, శిల్కు (పట్టు లేక మంచి రేషం) చేనేత సొసైటీలలోని మెంబరు పేరుధనం రు. 100 లకు తక్కువ వుండరాదు. దీనిలోగూడా 100 కి 87½ వంతులు ఋణం లభించును.

(యఫ్) సొసైటీలయొక్క సరుకులను మరల కో ఆ. సొసైటీలద్వారానే అమ్మే లక్ష్యంతో పనిచేయవలెను.

(జి) అదివరకే స్థాపించబడిన సొసైటీలలోని మెంబర్ల పేరుకాపిటలు పెంచుకొనే నిమిత్తం సహాయం యివ్వబడదు.

(హెచ్) ఎక్కడయితే శిల్కుచేనేతమగ్గాలు 50 కంటె ఎక్కువగా ఒకేచోట కేంద్రీకరింపబడియుండునో అక్కడ శిల్కు సొసైటీని ప్రత్యేకంగా రిజిష్టరు చేయాలి. కాని, ఎక్కడ 50కంటె తక్కువ మగ్గములుండునో అక్కడ ఆ మగ్గందారులను ప్రత్తినూలు సొసైటీలలోనే చేర్చుకోవచ్చును. కాని, శిల్కువారి పేరుకాపిటలు రు. 100 లకు తక్కువగా వుండరాదు.

(ఐ) ఏసొసైటీలో శిల్కు, నూలుమగ్గాలు కలిసివున్నవో అందులో ఒక చేనేతపనివానికి శిల్కుద్వారానూ, నూలుద్వారానూ వచ్చే సహాయములు రెండూ చెందకుండా వుండేటట్లు మాత్రం రాష్ట్రప్రభుత్వం చూడవలెను.

(జె) రాష్ట్రీ కోఆపరేటివు సొసైటీలు అన్ని రాష్ట్రాల లోనూ శిల్కుకు నూలుకు కలిపి ఒకటే వుండవలెను; కాని ప్రాథమిక శిల్కుసొసైటీలకు రాష్ట్రీ శిల్కుచేనేతసొసైటీ అంటూ ఒకటి వుండరాదు.

(కె) అ. భా. చే. బోర్డు ఫిలేచర్ శిల్కు (మిల్లులలో తయారైన శిల్కుదారం) తో నేయు మగ్గాలతోనే సంబంధం పెట్టుకొంటుంది. లేదా చరఖా (వడికిన) శిల్కు మిశ్రమం కల్గినవాటితోగూడా పెట్టుకొనవచ్చును. పూర్తిగా చరఖాశిల్కు అయినా సంబంధంపెట్టుకొనవచ్చును. ఖాదీఉత్పత్తికేంద్రంక్రింద అ. భా. సర్వసేవాసంఘంవారిచే గుర్తింపబడిన చరఖాశిల్కు వారితో మాత్రం సంబంధం పెట్టుకోరాదు.

వర్కింగ్ కాపిటల్.

(ఎ) ఈ ఋణము 5 సం॥లో తీర్చేపద్ధతిలో చేనేత సొసైటీలకు యివ్వబడును.

(బి) సొసైటీలలో మగ్గం 1కి రు. 200 లకు మించకుండా అప్పు యివ్వవచ్చును. (ప్రస్తుతము రు. 300 లు గూడా యివ్వ వచ్చునని ఆలోచనలు సాగుతున్నవి-రచయిత) శిల్కు మగ్గము 1కి రు. 5000 లకు మించకుండా అప్పు యివ్వవచ్చును.

(సి) కేవలం నూలు కొనుగోలు అమ్మకం సొసైటీలుగా యింతవరకూ వున్న సంస్థలు బట్టను నేయించి అమ్మే సొసైటీ లుగా మారితే మగ్గము 1కి రు. 100 లు అప్పుయివ్వవచ్చును.

(డి) పాతసొసైటీలలో ఒక్కొక్క పాతమగ్గానికి రు. 100 లు వరకుంగు కాపిటలుగా అప్పు యివ్వవచ్చును.

గమనిక :— పైన (డి) లో వ్రాశిన అప్పు 30-6-54 నాటికి 3 సం॥లు వరుసగా నష్టంవచ్చి పేరుకాపిటలుకు మాత్రం నష్టంలేకుండా కాపాడుకొన్న సొసైటీలకు మాత్రం యిచ్చేటట్లు రాష్ట్రప్రభుత్వములు ఏర్పాట్లు చేయవలెను. సెస్సు ఫండునుండి వచ్చే ఈ సదుపాయం తాత్కాలికమైనది. కనుక రాష్ట్రప్రభుత్వములు త్వరలో వాటికి ప్రత్యామ్నాయమార్గము లలో పరపతిసౌకర్యాలు కల్గించవలెను.

సొసైటీలు అప్పులను ఉపయోగించుకొనే విధానం.

కో॰ఆ. డిపార్టుమెంటుద్వారా ఈ అప్పులను పంచలేనని ఏ రాష్ట్రప్రభుత్వమైనా తలంచితే స్టేటు కో॰ఆ. బ్యాంకునుగాని, సెంట్రల్ కో॰ఆ. బ్యాంకునుగాని ఈ దిగువ షరతులప్రకారం ఈ పనికి వినియోగించుకోవచ్చును.

(1) రాష్ట్రప్రభుత్వంద్వారా కో॰ఆ. బ్యాంకులకు వడ్డీ లేని మొత్తములుగా వీటినివ్వవచ్చును. అయితే క్రొత్తగా ఎన్ని మగ్గాలు సహకారరంగంలోనికి చేర్చుకోబడినవో, దానిని బట్టిన్నీ, మగ్గము 1కి ఎన్ని రూపాయలు రూల్సుప్రకారం యివ్వ వలెనో దానినిబట్టిన్నీ ఈ మొత్తం నిర్ణయించవలెను.

(2) ఈ కో॰ఆ. బ్యాంకులు అదివరకే ప్రాథమిక సొసై టీలకు తాము చేస్తున్న ఋణసహాయమును యింకా పెంచేదాని కొరకు ఈ మొత్తమును వినియోగించవలెను.

31-12-1953 నాటికి స్టేటు కో-ఆ. బ్యాంకులు వగైరాలు చేనేతవారికి చేస్తున్న ఋణసహాయం ఏ పరిమితిలో వుందో దానికి తగ్గకుండామాత్రం స్టేటు కో-ఆ. రిజిస్ట్రారు చూచుకోవలెను. అనగా ఆనాటి (31-12-53) ఋణములతో యిప్పటి సెస్సుఫండు గ్రాంటులు కలుపగా ఎంతసహాయమవుతుందో అంతసహాయము ఈనాడు చేనేతవారు పొందేటట్లు రిజిస్ట్రార్ చేయవలెను.

(3) చేనేతసొసైటీలకు యివ్వబోయే ఋణములమీద గాని, నేడు బకాయివున్న ఋణములమీదగాని సాలుకు 100 కి 4 పర్సెంటు వడ్డీకిమించి వుండరాదు. సెస్సుఫండునుండి యివ్వబడిన లోన్సు (అప్పు) లకుగానీ, బ్యాంకులు తాము స్వంతంగా యిచ్చిన అప్పులకుగానీ ప్రస్తుతం యింతకంటే వడ్డీరేటు ఎక్కువగావుంటే దానిని పై మేరకు సవరించవలెను.

(4) ఈ చేనేత సొసైటీలవారి ఋణములను తిరిగి వసూలు చేసి రాష్ట్రప్రభుత్వాలకు చెల్లించవలసిన బాధ్యతను కో-ఆ. బ్యాంకులు వహించవలెను.

(5) స్టేటు కో-ఆ. బ్యాంకువారు సెంట్రల్ కో-ఆ. బ్యాంకువారికి సాలుకు 100 కి 2 వంతుల వడ్డీకి మించకుండా యీ డబ్బును యివ్వవలెను. ఈ సెంట్రల్ బ్యాంకులు చేనేత సొసైటీలకు యిచ్చే అప్పులపై మరి 2 పర్సెంటులకు మించకుండా మాత్రమే వడ్డీని వేయవలెను. అంటే ఏ పరిస్థితిలోనూ 100 కి

4 రూ॥లు వడ్డీకి మించనివిధంగా స్టేటుబ్యాంకులు, సెంట్రల్ బ్యాంకులు తమలో తాము సర్దుబాట్లు చేసికొనవచ్చును.

(6) వినియోగపరచకుండా నిలువవుండిపోయిన మొత్తాలను స్టేటు కో-ఆ. బ్యాంకువారు, రాష్ట్రప్రభుత్వానికి వాపసు చేయవలెను.

(7) ప్రాథమిక చేనేతసొసైటీలు త్రైమాసిక (3 నెలల) స్టాకు రిపోర్టును సెంట్రల్ బ్యాంకు, రిజిస్ట్రార్‌లకు పంపవలెను.

స్టేటు చేనేత సొసైటీలకు ఋణములు.

ఈ దిగువ షరతులకు లోబడి ప్రాథమిక సొసైటీలగుడ్డను కొని అమ్మేనిమిత్తం స్టేటుసొసైటీలకు అప్పులివ్వవచ్చును.

(ఎ) స్టేటుసొసైటీ యొక్క వసూలయిన షేరుకాపిటలు, రిజర్వుఫండూ (నగదురూపంలోవున్న బిల్డింగుఫండుతోసహా) రెండున్నూ కలిపి వచ్చిన నష్టాన్ని తీసివేయుగా తేలిన నిఖరముపై 5 రెట్లు అప్పు యివ్వవచ్చును.

(బి) స్టేటు సొసైటీయొక్క వసూలయిన షేరుధనము, రిజర్వుఫండు, బిల్డింగుఫండు మూడూ కలుపగావచ్చిన మొత్తానికి 8 రెట్లకుమించి దానికి మొత్తం అప్పువుండరాదు.

(సి) స్టేటు సొసైటీ 3 నెలలకొకసారి పై అధికారులకు మార్కెటు ధరలనుబట్టి వారి స్టాకులవిలువ, వ్యాపారపరిస్థితి రిపోర్టు పంపవలెను.

(డి) ఈ ఋణములకు వడ్డీలేదు.

సేల్సు (విక్రయ) డిపోలకు వర్కింగు కాపిటలు.

ఈ పద్దుక్రింద ఎవరికీ సెస్సుఫండునుండి అప్పులివ్వబడవు. కాని, చేనేత సొసైటీలుగాని, కో-ఆ. సేల్సుడిపోలుగాని అంతగా

ఏర్పడని వెనకబడిన రాష్ట్రములలో రాష్ట్రప్రభుత్వాలే సేల్సు డిపోలను నడపడానికి పూనుకొంటే ఒక్కొక్క డిపోకు రు. 15 వేలకు మించకుండా అప్పు యివ్వవచ్చును.

మోటారువ్యేనుల్లో వస్త్రాలు అమ్ముటకు వర్కింగ్ కాపిటలు.

ఈ పద్ధతిక్రింద రాష్ట్రప్రభుత్వాలుగనుక కోరినట్లయితే వారుచేసే ప్రతిపాదనల ఔచిత్యమునుబట్టి అప్పులివ్వవచ్చును.

జిల్లాపారిశ్రామిక కో-ఆ.సొసైటీలకు షేరుధన సహాయం.

ఈ పద్దుక్రింద రాష్ట్రప్రభుత్వాలకు సెస్సుఫండునుండి ఎట్టి సహాయమూ చేయనక్కరలేదు.

## గ్రాంటులు (విరాళములు).

నిర్మాణపు వ్యయములు :—

(ఎ) ఋణముగాగాని, గ్రాంటుగాగాని యివ్వబడే మొత్తములయొక్క స్కీమును అమలుజరుపుటకు 100 కి 2 వంతులుమించి డైరెక్టు సూపర్విజన్ (తనిఖీ) ఖర్చులుండరాదు.

(బి) ఆ యా రాష్ట్రముల కివ్వబడిన సేల్సుడిపోలు, మోటారు వ్యానులు, క్యాలండరింగు యంత్రములు మొదలగునవికాక మిగతా శాంక్షన్ చేయబడిన ఋణములు, గ్రాంటులు మొత్తములో 100 కి 2 వంతులకు మించిన ఖర్చులుండరాదు.

మార్కెటింగు (డిపోలు, ఎంపోరియంలు, మోటారువ్యానులు)

(ఎ) విదేశాలకు ఎగుమతికితప్ప స్వరాష్ట్రంలోను, పర రాష్ట్రాలలోనూ రాష్ట్ర ప్రభుత్వాలకు, కో ఆ. సొసైటీలకు

విడిచిపెట్టబడును. పరరాష్ట్రంలో డిపో పెట్టదలచి సహాయం కావలసినప్పుడు ముందుగా అ. భా. చే. బోర్డుచేగాని, దాని స్టాండింగుకమిటీచేగాని అనుమతి పొందవలెను. మిగతా విషయములు సాధారణంగా బోర్డుకు తెలియబరచినచో చాలును.

(బి) స్వరాష్ట్రంలో డిపోగాని, ఎంపోరియంగాని స్థాపించితే రు. 4000 లకు మించని గ్రాంటు పొందవచ్చును.

(సి) ఒక డిపోగాని, ఎంపోరియంగాని 500 మగ్గాల (ఉత్పత్తికి) కు మించి ఉపయోగపడునట్లుండవలెను.

(డి) మోటారువ్యానులను సాధారణంగా డిపోలనుగా భావించి సెస్సుఫండునుండి సహాయం చేయవచ్చునుగాని ప్రారంభంలో ప్రయోగాత్మకంగామాత్రమే పనిచేసి వాటి ఉపయోగాన్ని సమీక్షించుకోవలెను. అంచనాలలో రాష్ట్రానికి ఒక వ్యానును యివ్వవచ్చును. మగ్గాలు అధికంగాగల రాష్ట్రములలో 75 వేల మగ్గాలకొక వ్యానుచొప్పున ఎక్కువ వ్యానులను పొందవచ్చును. 20 వేల మగ్గాలకు తక్కువగాగల రాష్ట్రమునకు వ్యాను యివ్వనక్కరలేదు.

(ఇ) మోటారువ్యానుల విషయంలో ఒకేమారు పెట్టుబడి పెట్టవలసిన—వ్యానుఖరీదు, షెడ్డునిర్మాణానికి—దానికి సెస్సుఫండునుండి గ్రాంటు యివ్వవచ్చును. (అనగా పెట్రోలు, రిపేరీలు, డ్రైవర్ జీతం వగయిరాలకు ఖర్చులు యివ్వరని అర్థము—రచయిత).

(యఫ్) ఈ వ్యానులకు మొదటి సంవత్సరంమాత్రం పెట్రోలు వగయిరా నిత్యఖర్చులకుగూడా అ. భా. చే. బోర్డు సెక్రటేరియట్ నిర్ణయించే ఒక సబబయిన గరిష్ఠ మొత్తము నకులోబడి విరాళం పొందవచ్చును.

(జి) మోటారువ్యానులు చెల్లించేపన్నులు సెస్సుఫండు నుండి యివ్వరాదు.

(హెచ్) పైన, (యఫ్) లో పేర్కొన్న ఖర్చులు బోర్డు సెక్రటేరియట్ నిర్ణయిస్తే చాలుగాని వ్యానును అమ్మివేసే ముందు బోర్డునే సంప్రదించవలెను. మరియు, అమ్మగావచ్చిన మొత్తం యిండియాప్రభుత్వానికి జమకట్టవలెను.

(ఐ) ఏరాష్ట్రప్రభుత్వమయినా పైన (డి) లో చెప్పిన దానికన్నా ఎక్కువవ్యానులు కావలిస్తే తాను స్వంతంగా కొన వచ్చును. కాని, వాటికిగూడా మొదటిసంవత్సరపు పై ఖర్చులు భరించేవిషయంలో అ. భా. చే. బోర్డు ఆలోచిస్తున్నది.

(జె) ఏ ప్రాంతంలో చేనేతగుడ్డను అమ్మే ప్రత్యేకసొసైటీ గానీ, ఎంపోరియంగానీ, ప్రభుత్వడిపోగానీ లేదో అక్కడున్న సాధారణ కోఆ. స్టోర్సు (లేక సొసైటీ) యితర వస్తువులతో పాటు చేనేతగుడ్డను కూడా విక్రయించదలచుకొంటే సాలుకు రు. 600/-లకు మించకుండా సబ్సిడీ యివ్వవచ్చును. కాని అట్టి స్టోర్సు సాలుకు రు. 6000 లకు మించి చేనేతగుడ్డను విడుదల చేయవలెను. అంతేగాక వారు మిల్లుబట్టగానీ, పవర్‌లూంబట్ట

గానీ అమ్మరాదు. ఈ చేనేతబట్టనైననూ కేవలం చేనేతసొసైటీలనుండి మాత్రమే నేరుగా కొనవలెను. ఈ రు. 600/-ల సబ్సిడీ రెండు భాగాలుగా ఒక్కొక్క అర్ధసంవత్సరమునకు రు. 3000/-లకు మించి అమ్మినట్లుగా రిపోర్టు చేరినమీదట యివ్వబడును.

## శిల్కు వస్త్రముల అమ్మకం.

(ఎ) సెస్సు సహాయంతో నడుపబడుతున్న ప్రత్తి నూలు బట్టల సేల్సుడిపోలను శిల్కుసొసైటీల గుడ్డను అమ్మేదానికి గూడా వినియోగించుకోవచ్చును; లేదా సొసైటీలు స్వంత మగ్గందారులనుండి కొనిన శిల్కుగుడ్డలకుగూడా వినియోగించుకోవచ్చును.

(బి) శిల్కు చేనేతగుడ్డల సేల్సుడిపోలను ఏరాష్ట్ర ప్రభుత్వమయినా ప్రత్యేకంగా పెట్టదలచుకొంటే రాష్ట్ర, రాష్ట్రాంతర డిపోలకు యిచ్చేటట్లుగానే సెస్సుఫండునుండి సహాయమివ్వవచ్చును.

## దేశంలో చేనేతబట్టల అమ్మకంమీద సబ్సిడీ.

(ఎ) సొసైటీలుగానీ, స్టేటు ఎంపోరియంలుగానీ 1-0-0 ఆ పైన అమ్మే అమ్మకాలకు 1-0-0 1కి 0-0-9 నుండి 0-1-6 వరకు రిబేటు యివ్వవచ్చును. ఈ రిబేటు ఆడిటు పరిపాలన అజమాయిషీ వగయిరా బాధ్యత రాష్ట్రప్రభుత్వం వహించవలెను.

(బి) ఈ సబ్సిడీ ఖచ్చితంగా ఎంతెంత వుండవలెనో, ఏ యే రకములకెంతెంత వుండవలెనో అనే వివరములు రాష్ట్ర ప్రభుత్వాలు తయారుచేసుకోవచ్చును.

(సి) ఈ రిబేటు యావత్తూ ఒక విరాళముగా సెస్సుఫండు నుండి యిచ్చివేయబడవలెను.

(డి) ప్రతీరాష్ట్రము తనకు కేటాయింపబడిన గరిష్ట మొత్తమునకు లోబడిమాత్రమే ఏ యే స్కీములు తయారుచేసి అ. భా. చే. బోర్డుకు దాఖలుచేయునో ఆ స్కీములలో ఒక భాగంగా మాత్రమే ఈ రిబేటుపద్దు వుండవలెను.

(వివరణ :— మొత్తం సెస్సునిధి రు. $4\frac{1}{2}$ కోట్లలో 1952 లో వివిధ రాష్ట్రాలకు నూలుసప్లయి అయిన ప్రాతిపదికపై—అదిగూడా ఒకానొక గరిష్టపరిమితికి లోబడి—పంపకం చేసి ఆ రాష్ట్రములో దానివంతుకు వచ్చిన మొత్తానికి లోబడే సెస్సుఫండుక్రింద సహాయంపొందే వీలయ్యే స్కీముల మొత్తం వ్యయము వుండవలెనని దీని తాత్పర్యం. రిబేటు కాకుండానే యితరస్కీముల వ్యయమే ఆ రాష్ట్రం వంతుకువచ్చిన మొత్తానికి దరిదాపుగావస్తే, ఆ పరిస్థితిలో రిబేటు 0-0-9 నుండి 0-1-6 వరకు అనేరేటును ఒక ఆయుధంగా ఉపయోగిస్తారన్నమాట. ఒకొ్కక్క సందర్భంలో—అంటే యితరస్కీముల వ్యయమే ఆ రాష్ట్రంవంతుకు పూర్తిగా సరిపోయినచో—రిబేటు అసలే రాకపోవచ్చును—రచయిత)

(ఇ) చేనేతబట్టను సొసైటీలు ఒక రాష్ట్రంలోని సరుకును మరొక రాష్ట్రంలోనికి ఎగుమతి చేసినప్పుడు రిబేటుతో పాటు, ప్యాకింగుఖర్చులు, రవాణాఖర్చులు గూడా సెస్సునుండి యివ్వవచ్చును.

(యఫ్) సహకారేతర రంగంలోని మగ్గములకు సంబంధించి రిబేటు పంపకం విషయంలో రాష్ట్రప్రభుత్వాలు ఒక ప్రత్యామ్నాయ నిర్మాణంద్వారా పంపకంచేసికోగల పథకములను సూచించవచ్చును. సూచింపబడిన ఆ ప్రత్యామ్నాయ మార్గం పటిష్ఠముగా వుందని అ. భా. చే. బోర్డుకు నమ్మకం కుదిరితే ఆ మార్గంద్వారా గూడా రిబేటు పంపకానికి అనుమతించవచ్చును.

(జి) పైన (యఫ్) లో చెప్పినదాన్ని పురస్కరించుకొని సొసైటీలోగాని, లైసెన్సుపొందిన ఫైర్ ప్రైజుడు డిపో (చౌకధరలడిపో) లోగాని సహకారేతర చేనేతవస్త్రం అమ్మినసూ రిబేటును అనుమతింపవచ్చును (చిల్లర అమ్మకంమీాద).

(హెచ్) 1-0-0 1కి 0-1-0 కు మించకుండా సొసైటీలు చేసే టోకు అమ్మకాలమీాదగూడా రిబేటు యివ్వవచ్చును. కాని, ఈ ఏర్పాటు ఆరుమాసములవరకు మాత్రమే కొన్ని తాత్కాలికావసరములు తీర్చుటకు సరియైన రక్షణలతో అమలుపరచవలెను.

(ఐ) ప్రతియొక్క నూలుచేనేతబట్ట అమ్మకంమీాదా రిబేటు యివ్వబడును. ఆర్టుశిల్కు (నార), ఊలుమీాద యివ్వ

బడదు. శిల్కు అంచులు మొదలయిన వాటిలో మాత్రం ఉపయోగిస్తే ఫరవాలేదు. బట్టలో మధ్యను, డిజైనులకుగాని, డోరియా (నిలువుగీతలు) లకుగాని, లేక గడులకు (చౌకంగా గీతలు) గానీ వున్న ఎడల అది గజము 1కి 2-8-0 ధరకు మించకపోతే రిబేటు యివ్వవచ్చును.

ప్రత్తినూలుగుడ్డల విదేశ ఎగుమతులకు సబ్సిడీ.

(ఎ) 1-0-0 కు 0-1-0 కు మించకుండా ఈ పద్ధుక్రింద యివ్వవచ్చును.

(బి) సొసైటీలు తమగుడ్డను ఎగుమతిచేసినప్పుడే ఈ రిబేటు యివ్వవచ్చును.

చేనేతవారికి మగ్గాలు, పనిముట్లు సప్లయి.

1. మగ్గాలమార్పు.

(ఎ) రాష్ట్రప్రభుత్వములు నాడి విసిరే గోతి చేమగ్గములను కుచ్చు (త్రాడు) లాగేమగ్గములుగా మార్చుమని ప్రోత్సహించవచ్చును. రు. 25 లకు మించకుండా అట్టి మగ్గంఖర్చు అంతా సెన్నునుండి గ్రాంటు (విరాళం) గా యివ్వవచ్చును.

2. టేక్ ఆఫ్ మోషన్ అటాచిమెంటు.*

---

* అనగా ఈ పనిముట్టును మగ్గానికి అమర్చినచో ఒక అంగుళంలో ఎన్ని ప్యాకపోగులు వుండాలని మనం నిర్ణయిస్తామో ఎక్కడచూచినా అన్నిపోగులు మాత్రమే వుండేటట్లు చేయు సాధనము.

ష్టయిస్ షెటిల్ (కుచ్చులాగే) మగ్గాలకు ఈ సాధనం అమర్చుమని ప్రోత్సహించవచ్చును. టేక్ ఆఫ్ మోషన్ 1కి రు. 70 లకు మించకుండా విరాళం యివ్వవచ్చును.

3. వార్పింగుఫ్రేమ్సు (పడుగుపోసే మిషను).

(ఎ) యిట్టి మిషనుకు ఆర్థిక సాయం చేయవచ్చును.

(బి) సౌరాష్ట్ర ప్రభుత్వం ఆలోచించిన రకానికి మిషను 1కి రు. 20 లు గ్రాంటు సబబుగా వుండును. (1-11-56 నుండి సౌరాష్ట్రంఅనే ఒక రాష్ట్రం లేదు. అది ఆనాటినుండి మహా త్తర బొంబాయిరాష్ట్రంలో విలీనమైపోయినది—రచయిత).

(సి) ఎక్కువ మగ్గాలున్న సెంటర్లలో 12 మగ్గాలకొక మిషను ఉపయోగించవచ్చును. ఎక్కడయినా యింకా తక్కువ మగ్గాలున్నా మిషను (ఆసు) మాత్రం ఏర్పరచుకోవాలి.

(డి) వీటికిచ్చే సాయం గ్రాంటుగా వుండవలెను.

4. పలకలు, మగ్గములు.

(ఎ) పలకలనిమిత్తం సెస్సునుండి సహాయం చేయ వచ్చును.

(బి) ఈ దిగువప్రకారం సహాయములు సబబుగా నుండును. పలక, దోనె, బీం, వాద్సు వగయిరాలతోసహా అయితే రు. 50 లు, ఒక్క దోనెతో మాత్రం పలక అయితే రు. 30 లు, వుత్తపలకలకు రు. 25 లు.

(సి) ఒక సంవత్సరంలో సముచితమగు సంఖ్యమేరకు మాత్రమే ఈ మగ్గాలకు శాంక్షన్ చేయబడును.

(డి) వీటినిమిత్తం యిచ్చే డబ్బంతా గ్రాంటుగా యివ్వబడును.

5. జాకార్డులతో కూడిన మగ్గములు.

(ఎ) దేశంలో వీటికి కొద్దివాటికి మాత్రమే డబ్బు యివ్వవచ్చును.

(బి) జాకార్డు మగ్గము 1కి రు. 300 లు సరిపోవును.

(సి) యిందులో సగం అప్పుగా, సగం గ్రాంటుగా యివ్వవచ్చును.

6. సెల్వులీజింగు, వెర్టికల్, వార్పింగు మిషెన్సు (క్రొత్తరకం పడుగుపోయు యంత్రభాగములు).

(ఎ) దీనికి రు. 500 లు యివ్వవచ్చును.

(బి) యిస్తే గ్రాంటుగానే యివ్వవలెను.

(సి) రాష్ట్రప్రభుత్వాలు వీటిని అధికంగా అడుగరాదు.

7. క్రాస్ బార్డర్ డాబీ.

(ఎ) దీనికి రు. 50 లు సరిపోవును.

(బి) దీన్ని గ్రాంటుగా యివ్వాలి.

8. యినుప పన్నెలు.

(ఎ) రు. 20 లకు మించకుండా ఒక్కొక్కదానికి గ్రాంటు యివ్వవచ్చును. రు. 10 లకు మించకుండా వెదురుపన్నెలకు గ్రాంటు యివ్వవచ్చును.

(బి) వీటిని మెంబర్లు వాడవచ్చునేగాని సొసైటీల ఆస్తిగానే వుండిపోవలెను.

<u>గమనిక</u> :— వెదురుపన్నెకు 5 సం॥ ఆయుర్దాయమని అంచనా.

9. వార్పింగు బీమ్సు.

ఈ పద్దుక్రింద సహాయం అక్కర లేదు.

10. వార్పింగు డ్రమ్ము.

దీనికి అచ్చంగా అయ్యే ఖరీదులో నాల్గింట మూడు వంతులు ప్రాథమిక సొసైటీలకు గ్రాంటుగా యివ్వవచ్చును.

11. వార్నిష్ చేసిన ఒడి (అచ్చు).

ఒక్కొక్క సెట్టుకు (అచ్చుకు) రు. 20 ల వంతున గ్రాంటు యివ్వవచ్చును.

## రాష్ట్రాంతర సేల్సు డిపోలు.

ఈ డిపోలను 1953-54లో గాని, ఆ తర్వాతగాని స్థాపింపబడినవాటికి రు. 15,000 లకు మించకుండా దానికి సరిగా ఖర్చు అయిన సాదమును గ్రాంటుగా యివ్వవచ్చును.

1954-55 నుండి మొదటి మూడు సంవత్సరాలకు మాత్రమే ఈ గ్రాంట్లు యిచ్చి తర్వాత నిలిపివేయబడవలెను.

## ఉత్పత్తి సహకారసంఘాలకు సిబ్బంది ఖర్చు.

1953-54 లోను ఆ తర్వాతనూ స్థాపింపబడిన ఈ సొసైటీలకు సిబ్బంది ఖర్చుక్రింద క్రిందిరీతిగా గ్రాంటు యివ్వవచ్చును.

50 మగ్గాలలోపు సొసైటీలకు ఏమీ యివ్వబడదు. 50 నుండి 99 లోపునగల సొసైటీలకు నెల 1కి రు. 50, లు ఆపైనున్న సొసైటీలన్నింటికీ నెల 1కి రు. 100 లు.

1954-55 నుండి మూడేండ్ల వరకు మాత్రమే ఈ విరాళము లివ్వవచ్చును. ఆ తర్వాతగూడా ఆ సొసైటీ దృఢపడలేక పోతే యింక లాభంలేదనుకొని ఆ సొసైటీకి ఏవిధమయిన సహాయం చేయరాదు.

కో-ఆ. సొసైటీలనుండి శాంపిల్సు కొనుట.

రకరకాలయిన చేనేతగుడ్డల శాంపిల్సు పెద్దపెద్ద ఖాతాదార్లకు సప్లయి చేస్తేగాని వ్యాపారం అభివృద్ధిచేయడం కష్టంగనక శాంపిల్సు కొని వాటిఖరీదులో కొంతభాగం గ్రాంటుగా పొందవచ్చును.

ప్రచారము.

ఈ పద్దుక్రింద ప్రతిస్కీము యోగ్యతనుబట్టి విచారించి గ్రాంటు లివ్వబడును.

సంఖ్యల సేకరణ.

చేనేతపరిశ్రమకు సంబంధించిన వివరములతోకూడిన సంఖ్యలు సేకరించడానికి గ్రాంటుగా కొంతడబ్బు వెచ్చించవచ్చును.

సెమీ ఆటోమాటిక్ మగ్గాలు.

ఈ రకంమగ్గాలు కొద్దిగా అక్కడక్కడ స్థాపించి గ్రాంటు యివ్వవచ్చును.

9

## గ్రాంటులు, అప్పులు.

పరిశోధన, దానికి పరికరములు, డిజైనులు, పనితనము నకు బహుమతులు.

(ఎ) విరివిగా చేమగ్గాలు కల్గిన రాష్ట్రాలలో రంగుల అద్ద కములోనూ, చలువచేయుటలోనూ, డిజైను (నమూనా) లు వేయుటలోనూ పరిశోధనాలయాలు స్థాపించుటకు ధనసహాయం పొందవచ్చును.

(బి) అలాంటి స్కీములలోని నాన్ రికరింగు ఖర్చులు గ్రాంటుగా యివ్వవచ్చును. మొదటి సంవత్సరానికి రికరింగు ఖర్చులుగూడా గ్రాంటుగా యివ్వవచ్చును. రెండవ సంవత్సరం నుండి రికరింగుఖర్చులో సగంమాత్రం యివ్వవచ్చును. మిగతా సగం యివ్వడానికి రాష్ట్రప్రభుత్వం సిద్ధపడవలెను.

(సి) బహుమతులిచ్చే స్కీములు వాటి యోగ్యతను బట్టి పరిశీలించవచ్చును.

## రంగుల కార్ఖానాలు, ఊరూరా తిరిగే రంగుల కార్ఖానాలు.

(ఎ) వీటికి ప్రత్యేక స్కీములు తయారుచేస్తే వాటి యోగ్యతనుబట్టి విచారించబడును.

(బి) వీటిలో నాన్ రికరింగుఖర్చులు గ్రాంటు యివ్వ బడును. రికరింగుఖర్చులుగూడా మొదటిసంవత్సరం గ్రాంటు యివ్వబడును.

యిప్పటిలో స్థలముల, బిల్డింగు సామానుల ఖరీదులు పెరిగియున్నందున కార్ఖానాలకోసం స్థలం ఖరీదుగానూ, బిల్డింగు సామానుల ఖరీదుగాను సహాయం చేయబడదు.

## డిజైనులు తయారుచేయు కార్ఖానాలు.

ఈ పద్దుక్రిందవచ్చే స్కీములో వాటి యోగ్యతనుబట్టి విచారింపబడును.

## నేసేవారి తర్ఫీదు.

ఈ బాధ్యత ప్రధానంగా రాష్ట్రప్రభుత్వాలది. ఖర్చు గూడా వారే భరించవలెను. అర్హతకల్గిన ప్రత్యేక స్కీముల విషయంలోమాత్రం అ. భా. చే బోర్డు విచారించగలదు.

## స్టాంపింగు (ముద్రవేయుట) ఇన్‌స్పెక్షన్ (తనిఖీ).

నాణ్యములను కంట్రోలు చేయవలెననేది సిద్ధాంతరీత్యా అంగీకరింపబడినది. ఈ పద్దుక్రింద వచ్చే స్కీములు యోగ్యతను బట్టి విచారింపబడును.

## టెస్టింగ్ లేబరేటరీస్ (పరీక్షాప్రయోగశాలలు)

వీటిని మనం ప్రోత్సహించనక్కరలేదు. సెస్సుఫండు దీనికోసం ఉద్దేశింపబడలేదు.

## ప్రింటింగుప్లాంట్సు (అద్దకం యంత్రాగారములు).

వీటివల్ల అద్దకపు కుటీరపరిశ్రమదారులకు నిరుద్యోగం కలుగుతుంది; గనుక వీటిని ప్రోత్సహించరాదు.

## నూలు రవాణాఖర్చులు మొదలగువాటికి సబ్సిడీ.

నూలుఉత్పత్తి పెరుగుదలను హెచ్చించనక్కరలేదు. దాని వినియోగమును మాత్రమే ప్రోత్సహించవలెను. అమ్మక మును ప్రోత్సహించుట కనుసరించవలసిన విధానం పైన చెప్ప బడేవుంది. అందుచేత నూలుకు రవాణాఖర్చులు వగైరాలలో సబ్సిడీ యివ్వనక్కరలేదు. కాని, అస్సాంవలె మారుమూల నున్న ప్రాంతములకు దూరభారంవల్ల, తగురైల్వేలు లేనందు వల్ల రవాణాఖర్చులు మరీఎక్కువగును. గనుక అట్టి విషయము లలో ప్రత్యేక స్కీములు వస్తే యోగ్యతనుబట్టి విచారింప బడును.

## స్టోర్సుమీద సబ్సిడీ.

చేనేత పరికరాలు కొని భారీగా నిల్వవుంచే వ్యాపార సందర్భంలో సబ్సిడీ యివ్వనక్కరలేదు.

## యంత్రపరికరములు.

భారీగా పడుగులు తయారుచేయు పెద్ద యంత్రములు మొదలగువాటివల్ల చేనేత ప్రజానీకానికి లాభదాయకంగాదు కనుక వాటిని ప్రోత్సహించరాదు.

## ఫినిషింగ్ (నునుపుచేసి మెరుగుపెట్టు) యంత్రములు.

(ఎ) ఈ పద్దుక్రింద వచ్చే స్కీములు యోగ్యతనుబట్టి విచారింపబడును. అనగా, ఏ యే ప్రాంతములలో విరివిగా

తయారవ్యే పరికరములకు ఈ ఫినిషింగ్ అవసరమో మొద లగు విషయములు పరిశీలించవలసినవి.

(బి) ఈ పద్దు క్రింద యిచ్చే నాన్ రికరింగు ఖర్చులో 50 పర్సెంటు అప్పు, 50 పర్సెంటు గ్రాంటూ యివ్వవచ్చును.

(సి) ఏ రాష్ట్రానికీ ప్రారంభంలో ఒక్క ఫినిషింగ్ ప్లాంటు కంటే ఎక్కువ వుండరాదు.

(డి) రికరింగుఖర్చులు ఒక సంవత్సరానికి గ్రాంటు యివ్వ వచ్చును.

(ఇ) ఫినిషింగ్ ప్లాంటులలో నూలుతోడే, పడుగు చేసే, గంజిపెట్టే యంత్రముండరాదు.

(యఫ్) క్యాలండరింగు యంత్రమును పెట్టుకొనేయెడల రాష్ట్ర ప్రభుత్వమునకు సెస్సుఫండునుండి 20 సాలుసరి వాయిదా లలో తీర్చే పద్ధతిపైన తక్కువ వడ్డీకి అప్పు యివ్వవచ్చును.

## ఎపెక్స్ (రాష్ట్ర) బ్యాంకులు ప్రాథమిక సొసైటీలనుండి వసూలుచేసే వడ్డీలు.

ఈ వడ్డీ సెస్సుఫండునుండి సబ్సిడీగా యిస్తారా ? అనే ప్రశ్న వచ్చింది. అట్టి పరోక్ష ప్రయోజనములకు సెస్సుఫండును వాడరాదనేది ఒక సాధారణ సూత్రమని బోర్డు చైర్మన్ చెప్పినారు.

## మలబారులోవలెనే చిన్న ఫ్యాక్టరీలలో పనిచేయు చేనేత వారికి సహాయము.

(ఎ) ఏ ఫ్యాక్టరీఅయినా సహకారసంఘంగా మారదలచుకొని, దానిమగ్గములపై చేనేతకార్మికునికి అధికారం

తయారయ్యే పరికరములకు ఈ ఫినిషింగ్ అవసరమో మొద లగు విషయములు పరిశీలించవలసినవి.

(బి) ఈపద్ధ్రుక్రింద యిచ్చే నాణ్‌రికరింగు ఖర్చులో 50 పర్సెంటు అప్పు, 50 పర్సెంటు గ్రాంటూ యివ్వవచ్చును.

(సి) ఏ రాష్ట్రానికీ ప్రారంభంలో ఒక్క ఫినిషింగ్ ప్లాంటు కంటే ఎక్కువ వుండరాదు.

(డి) రికరింగుఖర్చులు ఒక సంవత్సరానికి గ్రాంటు యివ్వ వచ్చును.

(ఇ) ఫినిషింగ్ ప్లాంటులలో నూలుతోడే, పడుగుచేసే, గంజిపెట్టే యంత్రముండరాదు.

(యఫ్) క్యాలండరింగు యంత్రమును పెట్టుకొనేయెడల రాష్ట్రప్రభుత్వమునకు సెస్సుఫండునుండి 20 సాలుసరి వాయిదా లలో తీర్చే పద్ధతిపైన తక్కువ వడ్డీకి అప్పు యివ్వవచ్చును.

## ఎపెక్స్ (రాష్ట్ర) బ్యాంకులు ప్రాథమిక సొసైటీలనుండి వసూలుచేసే వడ్డీలు.

ఈ వడ్డీ సెస్సుఫండునుండి సబ్సిడీగా యిస్తారా ? అనే ప్రశ్న వచ్చింది. అట్టి పరోక్ష ప్రయోజనములకు సెస్సుఫండును వాడరాదనేది ఒక సాధారణ సూత్రమని బోర్డు చైర్మన్ చెప్పినారు.

## మలబారులోవలెనే చిన్న ఫ్యాక్టరీలలో పనిచేయు చేనేత వారికి సహాయము.

(ఎ) ఏ ఫ్యాక్టరీఅయినా సహకారసంఘంగా మార దలచుకొని, దానిమగ్గములపై చేనేతకార్మికునికి అధికారం

యిచ్చే పద్ధతిమీాద స్కీము తయారుచేసి పంపితే ఆర్థిక సహాయంచేసేదానికొరకు ఆలోచింపబడును.

(బి) యిట్టి ఫ్యాక్టరీలు క్రొత్తగా పెట్టే స్కీములకు సహాయం చేయబడదు.

## చేనేతవారికి యిండ్ల కాలనీలు.

(ఎ) కోఆ. సొసైటీలోవున్న చేనేతవారికి యిండ్ల కాలనీ కట్టుకొనే నిమిత్తం సెస్సునుండి సహాయం పొందవచ్చును.

(బి) ఒక్కొక్క యింటికి రు, 5000 లకు లోపు (స్థలం ఖరీదుతోసహా) మాత్రమే ఖరీదు కలిగియుండవలెను.

(సి) మొత్తం ఖరీదులో 100 కి 33⅓ వంతులు గ్రాంటుగాను, 50 వంతులు అప్పుగానూ సెస్సునుండి యివ్వబడును. 4¼% వడ్డీతో ఈ అప్పును 25 సం॥లో తీర్చవలెను.

(డి) సాధ్యమైనంతమటుకు దేశమంతటా ఈ పద్ధుక్రింద కట్టే యిండ్లు ఒకేమాదిరి (రూపము) గా వుండవలెను. ఎమ్మిగనూరులోని యిండ్లపద్ధతి బాగా నేవుంది.

(ఇ) చక్కగానూ, ఆర్థిక దార్ఢ్యంతోను మేనేజ్ చేయబడి చాలాకాలంనుండి స్థిరపడిన ప్రాథమిక కోఆ. సొసైటీలకు మాత్రమే కాలనీస్కీమును రాష్ట్రప్రభుత్వం సిఫార్సు చేయవలెను.

(యఫ్) నిజముగా ఏ మెంబరుకు సొసైటీలో యిల్లులేని

యిబ్బందికలదో అతనికి మాత్రమే ఈ సహాయము అందునట్లు చూడవలెను *

## సామాన్య విషయములు.

(ఏ) రాష్ట్రప్రభుత్వములు చేనేత పరిశ్రమాభివృద్ధికి స్కీములను తయారుచేసి వాటిలో ఏవిముందు ఏవి వెనుక అనేది నిర్ణయించుకొనవలెను. దానిప్రకారం బోర్డుకు దరఖాస్తులు పంపుచుండవలెను.

(బి) రాష్ట్రముల కివ్వబడే గ్రాంటులు, అప్పులు మొదలగునవన్నీ కలిపి రాష్ట్రమునకు కేటాయింపబడిన సెస్సుఫండు వాటా మొత్తమునకు లోబడి వుండవలెను.

(సి) గ్రాంటులు, అప్పులు ఏ నియమములకు లోబడి వుండవలెనో వాటిని బోర్డు సెక్రటేరియట్ నిర్ణయిస్తుంది. ఈ సెక్రటేరియటుకు బోర్డు అధ్యక్షుడు సలహా యివ్వగలడు. ఆ తర్వాత అన్ని రాష్ట్రములకు వాటిని తెలియజేయుదురు.

గమనిక:—పైన తెలిపిన విషయములు రాష్ట్రప్రభుత్వం తనకు తానుగా అమలుపరచలేదు. రాష్ట్రప్రభుత్వం అ. భా. చే. బోర్డుకు స్కీములు పంపడమున్నూ, ఇండియాప్రభుత్వంచే అవి శాంక్షన్ పొందడమున్నూ జరిగేవరకూ అమలు జరుగవు.

---

* ఇటీవల ఇంటి 1కి రు. 5000/-లు బదులు రు. 3600/-లు మాత్రమే గరిష్ఠపరిమితి నిర్ణయించినారు. రు. 3600/-లో $\frac{1}{3}$ గ్రాంటుగాను $\frac{1}{2}$ అప్పుగాను యిస్తారు. మిగతాది చేనేతకార్మికుడు తెచ్చుకోవలెను. తాను తెచ్చుకోవలసిన $16\frac{2}{3}\%$ శ్రమదానరూపంలో వున్నా పరవాలేదు.

## అ. భా. చే. బోర్డు మూడవ సాంవత్సరిక రిపోర్టు (1955-56) నుండి కొన్ని ముఖ్యమైన హంశములు.

1. నిత్యకృత్యానికి అయ్యే (రన్నింగ్) ఖర్చులకుగాను 1953-54 లోను తరువాతను ఏర్పడ్డ ఉత్పత్తి విక్రయ సొసైటీలకు సహాయమును బోర్డు (16-4-56) కోరగా కొన్ని షరతులకు లోబడి గ్రాంటులివ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది.

2. సెస్సుఫండుతో స్థాపించిన ఎంపోరియంలలో యితర కుటీర పరిశ్రమల వస్తువుల వ్యాపారంగూడ చేయవచ్చుగాని, దానికి ప్రత్యేకంగా కావలసిన పెట్టుబడి రాష్ట్రప్రభుత్వాలు పెట్టుకోవాలి. ఎకౌంట్లు విడివిడిగా పెట్టాలి. సిబ్బంది వగైరా ఖర్చులలో కొంతభాగం రాష్ట్రప్రభుత్వాలు భరించాలి.

3. సెస్ ఫండ్ స్కీముల క్రింద పెట్టిన సేల్సుడిపోలకు 2 వ సం॥ కూడా నూటికి నూరుపాళ్ళు ఖర్చులన్నీ ప్రభుత్వం భరించాలని బోర్డు కోరగా. 75% మాత్రం భరించుతామని ప్రభుత్వం తెలియపర్చింది.

4. హాకర్ గా మూట బుజాన వేసుకొని ఇంటింటికి తిరిగి అమ్మేవారిని, సంతలకు తీర్థాలకు సరుకులిచ్చి పంపేవారిని సొసైటీలు నియమిస్తే అయ్యేఖర్చులు భరించమని బోర్డు ప్రభుత్వాన్ని కోరింది. మచ్చుకు ప్రస్తుతం మద్రాస్, బొంబాయి రాష్ట్రాలలో దీన్ని అమలుపర్చమని ప్రభుత్వం చెప్పింది.

5. అందమైన రకాలు నేయడానికి, మగ్గం పలకకు త్ర్యక్త పేటికలు (డాబ్ బాక్సెస్) సొరుగులు వుండాలి. దీనికి గ్రాంటు

కోరగా ప్రభుత్వం పలకకు రు. 25/- సొరుగులకు రు. 8/- చొ॥ యివ్వడానికి అంగీకరించింది.

6. గుడ్డ బలాన్ని పరీక్షించే యంత్రములను ఆ యా రాష్ట్రములలో నెలకొల్పాలని కోరితే యంత్రం 1కి రు 5000/- చొ॥న ప్రభుత్వం శాంక్షన్ చేసింది.

7. కార్ఖానాపద్ధతిలో మగ్గాలను తీసుకు రావడానికి ప్రభుత్వం ఏ సొసైటీకి ఎట్టి సహాయం చేయదు.

8. సొసైటీలకు భవన లేక గొడౌను నిర్మాణానికి ప్రభుత్వం సాయం చేయదు.

9. శిల్కు చేనేతగుడ్డమీద రిబేటు యివ్వబడదు.

10. పరరాష్ట్రములలో డిపోలు ఆ రాష్ట్ర ప్రభుత్వం, ఫాబ్రిక్స్ సొసైటీ అనుమతించితే పెట్టుకోవచ్చు.

11. స్టేట్ సొసైటీలు మార్కెటు రేటుకు నూలును ప్రాథమిక సొసైటీలకిచ్చే ప్రయత్నంలో పొందిన నష్టాన్ని సగం రాష్ట్రప్రభుత్వం భరిస్తానన్నది.

12. స్టేట్ ట్రేడింగ్ సంస్థ లేక స్టేట్ సొసైటీ తెప్పించే, పంపే, నూలు నూలుబేళ్ళమీద రైలుచార్జీలు 50% తగ్గించాలని కోరగా రైల్వే డిపార్టుమెంటుకు కేంద్రప్రభుత్వం ఆ తీర్మానాన్ని అందజేసింది ఆలోచించుకోడానికి.

అయిదవ ప్రకరణం.

# కానుంగో కమిటీ రిపోర్టు. *

(సారాంశము)



ఒక విజ్ఞప్తి:—

[వస్త్రపరిశ్రమ చరిత్రలో కానుంగోకమిటీ రిపోర్టు ఒక ముఖ్యమయిన పత్రము. మన కయిష్టమయిన హాంశములున్నప్పటికన్నీ ఈ రిపోర్టును ఆద్యంతం చదవడం ప్రయోజనకారి కాగలదు. అందుకే ఈ రిపోర్టు (అనుబంధములు మినహాయించి) ను అఖిలభారత చేనేతబోర్డువారు తెలుగున అనువాదం చేయించి ప్రచురించినారు. (బోర్డుపేర బొంబాయి. 1 కి వ్రాసి దాని ప్రతి తెప్పించుకోవచ్చును).

యిందువల్ల ఈ కమిటీ రిపోర్టును గురించి క్లుప్తంగా ముఖ్య విషయాలపై మాత్రమే వ్రాయడం జరిగింది.]

## కానుంగోకమిటీ నిర్మాణం.

ఇండియా ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమల శాఖా మంత్రివర్గము 1952 నవంబరు 25 వ తేదీని ఆమోదించిన నెం. సి.

* కమిటీలకు అవిచేసే పనినిబట్టి వాటిపేర్లు అధికారరీత్యా నిర్ణయింపబడినప్పటికీ ఆ యా కమిటీల అధ్యక్షుల పేరుతో వాటిని పిలువడం మామూలు. ఈ కమిటీకి శ్రీ నిత్యానందకానుంగో అధ్యక్షులుకనుక ఆయన పేరుమీద "కానుంగోకమిటీ" అనేపేరున పిలువబడుచున్నది. ఈ రిపోర్టు ఏకగ్రీవమయినది. మినిట్ ఆఫ్ డిస్సెంటులు లేవు.

టి. (ఎ) / 52 తీర్మానం ప్రకారం వస్త్రపరిశ్రమ సమస్యల పరిశీలనకుగాను "వస్త్రపరిశ్రమ దర్యాప్తు సంఘం" (టెక్స్టయిల్ ఎంక్వైరీ కమిటీ) గా పేర్కొనబడు ఈ సంఘంలో క్రింద పేర్కొనబడినవారు సభ్యులుగా నియమించబడినారు.

1. శ్రీ నిత్యానంద కానుంగో ఎం. పి. (ఒరిస్సా) అధ్యక్షులు.
2. ,, హెచ్. సి దాసప్ప (బెంగుళూరు)
3. ,, వి. యస్. తివారీ ఎం. పి. (ఉత్తరప్రదేశ్)
4. ,, ఎ ఆర్. భట్ ఎం. ఎల్. సి. (పూనా)
5. ,, ప్రొఫెసర్. యస్. కె. మురంజన్. ప్రిన్సిపాల్. సిడిన్ హేం. వాణిజ్య కళాశాల (బొంబాయి)
6. ,, ప్రొఫెసర్. ఆర్. బాలకృష్ణ. అర్థశాస్త్ర అధ్యాపకులు, మద్రాసు యూనివర్సిటీ.
7. ,, ప్రొఫెసర్. ఎస్. కె. బాసు. రీడర్ యిన్ ఎకానామిక్స్ కలకత్తా యూనివర్సిటీ.
8. ,, ఎస్. పి. చోప్రా. చార్టర్డు అక్కౌంటెంటు (ఢిల్లీ)
9. ,, టి. స్వామినాథన్. ఐ సి. యస్. యిండియాప్రభుత్వ టెక్స్టైలు కమీషనర్ (బొంబాయి)
10. ,, యస్. సుబ్రమణ్యన్. యిండియాప్రభుత్వం వాణిజ్య, పరిశ్రమలశాఖ లెక్కల సలహాదారు.

ఈ సంఘం దర్యాప్తు చేయవలసిన విషయములు.

1. ప్రత్తివస్త్రపరిశ్రమయొక్క వేర్వేరు శాఖల నిర్మాణ, వ్యవస్థల పరిశీలన.

2. వస్త్రాలకు దేశంలోను, విదేశాలలోను కల గిరాకీ యొక్క స్వభావ పరిమాణముల పరిశీలన.

3. ఈ క్రింద పేర్కొనిన హంశముల దృష్ట్యా వస్త్రపరిశ్రమకు సంబంధించిన మూడు శాఖలలోను ఉత్పత్తిని ఎంత వరకు హెచ్చించే అవకాశమున్నదీ సాధ్యమయితే అంచనా వేయడం.

ఆహంశములివి :—

(ఎ) దేశంలో ప్రజల వాడకానికి సరసమయిన వస్త్రాలను సరఫరా చేయడం.

(బి) సాధ్యమైనంత ఎక్కువగా విదేశీ ద్రవ్యమారకం సంపాదన.

(సి) సాంఘికదృష్ట్యా ఎక్కువ అభిలషణీయమయిన విధంగా అంగబలాన్ని, సాధన సంపత్తిని వినియోగించడం.

(డి) అవసరమైతే ఒకటిలేక ఇంకా ఎక్కువ రంగాలకు ఉత్పత్తిని ప్రత్యేకిస్తూ ప్రతీశాఖను ఏ పద్ధతులపై ఎంతవరకు అభివృద్ధి చేసేదీ సూచించడము.

4. యింకా తదితర సమస్యలన్నింటినీ పరిశీలించి ప్రభుత్వానికి తగు సిఫార్సులు చేయడం.

కొన్ని రకాల ఉత్పత్తిని చేనేత పరిశ్రమకు కేటాయించాలని, మిల్లులకు లభ్యమయ్యే ధరలకు చేనేతకు కూడా నూలు సప్లయి చేయాలని చాలాకాలంనుండి మొత్తం చేనేతవారంతా ఆందోళన చేస్తూనేవున్నారు. కన్నీటి తుడుపుగా 1950 లో

ప్రభుత్వం కొన్ని రకాలను కేటాయిస్తూ ఉత్తర్వు చేసింది. * కాని, వీటివల్ల ఎట్టి ప్రయోజనం కలుగలేదు. చేనేత పారిశ్రామికుల పరిస్థితి మరింత అధ్వాన్నమై 1951 నాటికి విషమించినది. ఆకలియాత్రలు సత్యాగ్రహాలు, ఆకలిమరణములు గూడ సంభవించినవి. ఇదేసమయంలో మద్రాసు అసెంబ్లీలో ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు చేనేతకు చీరలు, ధోవతుల ఉత్పత్తి కేటాయించాలని యిండియాప్రభుత్వానికి సిఫార్సుచేసే అధికార తీర్మానమును ప్రతిపాదించగా అన్ని పక్షాలవారు దాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. (దర్మిలా బొంబాయి, హైదరాబాదు, బీహారు, ఆంధ్ర శాసనసభలు కూడా యిట్టి తీర్మానాలనే ఆమోదించాయి) ♦ బయటి వత్తిడితోపాటుగా

* ఈ కేటాయింపులు కార్వేకమిటీ నివేదికసందర్భంలో ఒక పుట్ నోట్ (పాదటీక) లో వ్రాయబడినవి. అక్కడ వానిని చూడ ప్రార్థన.

♦ ఈ సందర్భంలో ప్రధాని శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూగారి వైఖరి తెలుసుకొనడం చాల ముఖ్యం. చేనేతవారంతా ఏకకంఠంగా కోరే "చీరలు, ధోవతుల రిజర్వేషన్" పట్ల ఆయన దృక్పథం మనకిందువల్ల స్పష్టం కాగలదు. 3–11–52 తేదీ ఆంధ్రప్రభలో యిందుకు సంబంధించినవార్తను చూద్దాము.

నాగపూర్, నవంబర్ 1 (1952)

"ప్రధాని నెహ్రూ తనను కలుసుకొన్న చేనేత ప్రతినిధివర్గంతో చీరెలు, ధోవతుల ఉత్పత్తిని పూర్తిగా చేనేతకు రిజర్వు చేయడమనేది ప్రమాదకరమైన ప్రయత్నం కాగలదని చెప్పినట్లు నేడిచ్చట తెలియవచ్చినది."

శాసనసభలుగూడా యిట్లా తీర్మానాలు చేయడంతో అప్పటి పరిశ్రమల మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు ఈ దర్యాప్తు సంఘమును ఏర్పాటు చేయించారు.

## సిఫారసులు.

వీరి (సెప్టెంబరు 1954) సిఫార్సులలో ముఖ్యమయినవి నాలుగు:—

1. చేమగ్గాలస్థానే పవర్ మగ్గాల ప్రవేశము.
2. పవర్ మగ్గాలస్థానే ఆటోమేటిక్ మగ్గాల ప్రవేశము.
3. చేనేతమగ్గాలకు రిజిస్ట్రేషన్ పద్ధతిని సూచించుట.
4. చేమగ్గాల సంఖ్యను వీలయినంత తగ్గించి క్రమ క్రమగా ఆ పరిశ్రమను రూపుమాపుట.

## అంకెల గారడీ.

మొదట చేనేతమగ్గాలను తగ్గించేటందుకు ఈ కమిటీపడిన అవస్థలను గురించి చర్చించుదాము.

రాష్ట్రప్రభుత్వాలు యిచ్చిన అంకెలనుబట్టి దేశంలో 28 లక్షల మగ్గాలని కమిటీ తన రిపోర్టు 46 వ పేరాగ్రాఫ్‌లో పేర్కొంది. కాని 1951 జనాభాలెక్కల ననుసరించి సుమారు 20 లక్షల మగ్గాలుండవచ్చునని గ్రహించవచ్చునన్నది.

ఇంతవరకూ వచ్చి అస్సాంలో వ్యాపారదృష్టితో కాక స్వంత ఉపయోగానికి బట్ట నేసుకొనే 4,50,000 పోగా యింక 15,50,000 మగ్గాలే నికరంగా వ్యాపారసరళిలో పనిచేస్తుండ వచ్చునని చెప్పింది.

అంతటితో కమిటీకి తృప్తికాలేదు. 1953–54 సంవత్సరంలో చేనేత పరిశ్రమకు సప్లయి కాబడిన నూలునుబట్టి (పవర్ లూమ్సు ఉత్పత్తి 20 కో. గజాలు తీసివేసి) చేనేతపరిశ్రమ 140 కో. గజాలను ఉత్పత్తిచేసి యుండుననీ రోజుకు 6 గజాల చొప్పున ఏడాదికి 200 రోజులు పనిచేసియుందురనే లెక్కను ఈ ఉత్పత్తి 11,17,000 చేమగ్గాలు, లేక రమారమి 12 లక్షలు మగ్గాలు తయారు చేసియుండుననీ, కాబట్టి దేశంలో 12 లక్షల చేమగ్గాలుమాత్రం కలవని ఈ కమిటీ సిద్ధాంతీకరించినది. అప్పటికి పాపం! కొంత సంతృప్తి పడింది!

చేనేతపరిశ్రమకు అవసరమయినంతనూలు సరిగా సప్లయి చెయ్యబడదు అనేది ఒక సాధారణ సూత్రం. అందులోనూ చేనేత పరిశ్రమ చాలా తీవ్రమయిన మాంద్యానికి గురి అయింది. ఆ సంవత్సరంలో ఆకలిచావులు సంభవించాయి. అంతేగాక నూలు సప్లయినిబట్టి మగ్గాలను లెక్కించే పద్ధతి పూర్తిగా హాస్యాస్పదమయినది. కరువుకాలంలో రేషనింగుకు సప్లయి కాబడిన ధాన్యాన్నిబట్టి తల 1కి 16 ఔన్సుల లెక్కను విభాగించి దేశంలో యింతేమంది వున్నారంటే ఎంత సరిగాదో ఈ కమిటీ అనుసరించిన ఈ పద్ధతికూడాగూడా అంతే సరికాదు. తాను *"శాంపిల్ సర్వే" (మచ్చుకొలత) జరపగాకూడా,

* కానుంగో కమిటీవారే 127 వ పేరాలో ఈ విధంగా చెప్పేరు. "నమ్మదగిన అంకెలు లేకపోవడమే కమిటీ ఎదుర్కోవలసివచ్చిన అన్ని సమస్యలులోకి పెద్దదైంది....ఇకముందైనా దీనికోసం ఒక శాశ్వత సంస్థను

ఏర్పరచవలెనని కమిటీ నొక్కి చెపుతూవుంది. అంకెలు లేనిది ప్లాన్ సాధ్యంగాదు. 3 మామూలు మగ్గాలస్థానే 2 అభివృద్ధికరమైన చేమగ్గాలు (ఉదా :- పెడల్ లూం : రచయిత) లేదా 2 చేమగ్గాలకు 1 పవర్ మగ్గం చొ॥ మార్పు చేయాలని మా సూచన. సాలుకు 200 రోజులు పనిచేస్తేనే అవి "సర్వకాలమగ్గం" (హోల్ టైం) కాని లేకపోతే తాత్కాలిక మగ్గమే అన్నాం. అంచేత కనీసం సాలుకు 150 రోజులు పనిచేసేవైనా రిజిష్టరు చేసి లైసెన్సిచ్చి వాటికే-మగ్గంమార్పు స్కీములో అవకాశం యివ్వాలి. కొత్త మగ్గాలు పెట్టుకోడానికెంతమాత్రం అనుమతించరాదు (పేరా 128). ప్లాన్ ప్రకారం చేయవలసిన పన్నులన్నిటికి ఆధారపడదగిన వాస్తవ అంకెలు అనివార్యంగదా!

ప్ర॥ పం॥ వ॥ ప్రణాళిక సమీక్ష 13 పేజీలో ప్లానింగు కమిషన్ యీ విధంగా వ్రాసింది. "అంకెల సేకరణలోను, వాటిని విభజించడం లోను మనం యింకా చాలా అభివృద్ధి చెందవలసివున్నదని గత 5 ఏళ్ళ అనుభవం చెపుతూవుంది. ఇప్పుడు వెనక్కి తిరిగి చూచుకుంటే పెట్టుబడు లెక్కువ పెట్టనవకాశంవున్న సంవత్సరంలో సరియైన అంకెలులేక పొర పాటు చేసేం. ఉద్యోగ నిరుద్యోగ పరిస్థితి....వగైరా అంకెలు సవ్యంగా లేకపోవడంవల్ల ఆర్థిక రంగంలో ఏ శక్తులు పనిచేస్తున్నాయో సకాలంలో అవగాహన చేసుకోలేకపోయేం."

జాతీయ శాంపిల్ సర్వే, 1 వ నెంబరు సాధారణ రిపోర్టు, 2 వ పేజీలో యిలా వ్రాసేరు : "రేండం (అనగా ఆకస్మికంగా చేసిన) శాంపిల్ సర్వేలో అంతా వాస్తవమే వుంటుందనుకోనక్కరలేదు. హెచ్చుతగ్గు లుండవచ్చు. దానికిగల కారణాలలో ఒకటి ఏమనగా సర్వే చేయువానికి కొన్ని నమ్మకాలుంటాయి. దాన్నిబట్టి గ్రామస్థులను ప్రశ్నలడుగుతాడు. సమాధానాలు వ్రాసుకుంటాడు."

ఆ విధంగా జరిపిన ప్రాంతంలోని 25,000 మగ్గాలలోను 100 కి 80 మాత్రమే పనిచేస్తున్నాయని (48 వ పేరా) ఆ లెక్కన తానే ముందు తేల్చుకొనినట్టి 15½ లక్షల మగ్గాలలో 20% తగ్గించగా 12,40,000 తేలగలవని యీ అంకె తన ఊహకు దాపుగా వున్నదని కమిటీ చెప్పింది. మిల్లుల అభివృద్ధికి చేనేత ఒకపీడవలె దాపురించినదే; దీని నెలా వొదిలించుకోవాలనే గురి ప్రప్రథమంనుండి వీరి మనస్సులో వుంటూనేవుంది. విచారణలో ఏ వివరంగురించి ఆలోచించినా వారి మనసు యీ గురినుండి తప్పలేదు.

మచ్చుకోలతలో తగ్గింపు అగుపించడానికి అనేక కారణములుండవచ్చును. పల్లెప్రాంతాలలో మగ్గాలు గిట్టుబాటు కానందున, కూలికి నేయించే నాథుడు దొరకనందున పట్టణ ప్రాంతాలకు చాలమంది వలసవచ్చి యుండడం సంభవము.

కాబట్టి, కమిటీకి మొత్తంగా చేనేత పరిశ్రమపై "సవతి తల్లి ప్రేమ" వున్నందుననూ, మొత్తం పరిశ్రమంతా పవర్ మగ్గాలుగా మార్చివేయాలనే సంకల్పం వుండటంవల్లనూ ఈ విధంగా అది వ్రాసినదనేది స్పష్టము.

## పవర్ మగ్గాలుగా మారాలి :

సాలుకు 50 లక్షల వంతున మన జనాభా పెరుగుతున్నందున 1960 నాటికి సుమారు 40 కోట్లు కాగలదనీ, తల 1కి 18 గజాల వంతుల అప్పటికి 720 కోట్ల గజాల గుడ్డ స్వదేశావ

సరాలకే కావలెననీ 87వ పేరాలో చెబుతూ, మిల్లుల ఉత్పత్తి 500 కో.గజాలున్నూ, చేనేత ఉత్పత్తి 140 కో.గజాలున్నూ, పవర్ మగ్గాల ఉత్పత్తి 20 కో. గజాలున్నూ కలిపి 660 కోట్ల గజాలు ఉత్పత్తి కాగలదనీ, యిందులో ఎగుమతులకుగాను 100 కో. గజాలు పోతే యింక 560 కో. గజాలే మిగలగలదని, ఆ మేరకు యింకా 160 కో. గజాలు అదనంగా ఉత్పత్తి కావాలని అదేపేరా చెప్పింది.

కాబట్టి, చిత్రవిచిత్రమయిన బుటేదారీ, యితర ప్రత్యేకపు టుత్పత్తులకు ఏ 50 వేల మగ్గాలనో తప్ప తక్కిన చేమగ్గాలన్నీ 15, లేక 20 సం॥లో పవర్ మగ్గాలుగా మార్చివేయాలని తన ఆంతర్యమని 90వ పేరాలో వ్రాసింది.

మొదటి ప్రణాళిక 1955 నాటికి ఆశించిన ఉత్పత్తి ప్రమాణము 500 కో. గజాలను మిల్లులు 1953 నాటికే చేసుకున్నాయిగదా! అంటే మిల్లులలో సాలుకు 500 కో. గజాలను ఉత్పత్తి చేస్తుండగా, కేంద్రీకరింపబడి సాకర్యాధిక్యతగల మిల్లులవలె కాకుండా *రెండులక్షల పవర్ మగ్గాలు ఒక షిప్టుమాత్రమే పనిచేసినా 250 కో. గజాలు తయారు చేయగలవుగదా! అప్పుడు 750 కో. గజాలు ఉత్పత్తి అవగలదు. యించుమించుగా విదేశీ ఎగుమతితోసహా 820 కో. గజాలకు ఎగ్రాకించడం అంత కష్టమేమీకాదు. యింక చేనేత పరిశ్రమ

* యివిగూడా రెండు షిఫ్టులు పనిచేసేటట్లయితే 1 లక్ష మగ్గాలే చాలును. అదీగాక దేశంలో 24 వేల పవర్ మగ్గాలు యిదివరకే వున్నాయి.

ఉండవలసిన నిమిత్తమే లేకపోతుంది. మరి సుమారు రెండు కోట్ల చేనేత జనాభా అంతా ఏ గంగలో కలువవలెను ?

అంతేగాక ఈ 2 లక్షల మగ్గాలకు పెట్టుబడి ఎంతో కావాలి. రిపోర్టు 91వ పేరాలో పవర్ మగ్గము 1కి 1500 రూపాయలు కాగలదని వుంది. కాని, యిది సరికాదని తెలుస్తున్నది. ఒక్కొక్క పవర్ మగ్గం రు. 3000 కాగలదు. ఈ లెక్కన కేవలము మగ్గాలకే అరువదికోట్లు కావాలి. ఆ తర్వాత వర్కింగ్ కాపిటల్ వుండనేవుంది. మరి పవర్ మగ్గాలు ఆడగానే చేనేత వానియిల్లు దబదబా పడిపోతుంది. పక్కా బిల్డింగులకు ఎన్ని కోట్లు కావాలో అంచనా వేయాలి.

## రకముల కేటాయింపుగురించి :

ఏ ప్రత్యేక రకాల ఉత్పత్తికయినా చేనేతపరిశ్రమ అత్యంతానుకూలమయిన పరిస్థితిలో వున్న దేమోనని దర్యాప్తు సంఘం ఉన్న పరిస్థితులన్నింటినీ దృష్టిలో పెట్టుకొని అతి జాగ్రత్తగా పరిశీలించారట. ఏవో కొన్ని సందర్భాలలో తప్పితే యిది వీలుపడదని, కొన్ని జిలిబిలినేత అవసరమయిన రకాల ఉదుపులు మినహాయిస్తే మిల్లువస్త్రాలకంటేగానీ, పవర్ మగ్గాలకంటేగాని ఎక్కువ నాణ్యంతో తక్కువవెలకు తయారు చేయగల రకాలు కన్పించలేదన్నారు. చేనేతకు చీరలు, ధోవతులు ఉత్పత్తి కేటాయించాలనే కోరికను త్రోసివేస్తూ (74, 75 పేరాల్లో) పై రీతిని వివరించారు. తుదకు 76వ పేరాలో అలాంటి

కేటాయింపులే జరిగినా కూడా మిల్లులు ఆచరణలో వాటికి ఎగనామం పెట్టించగలవనికూడ ఉన్నసంగతిని బయటపెట్టింది.

నూలుధరమీద సబ్సిడి :

అల్లాగే బట్టలమిల్లులకు లభ్యమయ్యే ధరలకు చేనేతకు నూలు సప్లయిని గురించి (103, 104 పేరాలు)కూడా చర్చిస్తూ రకరకాల కారణములతో దానిని సాధ్యంకాదని ఎగగొట్టింది. అందుకు ఏ విధంగా చేయాలో తోచలేదట. సబ్సిడీ యిచ్చి తోడ్పడాలనేదానికి సాకులు చూపుతూ సున్నచుట్టారు. చేనేత పారిశ్రామికుని కందేలోపున పెక్కు చేతులు మారవలసివున్నం దున అక్రమచర్యలకు దారితీయగలదని అ. భా. చే. బోర్డూ, ప్రభుత్వమూ నిర్ణయించారట. అందుకని గుడ్డల అమ్మకంపై మాత్రం సబ్సిడీ (లేక రిబేటు) యిచ్చి అమ్మకం పెంచదలచా రట. ఈ "గోసాయి చిట్కా" సరిపోతుందేమో! దేశంలో తయారైయే మొత్తం చేనేతగుడ్డ అంతమీద నిరుద్యోగభయం లేనంతకాలం యిస్తారా? ఆవైపు ఆలోచించనేగూడదని వారి మతం.

సూత్రప్రాయంగా మిల్లులకు దొరికేధరకు చేనేతకు నూలు సప్లయి ఆమోదిస్తే అందుకు ఏ పద్ధతిని అనుసరించాలా అనేది యోచించి నిర్ణయించవచ్చును.

అసలు వున్న చేనేతపరిశ్రమకు నూలు సప్లయి, మార్కె టింగు సౌకర్యములు కల్గించి తోడ్పడితే దేశంలో మిల్లుల

ఉత్పత్తి పోగా తక్కిన గుడ్డనంతా చేనేతపరిశ్రమయే సులభంగా తయారుచేసిపెట్టగలదనడంలో ఏలాంటి సందేహం వుండనక్కర లేదు. 1960 కి దేశంలో 720 కో॥ గ॥ ఎగుమతులకు 100 కో॥ గ॥ కలిసి మొత్తము 820 కో. గజాలలో మిల్లుల ఉత్పత్తి 500 కో. గ. పోగా తక్కిన 320 కో. గ. చేనేతయే ఉత్పత్తి చేయ గలదని రూఢిగా చెప్పవచ్చును. దేశంలో 28 లక్షల మగ్గా లున్నాయనేది కొంత అతిశయోక్తి అని మాటవరుస కంగీక రించినా, కమిటీ లెక్కల గారడీచేసి పాదమునుబట్టి చెప్పు లుండాలనేదిపోయి, చెప్పులనుబట్టి పాదముండాలనే హఠంతో చెప్పిన 12 లక్షలనేదికూడా పూర్తిగా సత్యదూరము. కమిటీయే 46వ పేరాలో చెప్పినట్లు 20 లక్షల మగ్గాలేవున్నాయని భావిం చుదాము. ఆ లెక్కనకూడా మగ్గము 1కి 6 గజాలవంతున 300 రోజులకు సంవత్సరంలో 360 కో. గజాల గుడ్డను అవలీల గానే ఉత్పత్తి చేయగలవు. యిందునుగురించి కార్వేకమిటీ నివేదికలో చాల విపులంగా చెప్పినందున ఎక్కువగా మరీమరీ వ్రాయవలసిన పనిలేదు.

## ఆటోమేటిక్ మగ్గాలు

కానుంగోకమిటీ యింతటితోనైనా ఆగలేదు. చేనేత మగ్గాలను పవర్ (అంటే మిల్లు) మగ్గాలుగా మార్చుమని చెప్పిన తానే, అదేమిల్లులలో అంతకంటే అతి ఆధునికమయిన "ఆటోమాటిగ్ మగ్గాలు" అనేవాటిని కూడా ప్రవేశపెట్టవలె నని వ్రాసింది. (121 వ పేరా) ప్రస్తుతం బట్టలమిల్లులలో వున్న

2 లక్షల సాదా మిల్లుమగ్గాలలో సగం మగ్గాలను ఆటో మాటిక్ మగ్గాలుగా (20సంవత్సరాలలో)మార్చి వేయాలన్నది. అప్పటికిగూడా ఈ లక్షమగ్గాలను నేసే 50,000 (2 మగ్గాల కొక్కరుగా) మందిలో 46,000 మంది నిరుద్యోగులవుతారు. కారణమేమంటే 25 ఆటోమేటిక్ మగ్గాలను ఒకే కార్మికుడు నడపగలడుగనుక. కాబట్టి లక్ష ఆటోమాటిక్ మగ్గాలను నేయ డానికి 4000 మంది సరిపోతారు. రిపోర్టులో 16 ఆటోమాటిక్ మగ్గాలకొక నేతగాడు చాలునని ఎంత తగ్గించి వ్రాసివుండినా, ఆ లెక్కనగూడ 6250 మందే చాలును.

ఈ విధంగా చూచుకొంటూపోతే స్వదేశావసరాలకు, ఎగుమతులకు గూడా కలిపి (1960 నాటికి) 820 కోట్ల గజాలు కావలసివున్నదానిని మిల్లుల్లోని 2 లక్షల మగ్గాలూ, కానుంగో గారి సూచనమేరకు (ఒకే షిఫ్టు పనిచేస్తాయనుకొన్నా) 2లక్షల పవర్ మగ్గాలూ కలిసి వస్త్రావసరాలన్నీ తీర్చుతాయి. మరి తక్కిన చేనేత పారిశ్రామికుల గుడ్డను కొనేదెవరు ? లేక వారికి యితర వృత్తులలో చూపే ఉపాధి సౌకర్యాలేమిటి ?

యింత ఆపదనూ నిర్లక్ష్యంచేసి పవర్ మగ్గాలను నెలకొల్పామే అనుకొందాము. అప్పటికయినా వాటికి పోటీలేకుండా వుంటుందా ? ప్రస్తుతం మిల్లుల్లోవున్న మగ్గాలస్థానే ఆటోమాటిక్ మగ్గాలను పెట్టాలని దర్యాప్తు సంఘమే సిఫార్సు చేసింది. ఈ రెంటికీ 'గజ కచ్ఛప వైరం'* వుండనేవుంటుంది.

* గజ = ఏనుగు, కచ్ఛప = తాబేలు,

అప్పుడైనా ఆటోమాటిక్ మగ్గాలకు ఈ పాతమిల్లు మగ్గాలు దాసోహ మనకతప్పుతుందా ? కొత్తమగ్గాలకు తమచోటునిచ్చి పాతమగ్గాలు 'పలాయనమంత్రం' పఠించాలన్నమాటేగదా! ఈ విధంగా సాగితే 'అనవస్థాదోషం' వచ్చేటట్లుంది.

## విదేశాలకోసం అదనపు మిల్లుగుడ్డ.

యిది అట్లుండనిచ్చి ఆటోమాటిక్ మగ్గాలు ఎందుకయ్యా అంటే విదేశాలకు ఎగుమతి చేయడానికై ఉత్పత్తి ఖర్చులు తగ్గి, మరింత నాణ్యంగావుంటే యితర దేశాల పోటీలకు మన ఎగుమతిగుడ్డ పోటీచేయగలదంటున్నారు. [యిటువంటి ఆటోమాటిక్ మగ్గాలను 14600 ను ప్రవేశపెట్టాలని 1956 నూతనవస్త్రవిధానంప్రకారం—ప్రభుత్వం సంకల్పించింది. (ఆటోమాటిక్ మగ్గము 1కి రు. 8000 లు వంతున వీటికి రు. 11,68,00,000 కాగలదు)] కాని 121 వ పేరాను చదివితే కేవలం విదేశాల ఎగుమతులకే వీటిని ప్రవేశపెడుతున్నామనేది నమ్మడానికి వీలులేదని తేలుతుంది.

"...కనుక దుప్పట్లువంటి వట్టి సాదా, ముతక, మధ్య రకం వస్త్రాలను ఆటోమాటిక్ మగ్గాలపైన కనీసం ఎగుమతి అవసరాల మేరకైనా ఉత్పత్తిని అనుమతించడం యుక్తమనీ, ఆటోమాటిక్ మగ్గాలపై తయారు చెయ్యడంవల్ల వస్త్రం నాణ్యంగావుండి విదేశాలలో ఆటోమాటిక్ మగ్గాలపై తయారయ్యే బట్టతో పోటీచేయడానికి అనుకూలంగా వుండగలదని,

కట్టింపుధరకూడా తక్కువే కాగలదని సూచించబడగా, ప్రత్యేకం ఎగుమతులకోసంమాత్రమే వస్త్రాలను ఉత్పత్తిచేయడం సాధ్యం కాదని దర్యాప్తుసంఘానికి తెలియజేయబడింది. విదేశాలలో అయినా వస్త్రాలకు, పరిమాణానికిగల గిరాకీ మారుతూవుండక తప్పదని, అటువంటి పరిస్థితులలో విదేశాలకు ఎగుమతికై తయారుచేసిన వస్త్రాలు స్వదేశంలోను, స్వదేశావసరాలకు మాత్రమే తయారు చేసినవి విదేశాలలోను కూడా అమ్మడం అవసరమవుతూవుంటుందనికూడా దర్యాప్తు సంఘానికి తెలియ జేయబడింది..." (121 వ పేరా)

దీనినిబట్టి కేవలం విదేశీ ఎగుమతుల నిమిత్తమై అటో మాటిక్ మగ్గాలు అనేది సరికాదనీ, వాటివల్ల ఉత్పత్తి ఖర్చులు తగ్గించివేయుటద్వారా అదనపు లాభాలను సంపాదించడమే దాని నిజోద్దేశ్యమని స్పష్టం కాగలదు.

ఈ విధంగా కానుంగోకమిటీ అచ్చంగా మిల్లు యజ మానుల వాదన, వైఖరి, శ్రేయస్సులను మాత్రమే పూర్తిగా ప్రతిబింబించినదని మనకు స్పష్టమవుతుంది.

1954 లోనే బైటపడ్డ కానుంగో కమిటీ సిఫారసులు మీాద 1956 వరకు ప్రభుత్వం ఏ నిర్ణయం చేయక దాచి వుంచింది. చేనేత వికాసానికిగాక వినాశానికి సిఫారసు చేసి, దేశంలో అనేక అభివృద్ధి పథకా లమలుజరుగుతున్నాయి కాబట్టి వీరికీ వృత్తిపోయినా అనేక యితర వృత్తులుండకపోవు అన్నారు. ఈ మాటలు వ్రాసిన కాగితంమీాద సిరాయింకక

మునుపే దేశంలో నిరుద్యోగం సర్వత్రా విజృంభించి జాతీయ సమస్యగా సవాలుచేసింది. దానితో ఈ సిఫారసులకట్ట బహుశా సిగ్గుపడి రెండేళ్లు బుట్టలోనే వుండిపోయింది. దీని సంగతేమిటని పార్లమెంటులో అడిగితే "ఇంకా ఎటూ నిర్ణయించలే"దని మంత్రులు సమాధానం చెప్పేవారు.

తర్వాత చేనేతమగ్గాలను "రిజిష్టరు" చేయించవలసినదిగా ఈ కమిటీ చేసిన సిఫార్సునుగురించి యిక్కడ కాకుండా సందర్భోచితముగా వుంటుందనే కారణంతో "చేమగ్గాల రిజిస్ట్రేషన్" అనే అధ్యాయంలో చర్చించబడింది. అక్కడ చూడ ప్రార్థన.

ఈ రిపోర్టు ననుసరించియే యిండియా ప్రభుత్వం తన "నూతన వస్త్రవిధానము"ను 18-6-1956 న ప్రకటించింది. కాబట్టి "నూతన వస్త్రవిధానము" ఈ రిపోర్టుకు ముద్దుబిడ్డయే.



ఆరవ ప్రకరణం.

# కార్వే కమిటీ నివేదిక.

(సారాంశము)

* నేషనల్ డెవలప్‌మెంటు కౌన్సిలు (జాతీయ అభివృద్ధి సమితి) వారి సూచనమేరకు ప్లానింగు కమీషన్ వారు 28-6-1955 తేదీన "విలేజ్ అండ్ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ (సెకండు ఫైవ్ యియర్సు ప్లాను) కమిటీ"ని [గ్రామీణ మరియు చిన్న తరహా పరిశ్రమల (ద్వితీయ పంచవర్ష ప్రణాళిక) సంఘము"] ఈ దిగువవారితో ఏర్పరచినారు.

శ్రీ ప్రొఫెసర్, డి. జి. కార్వే, కమిటీ అధ్యక్షులు.

శ్రీ ప్రొఫెసర్, డి. ఆర్. గాడ్గిల్. సభ్యులు.

శ్రీ వి. యల్. మెహతా. ,,

(అ. భా. ఖాదీ గ్రామోద్యోగమండలి అధ్యక్షులు. మాజీ బొంబాయి ఆర్థికమంత్రి)

---

* "నేషనల్ డెవలప్‌మెంటు కౌన్సిలు" అనగా భారతదేశంలో అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు సభ్యులుగా, ప్రధానమంత్రి అధ్యక్షుడుగా గల సంఘం. దీనిని ప్లానింగు కమీషన్‌కు సలహా సంఘమని చెప్పినా చెప్పవచ్చు.

శ్రీ పి. గోవిందన్ నాయరు, సభ్యులు

శ్రీ వి. నంజప్ప ,,

(అ. భా. చేనేతబోర్డు అధ్యక్షులు-ఇండియా టెక్స్టైలు కమీషనర్)

శ్రీ డా. డి. కె. మల్‌హోత్రా (కమిటీ కార్యదర్శి)
(ప్లానింగు కమీషన్‌కు డిప్యూటీ కార్యదర్శి)

ఈ కమిటీ విధులు :

ప్రొఫెసర్ మహాలనోబిస్ రచించిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చిత్తు ప్రతి సూచించిన కుటీర పరిశ్రమల విధానమును బట్టియు, ఆ చిత్తు ప్రతి ననుసరించి ఆర్థిక మంత్రిత్వ శాఖలోని ప్యానల్ (క్రమజాపితా) సమర్పించిన మెమోరాండము ఖర్చులను కేటాయించుటకు సిఫార్సులు చేయుట.

- ఈ సందర్భంలో దిగువ మూడుహంశములు దృష్టిలో ఉంచుకోబడును.

1. 1956-61 సం॥ కాలంలో వినియోగవస్తువు (కన్స్యూమర్ గూడ్సు) లలో ఎక్కువ భాగం కుటీర పరిశ్రమలనుండి పొందుట.

2. ఉద్యోగ ఉపాధులు ఈ పరిశ్రమలద్వారా క్రమ క్రమంగా పెరుగవలెను.

3. ఈ వస్తువుల ఉత్పత్తి, పంపకం సాధ్యమయినంతమట్టుకు సహకారపద్ధతులద్వారా జరుగవలెను.

తేదీ 30-9-1955 లోగా నివేదికను సమర్పించవలెను.

రిపోర్టులోని హంశములు.

కుటీర పరిశ్రమల అభివృద్ధికోసరం భారత ప్రభుత్వం యింతవరకు 6 బోర్డులను నియమించి వాటిద్వారా అభివృద్ధి కార్యక్రమాలకు ద్రవ్యమును వెచ్చించుచున్నది.

ఆ ఆరుబోర్డులు యివి :

1. ఆలిండియా ఖాదీ అండ్ విలేజ్ యిండస్ట్రీస్ బోర్డు(కమీషన్) (అ. భా. ఖాదీ మరియు గ్రామోద్యోగ మండలి)
2. ఆలిండియా హేండిక్రాఫ్ట్సు బోర్డు (అ. భా. చేతిపనులబోర్డు)
3. ఆలిండియా స్మాల్ స్కేల్ యిండస్ట్రీస్ బోర్డు (అ. భా. చిన్నతరహా పరిశ్రమల బోర్డు)
4. ఆలిండియా హేండు లూం బోర్డు
5. ఆలిండియా క్వయర్ (కొబ్బరిపీచు) బోర్డు
6. ఆలిండియా సెంట్రల్ శిల్కు (పట్టురేషం) బోర్డు

రెండవ పంచవర్ష ప్రణాళికలో ఈ క్రిందివిధంగా కుటీర పరిశ్రమలకు డబ్బు కేటాయింపబడినది.

1. చేనేతకు (ప్రత్తినూలు) ... ... రు 63 కోట్లు
2. శిల్కు నేతకు ... ... ... రు $1\frac{1}{2}$ కోట్లు

| | | |
|---|---|---|
| 3. ఉన్ని నేతకు ... ... ... | రు | 2 కోట్లు |
| 4. ఖాదీ (ఊలు విభాగం) | | |
| 5. ఖాదీ (ప్రత్తి విభాగం) | | |
| 6. గ్రామీణ పరిశ్రమలు:- దంపుడు బియ్యం, నూనెగానుగలు, చర్మ పరిశ్రమ, అగ్గి పెట్టెలు, యితర చిల్లర పరిశ్రమలు | రు | 48½ కోట్లు |
| 7. హాండిక్రాఫ్ట్స ... ... | రు | 9 కోట్లు |
| 8. స్మాల్‌స్కేల్ యిండస్ట్రీస్ ... | రు | 55 ,, |
| 9. సరికల్చర్ (పట్టు పురుగుల పరిశ్రమ) | రు | 5 ,, |
| 10. కొబ్బరిపీచు పరిశ్రమ (వడుకు, నేత) | రు | 1 ,, |
| 11. పరిపాలన, పరిశోధన తదితరములు | రు | 15 ,, |
| | రు | 200 కోట్లు |

ఇవి రైస్‌మిల్లింగ్ కమిటీ, ఆయిల్ క్రషింగ్ కమిటీల రిపోర్టులు ఈ పాటికి ప్రభుత్వానికి చేరియుండును.

స్టేటు స్మాల్‌స్కేల్ యిండస్ట్రీస్ ఫైనాన్సు కార్పొరేషను (రాష్ట్ర చిన్నతరహా పరిశ్రమల ఆర్థిక సహాయసంస్థ) లు ఏర్పడిన తర్వాత ఆయా పరిశ్రమలకు తగు దోహద మేర్పడునని ఈ కమిటీవారు భావించారు.

ఆంధ్రప్రదేశ్, తదితర రాష్ట్రాలలో యిలాంటి కార్పొరేషనులు ఏర్పడినాయి. తక్కినచోట్ల ఏర్పాటు కావలసివున్నవి.

చిన్నతరహా పరిశ్రమల బోర్డువారు (యిండస్ట్రియల్ ఎస్టేట్సు)ను అక్కడక్కడ నిర్మించుటకు స్కీములు తయారుచేసినారు. దానిని కార్వేకమిటీ అంగీకరించింది. ఆ ప్రకారం సామర్లకోట (తూ॥గో॥జిల్లా) లో ఒక ఎస్టేటును కట్టుచున్నారు. అందులో సిల్కు నేత పరిశ్రమ అభివృద్ధికిగాను శిల్కుదారపు ప్రోసెసింగు మిల్లును స్థాపించబోతున్నారు (అ. భా. చేనేత బోర్డు సహాయంతో)

## కార్వేలోని వివాదాంశం :

వర్తమానంలో కూడా చేరి భవిష్యత్తులో గూడా (అసలు సార్వకాలికముగా కూడా నేమో!) వికేంద్రీకృత ఆర్థికవ్యవస్థ మన ధ్యేయమై యుండాలని ఆయన అభిప్రాయం. టెక్నిక్ (నైపుణ్యత) ఎంత అభివృద్ధి అయినప్పటికీ వికేంద్రీకృత స్వభావం' మాత్రం మారరాదంటాడు. శాస్త్రవేత్తలు ముందు తాము కనిపెట్టే 'నూతన టెక్నిక్ వికేంద్రీకృత పద్ధతులకు అనుగుణ్యమై యుండటానికి వీలుగా తమ శక్తిని పరిమితం చేయాలనికూడా ఈయన భావం.

కమిటీ సిఫార్సులకు ప్రాతిపదికలగు మూలాభిప్రాయములు.

వీరు సిఫార్సులను కొన్ని భాగాలుగా చేశారు. మొదటిది: యిప్పుడున్న భిన్నాభిన్నమయిన కుటీర పరిశ్రమలను దృఢతరం చేయుటకు చెందినది. రెండవది : ఆరీతిగా దారుఢ్యం సంపాదిం

చిన తరవాత భవిష్యత్తులో వికేంద్రీకృత చట్రంలో యిమిడే విధంగా పరిణతి పొందడానికి వీలు కలుగజేయడం. మూడవది: ఏ పరిశ్రమలోనయితే మిల్లు, కుటీర భాగాలు రెండూవున్నవో ఆ పరిశ్రమలో దేశంయొక్క అవసరాలను దృష్టిలో వుంచుకొని ఒకవైపున కుటీర భాగంయొక్క మొత్తం ఉత్పత్తి శక్తినీన్నీ, మరొక వైపున మిల్లు భాగంయొక్క విస్తృతినిగాని, ఆ భాగం లోని ఉత్పత్తి విస్తృతినిగాని క్రమబద్ధం చేయవలెను. ఈచర్యను పూర్తిచేసే లోపున కొంతకాలం సంధిదశగా వుంటుంది. ఆ సంధిలో కుటీర పరిశ్రమల పునరావాసం (దృఢతరంచేయుట) పూర్తిచేయవలెను.

అంటే పునరావాసం పూర్తి అయినప్పటికి, మిల్లు విభాగం విస్తరణకు తొందర పడరాదు. ఆదశలో కుటీరవిభాగం క్రొత్తగా కనిపెట్టబడిన అభివృద్ధి టెక్నిక్, మార్పులద్వారా ఉత్పత్తులనుపెంచి దేశావసరాలను తీర్చగలిగితే మిల్లుభాగం పెంపుదలను మరికొంతకాలం వాయిదా వేయాలి. అనగా కుటీర భాగంద్వారా మనుష్యశక్తిని పూర్తిగా ఉపయోగించి వీలయినంత అధికోత్పత్తిని ఈ కుటీర భాగంనుండి పొంది, దేశావసరాలలో మిగిలిన భాగంమాత్రమే మిల్లు భాగంనుండి పొందవలె నన్నమాట.

కుటీర భాగంలో క్రొత్తగా కనిపెట్టబడిన టెక్నిక్‌తో సహా యింకా సుదృఢంగా పునరావాసం పొందియుండకపోతే అవి ఆదశను పొందేవరకు మిల్లుభాగం విస్తరణను అనుమతించరాదు.

సిఫార్సులలో రెండవభాగం కుటీర భాగంలోని ఆర్థిక, వాణిజ్య, సాంకేతిక, కార్మిక స్వరూపములను అభివృద్ధి చేయడముగురించినది. యిందులో ప్రభుత్వపు చొరవగురించి చెప్పబడింది. సహకార సంస్థల నిర్మాణం, క్రొత్త టెక్నిక్, వాటి శిక్షణ, వ్యాపకం గురించిన చర్యలు.

మూడవ భాగంలో వివిధ పరిశ్రమలలోని ఉత్పత్తి లక్ష్యములను సాధించడానికి తీసికొనవలసిన చర్యలు. అనగా విచక్షణా పూర్వకమయిన ప్రభుత్వ కొనుగోలు విధానము, గ్యారంటీ చేయబడిన మార్కెట్టు పద్ధతి, ధరలలో సదుపాయం చూపుట, సబ్సిడీ, రిబేటు, ఎక్సయిజు (ఉత్పత్తి సుంకము) పన్నులు వీటినిగురించి, వాటిని క్రమబద్ధం చేయుటనుగురించి.

ఈ సబ్సిడీ, రిబేటు మొదలయినవి కొంతకాలానికి రద్దు కావలెనేకాని యిప్పుడున్నవి పెంచాలని కమిటీ ఉద్దేశ్యంకాదు. ఎల్లకాలమూ ఈ సబ్సిడీలు, రిబేట్లు వుండరాదనే దృష్టితో. వీటివల్ల ఈ కుటీరభాగం కొంతకాలానికి యివి లేకుండానే బ్రదుకగల్గి శక్తివంతమై మిల్లు, కుటీరభాగాలు రెండూ సౌఖ్యంగావుండగలిగిన స్థితికి కుటీరభాగాన్ని తయారుచేయాలనే దృష్టితోనే, రిబేటు, సబ్సిడీలు ఈ పరిణామానికి తోడ్పడగలగాలి.

రకాల కేటాయింపులలోగూడా యిప్పుడున్న కేటాయింపులను మించి అధికంగా కేటాయించాలని ఈ కమిటీ అభి

ప్రాయపడలేము. * కేటాయింపులలో ఒకప్పుడు దేశానికి ఉపయోగకరమయినవే మరొకప్పుడు సప్లయి, డిమాండుల దృష్ట్యా అపకారం కావచ్చును.

---

* కేటాయింపులంటే వస్త్ర పరిశ్రమ రంగానికి సంబంధించినంత మట్టుకు 1950 లో ప్రభుత్వం "చేనేతపరిశ్రమ సహాయార్థం"(?) అనే పేరుతో కేటాయించిన రకములని అర్థం. ఆ రకములు క్రింద ఉదహరించబడినవి. యివి చదివితే పూర్తిగా నిష్ప్రయోజనమని బోధపడగలదు.

రకములు :

1. చీరలు :

(అ) $2\frac{1}{2}$ అంగుళముల వెడల్పుకు మించిన అంచులు కలవి.

(ఆ) అంచులలో జరీగాని. లేక బంగారు రంగువేసిన ఆర్టుసిల్కుగాని పెట్టినేసినవి.

(ఇ) నడుమనేతలో రంగునూలు నేసినవి. అనగా రంగుచారలు (గీతలు, గళ్లు, చౌకం గీతలు) గల చీరలు.

2. ధోవతులు :

(అ) $\frac{1}{4}$ అంగుళం వెడల్పు మించిన అంచులు గలవి.

(ఆ) అందులో జరీగాని, మూగా లేక ఆర్టుసిల్కు కలవి.

3. లుంగీలు, సారంగులు, గావంచాలు, గళ్ళడిజైనులతో నేయబడినవి.

4. ఛద్దర్లు, బెడ్‌షీట్లు.

(అ) చారలు, గళ్లుగల ఛద్దర్లు.

(ఆ) కమ్ములుగల బెడ్‌షీట్లు మినహా నిలువులోను, అడ్డంలోను చారలు గలవి.

5. అన్నిరకాల గాజ్, బాండేజ్, జాకొనెట్ గుడ్డలు.

6. టేబిల్‌క్లాతు, నేప్‌కిన్సు (డమాస్కు బ్లీచ్‌డు రకాలు మినహా)

7. బెడ్ కవర్లు, కౌంటర్ ఫేన్లు.
   (అ) అన్నిరకాల బెడ్‌కవర్లు.
   (ఆ) మొత్తం జాకార్డు డిజైన్లు కలవి తప్ప మిగతా అన్నిరకాల కౌంటర్ ఫేన్లు.
8. డస్టర్‌లు అన్నిరకములు.
9. టవల్సు, హానికూం టవల్సు.
10. సాదానేత ముతకబట్ట.
    ( 8 వ నెంబరు అంతకు తక్కువ నెంబరునూలు పడుగుపేకలతో నేయబడిన సాదాగుడ్డ)

నిజానికి ఈ రకాలన్నీ పూర్వంనుండి చేనేత మగ్గాలమీదనే తయారగుచుండినవి. మిల్లులు లాభసాటిగా తయారు చేయడానికి వీలుకాని రకములివి. ఈ కేటాయింపులలో చెప్పుకోదగిన దేదయినావుంటే అది హానికూం టవల్సు మాత్రమే. రకాల కేటాయింపుద్వారా ఏప్రయోజనాన్ని పొందవచ్చుననుకుంటామో అదే ప్రయోజనాన్ని ఉత్పత్తిని క్రమబద్ధం చేయడంద్వారా గూడా పొందవచ్చును.

రిబేటు, సబ్సిడీలకు క్రొత్త స్కీములను ప్రతిపాదించాలని కమిటీ అభిప్రాయ పడలేదు. ఉత్పత్తిసుంకాల (ఎక్సయిజుడ్యూటీ) విధానం సవరించాల్సిన అవసరం వుందనింది.

ఆర్థిక శాస్త్రంలో ఎక్సయిజు డ్యూటీకి మూడు ప్రయోజనాలున్నవని సాధారణంగా చెబుతారు. అవి యివి :– 1 తక్కువ ధరకు నాణ్యమయిన సరుకునుపొందు మిల్లు సరుకు వినియోగదారునుండి కొంతడబ్బును హెచ్చుధరద్వారా ప్రభుత్వమే రాబట్టి ఆడబ్బును అదే పరిశ్రమ అభివృద్ధికి వినియోగించడం. 2 పరిశ్రమలోని పెట్టుబడిదారులకు వచ్చే అదనపు లాభాలను దేశావసరాలకు వినియోగించడం, 3 కుటీర పరిశ్రమలలోని సరుకుల ధరలకు, అటువంటివే అయిన పారిశ్రామిక సరుకుల ధరలకు గల వ్యత్యాసాన్ని తొలగించడానికి వాడటం.

ఈ కేటాయింపు చేనేత పరిశ్రమకు జరిగిన తర్వాత మిల్లులకు వెలుపలనున్న పవరు మగ్గాలవారంతా ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి "చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవైనట్లు..."గా ఈ రకాలను తాము నేయడానికి అధికారం పొందారు. అంతే గాక ప్రభుత్వము ఎంత పాండిత్యాన్ని ప్రదర్శించిందో చూడండి. $\frac{1}{4}$ అంగుళము వెడల్పుకు మించిన అంచుకలవి కేటాయించా మన్నారుగదా! మరి $\frac{1}{4}$ అంగుళంకాని, ఆలోపున కాని వెడల్పు గల అంచుల ధోవతులను మిల్లులు నేయడానికి యిందువల్ల ఆటంక మేమున్నది?

ప్రభుత్వంచేసిన ఈనిర్ణయంతో చేనేత పరిశ్రమకు కలుగ గల ఏకొద్ది అయినా ప్రయోజనమంటూ వుంటే అది మిల్లుల వెలుపలగల పవర్ మగ్గాలవారే తన్నుకుపోయారు.

దరిమిలా ఈ రకాలనే ఎగుమతులకొరకు (అంటే స్వదేశంలో అమ్మకానికికాదు) మిల్లులుగూడా నేసుకొనవచ్చునని ప్రభుత్వం చేసిన ప్రకటనలో ఈ మాత్రపు కేటాయింపుగూడా రద్దయినదని మాటలతో చెప్పకుండానే ఆచరణలో తనకు తానుగా రద్దయిపోయింది.

యిప్పుడున్న ఎక్సయిజు డ్యూటీలను పెంచమని కమిటీ కోరటంలేదు. కుటీర పరిశ్రమలకు యితరత్రా సహాయం చేయుటద్వారా వాటికి పుష్టిని కల్గింపజేసి క్రమంగా మిల్లు విభాగం మీద ఎక్సయిజు డ్యూటీని వేయనవసరంలేని స్థితికి తీసుకొని వెళ్ళడమే తమ అభిమతమని కమిటీ వ్రాసింది.

వినియోగ వస్తువులలో 2 రకములున్నవి. 1 ఎలాస్టిసిటీ (సాగుదల) కల్గినవి. 2 ఎలాస్టిసిటీ లేనివి. సాధారణంగా ఆహారపదార్థముల డిమాండు ఎలాస్టిసిటీ కల్గియుండదు. అనగా ఆదాయం పెరిగిననూ కావలసిన దానికంటె అధికంగా ఎవ్వరూ తినలేరు. అందువల్ల ఎలాస్టిసిటీ లేని రకములలో ఆహారపదార్థములు చేరును. వస్త్రములట్లుకావు. ఈ నాడు రెండు జతల గుడ్డలతో ఎట్లో సరిపెట్టుకొనువాడు ఆదాయం పెరిగినకొద్దీ 20, 50, 100 జతలవరకూ వాడుతాడు. అందుచేత గుడ్డలు ఎలాస్టిసిటీ కల్గిన రకములలో చేరును.

నేషనల్ శాంపిల్ సర్వే నాల్గవరౌండు (దఫా) లో సేకరించిన అంకెలనుబట్టి ఈ కమిటీ ఒక అవగాహనకు వచ్చింది. ప్రస్తుత ఆర్థిక విధానంలోవున్న ధోరణులనుబట్టి అచిరకాలంలో బట్టల డిమాండు అంతగా పెరగగల నిదర్శనంలేదు. *

రెండవ పంచవర్ష ప్రణాళిక అంత్యానికి ఏ మేరకు అదనపు కొనుగోలుశక్తి పెరుగుతుందో అదే మేరకు గుడ్డల విని-

* ఈ సర్వేలోని వివరాలు యివి. నేడు తన ఆదాయంలో 100 కి. 8% బట్టలమీద, 40% ఆహారంమీద ఖర్చు చేయబడుతున్నది. జీవనవ్యయ ప్రమాణం ఏంకొంచెం పెరిగినా దానిని వెంటనే బట్టలు కొనడానికివాడడు. కారణమేమంటే నేడు దేశంలో మూడుపూటల చాలినంత సరైన ఆహారం లభ్యంకావడంలేదు. కాబట్టి జీవనవ్యయ ప్రమాణం పెరుగుటద్వారా కలిగిన అదనపు కొనుగోలు శక్తిని ఆహార లోపమును పూరించుకొనుటకే ముందు ఉపయోగిస్తాడు.

యోగంకూడా పెరుగుతుందనుకోవడం పొరబాటు. అదనపు కొనుగోలు శక్తిని ఆహారలోపమును భర్తీ చేసికొనడానికి వాడుకొని, ఏకొద్ది భాగమో బట్టలు కొనడానికి వాడుతాడు.

1954 లో మిల్లులలో 500 కోట్ల గజాలబట్ట ఉత్పత్తి అయింది. రిజిస్టరైన పవర్ లూమ్సులో 20 కో. గజాలున్నూ, చేనేతలో 130 కో. గజాలున్నూ, మొత్తంగా 650కో.గజాలు ఉత్పత్తి అయింది. అదే సంవత్సరంలో యింనులో 86 కో. గజాలు ఎగుమతి కాబడింది. తక్కిన 564 కో. గజాలబట్ట దేశంలో వాడకానికి విడుదల చేశారు. (1955-56 లో మొత్తం బట్టల ఉత్పత్తి 675 కో. గజాలు)

1955-56 లో చేనేతగుడ్డ 155 కో. గజాలు ఉత్పత్తి కాగలదని అంచనా వేశారు. ఆసంవత్సరం ఎగుమతులు 80 కోట్ల గజాలు మాత్రమే యుంటుందని కూడా అంచనా వేశారు. 1955-56 లో దేశంలో వాడకానికి విడుదల అయినగుడ్డ 595 కోట్ల గజాలనుకోవచ్చును. రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) కాలంలో 20% గుడ్డ వినియోగం పెరుగుతుందను కొంటే 1960-61 నాటికి 715 కో. గజాలు దేశంలో వాడకా నికి కావాలని అర్థం. ఎగుమతులు కూడా 100 కో. గజాలు కాగలదనుకొంటే మొత్తంగా 815 కో. గజాలు ఉత్పత్తి కావాలి.

అనగా 1955-56 ఉత్పత్తిమీద అదనంగా 1960-61 నాటికి 140 కో. గజాలు అదనపు టుత్పత్తి అవసరమన్నమాట (20% గుడ్డ అదనపు డిమాండు పెరిగే లెక్కన)

యింతేగాక ఈ కమిటీ ఔదార్యంగా రెండవ ప్రణాళికా కాలంలో గుడ్డల డిమాండు 25% కూడా పెరుగుతుందని అంచనా వేశారు. అప్పుడు 1960–61 నాటికి 815 కో. గజాల ఉత్పత్తికి బదులు 845 కో. గజాలు కావాలన్నమాట. అనగా 1960–61 నాటికి అదనపు టుత్పత్తి 140 కో. గజాలు కాక 170 కోట్లు కావాల్సి వుంటుంది. ఈ 170 కో. గజాల అదనపు టుత్పత్తికంటే మించిన లక్ష్యం మన ప్రోగ్రాములో పెట్టుకో నక్కర లేదు.

కొందరు తమ బట్టను తామే ఉత్పత్తి చేసికొనవచ్చును. ఉదాహరణకు అస్సాంలోని ఆఖార సాంప్రదాయాలను బట్టి తమ గుడ్డను తామే నేసుకొంటూరు. అట్లాగే ఖాదీ స్కీమువల్ల కూడా, యిలాంటివి అంతగా లెక్కించవలసినవిగావు కనుక వీటని త్రోసి వేయవచ్చును.

ఈ అదనపు 170 కో. గజాలూ ఒక్క చేనేత పరిశ్రమను విస్తృతంచేస్తే యివ్వగలదా అని విచారింతాము. ఏమనగా నిరుద్యోగ నివారణకు యింతకన్నా వేరు మంచి ఉపాయము, అవకాశము లేదుగనుక. వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ అనే లక్ష్యమునకు యిది అనుకూలంగా వుంటూ అందులో యిముడగలదు కనుకనూ.

1951 లో రాష్ట్రప్రభుత్వములు సప్లయిచేసిన అంకెలనుబట్టి దేశంలో 28 లక్షల 70 వేల చేమగ్గాలున్నవి.

యిందులో రెండు లక్షలు శిల్కవి, 80 వేలు ఉన్నవి, అస్సాం, త్రిపుర రాష్ట్రాలలో స్వోపయోగార్థం బట్టలను నేసుకొనే మగ్గాలు 5 లక్షలున్నా, తక్కినవి ప్రత్తినూలు మగ్గాలున్నాను. కానుంగో కమిటీ వారి శాంపిల్ సర్వే (నమూనా కొలత) ప్రకారము 4 లక్షల మగ్గాలు పనిచేయకుండా మూలబడి వున్న వని వారు అంచనా వేశారు. అందువల్ల మిల్లు పరిశ్రమ ఉత్పత్తిని 500 కో. గజాలకు మించరాదని, కమిటీ సూచించింది. 1961 నాటికి సౌకర్యాలన్నీ కల్గించి పరిపుష్టినిస్తే చేనేతపరిశ్రమ 320 కో. గజాల ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకోగలదని కమిటీ భావించింది.

అ. భా. చే. బోర్డువారు 14 లక్షల మగ్గాలను సహకార రంగంలోనికి తీసుకురాగలమన్నారు. తద్వారా పనిలేకుండా పడివున్న 2 లక్షల మగ్గములు పునరావాసం పొందుతాయన్నారు. ఈనాడు దేశం మొత్తంపై (1954–55 నాటికి) సహకార సంస్థలలోగల $8\frac{1}{2}$ లక్షల మగ్గాలు 1955–56 నాటికి 10 లక్షలు కాగలవని ఆశించారు.

అ. భా. చే. బోర్డుయొక్క మొత్తం స్కీములు. రు. 130 కోట్లు కాగా ప్లానింగు కమీషన్‌వారు రు $66\frac{1}{2}$ కోట్లు మాత్రం యిస్తామన్నారు. (రెండవ ప్రణాళికా కాలానికి) కనుక పై లక్ష్యములు సవరణ కావలసియున్నవి.

1961 నాటికి సహకార రంగంలోని ప్రతి మగ్గానికి (సుమారు 14 లక్షలు) * టేక్ ఆఫ్ మోషన్ పద్ధతిని కలిగి ప్రతీమగ్గం ఫ్లయ్‌షటిల్ మగ్గం (కుచ్చులాగే మగ్గం)గా కూడా తప్పనిసరిగా అయియుండాలి. త్రోషటిల్ (నాడిసివిసిరేచేమగ్గం) ను ఫ్లయ్‌షటిల్ మగ్గంగా మార్చడానికి ప్రభుత్వమే ఫ్లయ్ షటిల్ మగ్గం యివ్వాలన్నారు. అలాగే టేక్ ఆఫ్ మోషన్‌ను కూడా అన్ని మగ్గాలకూ యివ్వాలన్నారు.

## ఉత్పత్తి కార్యక్రమం,

1961 నాటికి 20 లక్షల మగ్గాలు రోజుకు 6 గజాలు చొప్పున సాలుకు 300 రోజులు పనిచేస్తే సాలుకు 360 కోట్ల గజాల గుడ్డ తయారు కాగలదు.

## నూ లు.

5 సం॥ కార్యక్రమానికి అదనముగా 37 కోట్ల 50 లక్షల పౌనుల నూలు చేనేతకు కావలసివుంటుంది. (బేలు 400 పౌనులు వంతున 9,37,500 బేళ్ళు)

1957-58 నాటికి చేనేతకు అదనంగా నూలు ఎంత కావలయునో అంతయున్నూ యిప్పటికే కొన్ని క్రొత్తకదుళ్ళకు లైసెన్సు యిచ్చినారు గనుక వాటిసహాయంతో అవసరాలను సరిపుచ్చవచ్చును.

---

* "టేక్ఆఫ్ మోషన్ అటాచిమెంటు" అనగా అంగుళం నేతలో ఎన్ని పేకపోగులు వుండాలనుకొంటామో దానికి ఒక్క పోగుగూడ హెచ్చుతగ్గు లేకుండా సమానంగా వచ్చేవిధంగా చేయుసాధనలు.

నూలు వడికే సాధనాలుగా గుప్త, కాలే, అంబర్ అనే మూడు రకాల చరఖాలు తయారుకాబడి అ. భా. సర్వసేవా సంఘం, అ. భా. ఖాదీ మరియు గ్రామోద్యోగ బోర్డువారు పరిశీలనలు చేస్తున్నారు. (1955 నాటికి) యింకా అవి పూర్తి కాలేదు. యిప్పుడే పరిశీలనలు చురుకుగా తీవ్రంగా కొనసాగించవలెను. అంతేగాక, నేడు నూలు అవసరం ఒత్తిడి వుంది గదా అని ఈ పరిశీలనలను నిరుత్సాహ పరచరాదు. ప్రత్యామ్నాయ పద్ధతులు త్రొక్కడం సమంజసంకాదు.

ఒకచోట చెప్పినట్లుగా 1957 డిశంబరు వరకు కావలసిన నూలంతా సప్లయి అవుతుందిగదా! సాధారణంగా కదుళ్ళకు లైసెన్సు యిచ్చిన తేదీనుండి 18 నెలల లోపున వాటిని అమర్చడం, వాటితో పనిప్రారంభంకావడం జరుగుతుంది. ఈ 18 నెలల వ్యవధివల్ల మనకు 1956 మే నెలవరకు నూలు యిబ్బంది లేకుండానే క్రొత్త చరఖాల పరిశీలనలో నిమగ్నమై యుండగలము. అంతవరకు మిల్లులలో క్రొత్త కదుళ్ళకు లైసెన్సు యివ్వకుండా నిదానించడమే మంచిది.

ఒకవేళ 1956 మే తర్వాత పరిస్థితులను సమీక్షించుకొని, క్రొత్త కదుళ్ళకు లైసెన్సు లివ్వడం అవసరమనితోస్తే వాటిని ప్రభుత్వ రంగంలోగాని, సహకార రంగంలోగాని మిల్లులు పెట్టుకోడానికి అదివరకు మిల్లులులేని ప్రాంతాలలో మిల్లులు స్థాపించడానికి లైసెన్సు యివ్వవలసివుంటుంది.

ఈ విధంగా ఏల చెప్పామంటే అంబర్ చరఖాతో సాగించే పరిశోధనలు నిష్ఫలమని తుట్టతుదకు ఋజువుచేసే సావకాశంకూడా వుండవచ్చుననే వూహతో కమిటీ ఈ సిఫా ర్సులు చేసింది. *

1956–57 లో చీరలు ధోవతులకు ఎంత డిమాండు వుండునో దానిమీద ఆ రెండురకములకు ప్రత్యేకముగా 1960–61 నాటికి అదనంగా 50 కో. గజాలు కావలసివుంటుంది. అనగా 1960–61 నాటికి చీరలు ధోవతులు మాత్రమే 200కో. గజాలు కావలసి వుంటుందని అంచనా. ఈ రెండు రకములలోను యిప్ప టికే కొంతవరకు చేనేతకు కేటాయింపబడియున్నది. (అంటే

* శ్రీ యస్. యస్. ఖేరా అధ్యక్షులుగా నియమించబడిన "అంబర్ చరఖా కమిటీ" సూచనలను ఆమోదించినట్లుగా భారత ప్రభుత్వము దరి మిలా తేదీ 21–6–56 న అధికార పూర్వకంగా ప్రకటన చేసింది. 1956-57 లో 75 వేల చరఖాలను ప్రవేశపెట్టాలనీ, ఆ ప్రయోగఫలితాన్ని చూచి తర్వాత రెండు సంవత్సరాలలో ఎన్ని చరఖాలు ప్రవేశ పెట్టాలో నిర్ణయించాలనీ, 1957-58 లో 2 లక్షలు ప్రవేశ పెట్టనగుననీ ఈ కమిటీ సూచించింది. అంతేగాక ఖాదీ వస్త్రాలను, అ. భా. ఖాదీ బోర్డు ధృవ పరచాలనే (సర్టిఫై) పద్ధతిని క్రమేణా తొలగించి, అదిగూడా మామూలు వికేంద్రీకృత గ్రామీణ పరిశ్రమవంటిదే నన్నదృష్టితో వ్యవహరించాలన్న కమిటీ సూచనను ప్రభుత్వం ఆమోదించడంతో యింతవరకు కేవలం అభి మానంతో ఖాదీకి కల్పిస్తూవచ్చిన ప్రత్యేక ప్రతిపత్తి క్రమేణా అంతరించి పోగలదు. యికముందు కేవలం ఆర్థికదృష్టితో మాత్రమే దాని బాగోగులు పరిశీలింపబడగలవు.

1950 లో చేనేతకు కేటాయించిన రకములను కమిటీ స్మరించుచున్నది—రచయిత) ఈ కేటాయింపు కొంతకాలం కొనసాగించితే అదనపు అవసరాలు అదనపు చేనేత ఉత్పత్తులనుండి పొందవచ్చును. యిప్పుడున్నరకాల కేటాయింపు విధానాన్ని కొనసాగిస్తూ మిల్లు ఉత్పత్తిని 500 కో. గజాలకు పరిమితంచేస్తే ఈరెండు చర్యలవల్ల చేనేత, మిల్లు ఈరెండు శాఖలు పరస్పర సమన్వయం క్రమంగా పొందగలవని కమిటీ అభిప్రాయము.

## రి బే టు.

ప్రస్తుతం కో. ఆ. సొసైటీల ఉత్పత్తులపైననే రిబేటు యిస్తున్నారు. కొన్ని రాష్ట్రాల్లో "చౌకధరల డిపో"లకు వచ్చిన సహకారేతర చేనేత గుడ్డపైగూడా యిస్తున్నారు. మిల్లు గుడ్డపై గజానికి 0-0-3 వంతున వేయబడిన సెస్సుఫండునుండి దీన్ని యిస్తున్నారు. సర్టిఫైడు (అ. భా. ఖాదీబోర్డు ధృవపరచిన) ఖద్దరుపైనగూడ 1-0-0 కి 0-3-0 చొప్పున రిబేటు యిస్తున్నారు.

రిబేటు పంపకానికి ఏర్పరచినపద్ధతి ప్రస్తుతం చాలా చిక్కులతో కూడుకొనివుంది. ఒకవేళ చేనేతగుడ్డను, ఖాదీ గుడ్డను ప్రభుత్వమే గ్యారంటీగా కొనివేసి కో-ఆపరేటివులు మొదలగు ఉచితమగు శాఖలద్వారా దాని పంపకానికి ఏర్పాటు చేయవచ్చునేమో ప్రత్యేకంగా పరిశీలించమని ఈ కమిటీ సలహా యిచ్చింది.

ఆయాకాలపరిస్థితులనుబట్టి ప్రాంతీయ ప్రాతిపదికమీద ప్రభుత్వం కొన్ని చేనేత రకములకు కనీసధరలను నిర్ణయించి సరుకును కొనేటట్లు చేయవచ్చును.

అమ్మకపు విధానం, నియమాలు, ధరలు ప్రభుత్వమే నిర్ణయించి సహకార సంస్థలు, మొదలయిన సంస్థలద్వారా అమ్మించి, అసాధారణ పరిస్థితులలో నష్టంవస్తే ముదరా యివ్వవచ్చును. యిట్టి యేర్పాటువల్ల బ్రహ్మాండమయిన నిర్మాణ సమస్యలు ప్రభుత్వాన్ని ఎదుర్కొంటాయి గనక మొదట ప్రయోగప్రాయముగ కొన్ని రకములకు మాత్రము కొన్ని కేంద్రాలలో ప్రారంభించాలి.

చేనేత అభివృద్ధి పథకాలకు రెండవ ప్రణాళికలో పబ్లికు రంగానికి కేటాయించిన నిధులనుండి రు. 80 కోట్లు తీయవలెనని గ్రామీణ మరియు చిన్నతరహా పరిశ్రమల బోర్డువారు సూచించిరి. *

యిందులో రు. 19 కోట్లు పనిముట్లు, పెట్టుబడి వగయిరాల అభివృద్ధికీ, రు. 17 కోట్లు వర్కింగు కాపిటలుకూ,

* అ. భా. చే బోర్డువారు రు. 130 కోట్లకు అభివృద్ధి పథకాలను సూచించగా, వాటిని గ్రామీణ మరియు చిన్నతరహా పరిశ్రమల బోర్డువారు రు. 80 కోట్లకు కుదించినారు. మరీ పీటికి పార్లమెంటులో సమర్పించిన పాఠమునందు రు. 63 కోట్లు మాత్రమే కేటాయించబడెను. శ్రీ కార్వేగారు ఈ నివేదికవ్రాసే సమయానికి తుదినిర్ణయం జరగలేదు గనక ఆయన రు. 80 కోట్ల అంకెనే ఉదహరించెను.

రు. $42\frac{1}{2}$ కోట్లు మార్కెటింగ్, సబ్సిడీ వగయిరాలకూ, రు. $1\frac{1}{2}$ కోటి నిర్మాణము, ప్రచారము, పరిపాలనా వగయిరాల నిమిత్తము కేటాయింపబడెను. (యిందులో ఖాదీ చేర్చబడ లేదు) ఈ రు. 80 కోట్లలోను నిర్మాణము, ప్రచారముమీాద నేరుగా రు. $1\frac{1}{2}$ కోటి కేంద్రప్రభుత్వమే ఖర్చుపెడుతుంది. తక్కిన రు. $78\frac{1}{2}$ కోట్లు రాష్ట్ర ప్రభుత్వములకు పంచబడును.

1952 లో ఏ రాష్ట్రములకు ఎంతనూలు సప్లయి (చేనేతకొరకై) చేయబడినదో దానిని ప్రాతిపదికగా తీసికొని ఈ మొత్తములను కేటాయించాలని కమిటీ సూచన.

వికేంద్రీకృత పరిశ్రమలో పారిశ్రామికుని గృహసమస్యకు ఒక ప్రత్యేక ప్రాధాన్యముంది. వచ్చే క్రొత్త క్రొత్త పరికరా లకు అనుకూలంగాను, అవసరమయినప్పుడు విద్యుచ్ఛక్తి వాడ కానికి అనుకూలంగాను గృహనిర్మాణం చేసుకోవాలి.

ఈ రు. 80 కోట్ల విలువగల పథకాలను అమలు జరిపితే సంవత్సరంలో-ప్రస్తుతం-కొంతభాగం మాత్రమే పని కలిగిన 25 లక్షలమంది చేనేతవారికి సంవత్సరం పొడవునా (సంవత్స రానికి 300 రోజుల లెక్కన) పని వుంటుందని అంచనా వేయ బడింది. అందుచేత గణితంలో $12\frac{1}{2}$ లక్షల మందికి పూర్తిపని కలుగుతుందని లెక్క వేయవచ్చును. దీనివల్ల చేనేత రంగంలో 170 కో. గజాల గుడ్డవరకు ఉత్పత్తి కాగలదు.

## నిర్మాణరంగంలో సిఫార్సులు.

మొదట చెప్పిన ఆరుబోర్డులనూ అజమాయిషీ చేయటకు కేంద్రంలో ఒక ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పరచవలెను. ఆయనకు కాబినెట్ సభ్యత్వం వుండాలి. భారీ పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు సమన్వయముగా పరిస్థితులను విచారించడానికి ఒక కాబినెట్ కమిటీ ఏర్పాటు కావలెను.

ఈ కుటీర పరిశ్రమలను, సహకార శాఖను రెండింటినీ కలిపి ఒకే మంత్రిక్రింద, ఒకే శెక్రటరీక్రింద వుండేటట్లు రాష్ట్రములలోగూడా ఏర్పాటు కావలెను.

ప్రతి జిల్లాలోను ఈ బోర్డుల కార్యక్రమాన్ని అమలు జరపడానికి కనీసం ఒక హోల్ టైమ్ ఆఫీసర్‌ను వేయవలెను.

## కార్వేకమిటీ రిపోర్టు (మినిట్ ఆఫ్ డిస్సెంటు.)

(సారాంశము)

వివరణ :—

యింతవరకు కార్వేకమిటీ నివేదిక సారాంశం చూచాము. ఈ కమిటీ సభ్యులైన శ్రీ వి. నంజప్ప (ఇండియా టెక్స్టైలు కమీషనర్), శ్రీ పి. గోవిందర్ నాయకుగార్ల భిన్నాభిప్రాయమును సూచించు మినిట్ ఆఫ్ డిస్సెంటుయొక్క సారాంశము క్రింద వ్రాయబడెను. వీరి వాదన లేమనగా,

యిదివరకు మాంద్యపు నెలల్లో అమ్మేదానికంటే ఈ సంవత్సరం (1955) మాంద్యపు నెలల్లో మార్కెట్టులో గుడ్డనిలువ తక్కువగానుండి ఎక్కువగా ఖర్చయింది. యిదివరకు వర్షాకా

లంలో ధరలు పడిపోయేవి. ఈ యేడు (1955) పడిపోలేదు. సహకార సంఘాలలో యిదివరకటికన్నా గుడ్డ విడుదల హెచ్చింది. కావున, సప్లయికంటే డిమాండు పెరిగిపోయేరోజు దగ్గర్లోనేవుంది.

జాతీయాదాయము 100 కి 25% మాత్రమే పెరుగుతుందని (రెండవ ప్రణాళికాంత్యకాలానికి) అంచనా వేసినప్పటికీ అదే కాలంలో ఆరోగ్యం, విద్య, ప్రాజెక్టులపై ఎక్కువ ఖర్చుపెట్టి, మద్యనిషేధమును గూడా విస్తరింపజేయడంవల్ల గుడ్డను కొనేశక్తి జనసామాన్యానికి అదనంగా కలుగుతుంది. * కార్వేగారు చెప్పినట్లు తల 1కి 18 గజాలగుడ్డ 1961 నాటికి సరిపోదు. తల 1కి 20 గజాలయినా అవసరం కాగలదని పథకం తయారు చేయవలెను. కనీసము 1955-56 ఉత్పత్తి (అన్ని రంగాలలోను మొత్తం ఉత్పత్తి 675 కో. గ) కన్నా 200 కోట్ల గజాలయినా అదనపు ఉత్పత్తి అవసరము. నూలు అవసరములు, కదుళ్ళ అవసరములు ఈ ప్రాతిపదికపై అంచనా కట్టవలెను. కనుక అదనపు కదుళ్ళకు యింకా లైసెన్సులివ్వడం న్యాయమేనని వీరి అభిప్రాయము.

---

* మద్యనిషేధంవల్ల వృత్తులుపోయి నిరుద్యోగులయినవారికి ఎటువంటి ఉద్యోగ ఉపాధులూలేవు. యింక వ్యవసాయం యిప్పటికే క్రిక్కిరిసి వున్నందున దానిలో అదనపు ప్రవేశం తగదని ప్రణాళికలోవుంది. అందుచేత చేనేతలోనికి క్రొత్తవారి ప్రవేశం హర్షణీయమేనని ప్రణాళికాకర్త శ్రీ మహాలనోబిస్ ఆంతర్యంగా తోస్తున్నది. యిందుకు వ్యతిరేకంగా పైయిద్దరు అభిప్రాయము కల్గియున్నారు.

అనేక బట్టల మిల్లులకు తగినన్ని మగ్గములు పెట్టుకొనుటకు లైసెన్సు యివ్వకపోవడంవల్ల వారి వ్యాపారం లాభించడం లేదు. వారికి ముందుగా పవర్ మగ్గాలను సప్లయి చేయవలయును. ఎంత శ్రమపడినను చేమగ్గాలపై 1960-61 నాటికి 250 కో. గజాలకన్నా ఎక్కువ తయారుచేయలేము. కార్వేగారాశించిన 300 కో. గ. ఉత్పత్తి జరుగుతుందనే ఆశ మాకు లేదు. కనుక 50 కో. గ. అదనపు ఉత్పత్తికి మిల్లులకు అవకాశం యివ్వవలెను. మిగతాది పవర్ మగ్గాలకు (అనగా 20 కో. గ.) యివ్వవలెను.

అంతేగాక చేనేతవారిని క్రమబద్ధంగా పవర్ మగ్గాల వైపుకు మళ్ళించే కార్యక్రమం ఈనాడే ప్రారంభించవచ్చునని కూడా వీరభిప్రాయపడినారు.

ప్రస్తుతము 4 లక్షల చేమగ్గాలు మూలపడివున్నవి. గనుక వాటిని పనిలోనికి తెచ్చి 1960-61 నాటికి 170 కో. గ. బట్ట అధికోత్పత్తి చేయాలని కార్వేగారు అంచనా వేశారు. చేనేతరంగంలో యింత అధికోత్పత్తి జరగడం సంశయాస్పదము. ఒకవేళ జరిగినా యితర వృత్తులవారు యిందులో చేరితేనే జరగగలదు. ఈ అల్పాదాయ రంగంలోనికి క్రొత్తజనాన్ని రానివ్వడం దేశానికి శ్రేయస్కరంకాదు.

కనుక క్రొత్త వృత్తుల వారిందులో ప్రవేశించడానికి వీలులేని పద్ధతులలోను, ఉన్న వారికి పూర్తి పని కలిగే పద్ధతులలోనూ మేమాలోచించుతున్నాము.

పవర్ మగ్గములు ప్రవేశపెట్టినప్పటికీ వాటిని వికేంద్రీకరణ పద్ధతులలోనే నడపవలెను. ప్రయోగప్రాయంగా 25 వేల మగ్గములు త్వరలో స్థాపించి వాటిపనిని సమీక్షించుకొని అవసరమయితే ముందుకు పోవచ్చును. ఈ 25 వేల పవర్ మగ్గాలు 1 లక్ష చేమగ్గాలకు సమానము. అసలు చేమగ్గాలు లెక్కల మేరకు ఉన్నవా లేవా అనే అనుమానంతో బాధపడుతున్న వాటినుండి, లేక ఒకప్పుడు వుండినప్పటికీ చాలకాలమునుండి మూలబడిపోయిన వాటినుండి ఈ లక్ష మగ్గములు సరిపుచ్చవచ్చును అని వీరి అభిప్రాయం.

మరొక ముఖ్య విషయమేమనగా యిప్పటి చేనేత పారిశ్రామికుని పవర్ మగ్గం పారిశ్రామికునిగా మార్చి అతని ఆదాయాన్ని ఈ విధంగా పెంచకపోతే చిన్న పెట్టుబడిదారులు అనేకులు పవర్ మగ్గాల కార్ఖానాలతో వస్త్రరంగంలో ప్రవేశించగలరు. ప్రభుత్వం ఎన్ని నిర్బంధాలు పెట్టినా ఈ పరిణామం తప్పదు.

## నంజప్ప, గోవిందన్ నాయర్ల అభిప్రాయాలపై విమర్శ.

వీరి వాదనలలో 2 హంశములున్నవి. కార్వేగారు అనుకొన్న 360 కో. గ. లక్ష్యమును చేనేతలో సాధించడం సాధ్యం కాదనేది మొదటిది. శ్రీ నంజప్పగారికి నిజంగానే ఈ విషయంలో అనుమానముండియుండవచ్చును. సౌకర్యాలు కల్గించితే ఈ ఉత్పత్తిని చేనేతలోనే ఎలా సాధించవచ్చునో కార్వేగారే

చెప్పినారు గనుక మరీ దానిని గురించి పునశ్చరణ చేయనవ సరంలేదు. మగ్గాలు దేశంలో వెనుక రాష్ట్రప్రభుత్వాలు యిచ్చిన లెక్కలమేరకు 28 లక్షల 70 వేలు లేవనే అను కొందాము. మాటవరసకు పై 8 లక్షల 70 వేలు తీసివేసినా ఖచ్చితంగా 20 లక్షల మగ్గాలే వున్నాయనుకొన్నప్పటికీ కూడా మగ్గం ఒకటికి రోజుకు 6 గజాలుచొంతుల ఉత్పత్తి అయితే ఒక్క రోజుకు 1 కోటి 20 లక్షల గజాల గుడ్డ తయారవుతుంది. ఆ విధంగా ఏడాదికి 60 రోజులు శెలవులు తీసివేసి 300 రోజు లకు 360 కో.గ. గుడ్డ అవలీలగా చేనేత పరిశ్రమ యివ్వగలదు. నూలుసప్లయి, మార్కెటింగు సౌకర్యాలు, తదితర సహాయ ములు చేస్తే ఈ ఉత్పత్తి లక్ష్యం సుసాధ్యమేననేది స్పష్టము.

రెండో విషయం విస్తారంగా నేవుంది. ఈ అల్పాదాయ రంగాలలో అధికోత్పత్తి లక్ష్యంచేరిస్తే యితర వృత్తులవారు జొరబడే 'ప్రమాదం' వుందిగనుక దాన్ని నిరోధించవలెననేది. యింతకంటె అల్పాదాయం యితరత్రా వున్నప్పుడే యిందు లోకి వస్తారు. అల్పాదాయంగల వృత్తులను నశింపజేయదలచి ప్రారంభిస్తే ఆ యితర వృత్తులనుండే మొదట ప్రారంభించ వలెను గాని కాస్త అధికాదాయం వచ్చే చేనేతనుండే నశింపు జేయుడం ఏల మొదలు కావాలి? చేనేత పరిశ్రమ కాస్త పచ్చ పచ్చగా వుంటే క్రొత్తక్రొత్త వారుకూడా చేరితే దానివల్ల యితరత్రాగల నిరుద్యోగం నివారణ అవుతుందిగదా! అది

కూడా ఒక మేలేనే! నూలుసప్లయిని తగ్గించివేసి అల్పాదాయంగల చేనేతను త్వరగా మాడ్చివేయుమని మిల్లుయజమానులు చాలకాలంనుండి చెప్పుచున్నారు. నిరుద్యోగ నివారణకు కుటీర పరిశ్రమలు ప్రధాన రంగాలని శ్రీ మహాలనోబిస్ అభిప్రాయపడుతుంటే బట్టలమిల్లుల, నూలుమిల్లుల యజమానుల కోర్కెలు సంజప్పగారి అభిప్రాయాలలో ప్రతిధ్వనిస్తున్నవి.



# ఏడవ ప్రకరణం.

# నూతన వస్త్రవిధానము ( 1956 ) *

(సారాంశం)

18-8-1956 తేదీని ఆనాటి పరిశ్రమలు, వాణిజ్యమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు ఢిల్లీలో పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రభుత్వవు నూతన వస్త్రవిధానమును ప్రకటించారు.

---

* ఈ సమాచారం పాఠకులకు చాలా ఉపయోగించుతుందనే అభిప్రాయంతో దీన్ని యిక్కడ యిస్తున్నాము.

## సమాచారం.

1-1-1954 తేదీనాటికి దేశంలో 400 ప్రత్తి బట్టలమిల్లులున్నాయి. వీటిలో 114 కేవలం నూలువడుకుమిల్లులు. 286 నూలువడుకు, బట్టనేత మరియు పెక్కు సందర్భాలలో ఫినిషింగ్ కూడా చేసేమిల్లులు (కాంపోజిట్ మిల్లులని వీటికి పేరు). వీటిలో కదుళ్ళసంఖ్య 1,16,19,000 ఇందులో 1,85,000 కదుళ్లు పని చేయడమేలేదు. పనిచేస్తున్న కదుళ్ళసంఖ్య 1,14,34,000. వీటిలో కాంపోజిట్ మిల్లులలో వున్నవి 95,06,000. నూలువడుకు మిల్లులలోనివి 19,28,000. పైన పేర్కొన తేదీనాటికి దేశంలోవున్న మగ్గాల సంఖ్య 2,01,718. వీటిలో పనిచేస్తున్నవి. 1,97,000 (అంటే పనిచెయ్యనివి 4,718 అన్నమాట).

—(కానుంగో కమిటీ రిపోర్టు 14 వ పేరా)

"విదేశీ ద్రవ్యమారకాన్ని సంపాదించిపెట్టడంలో జూట్ (జనపనార), టీ (తేయాకు), బట్టలు మొదలయిన వాటిలో బట్టలు అగ్రస్థానం వహిస్తున్నవి. విదేశద్రవ్య మారకం సంపాదించడంలో మాత్రమే గాకుండా దేశ ఆంతరంగిక ఆర్థికవిధానంలో గూడ బట్టల పరిశ్రమ అతి ప్రముఖస్థానం వహిస్తున్నది. అందువలన దీర్ఘంగా ఆలోచించి అధికప్రజలకు ఉద్యోగ ఉపాధుల (అవకాశముల) ను కల్పించే హంశమును గూడ దృష్టిలో వుంచుకొని ఈ విధానం నిర్ణయించబడింది" అన్నారు.

సంవత్సరము 1కి తల 1కి 18½ గజాలగుడ్డ రెండవ పంచవర్ష ప్రణాళికాంత్యం (1960–61) నాటికి అవసరం కాగలదనిన్నీ, విదేశాలకు ఎగుమతి కోసం 100 కోట్ల గజాల గుడ్డ కావలసివుంటుందనిన్నీ లెక్క వేయబడింది. కాని, గుడ్డల విడుదల ధోరణి మరొక సంవత్సరం పోయినతర్వాత మరల పరిశీలింపబడును.

ఈనాడు మిల్లులలోను, చేనేతమగ్గాలమీదనూ, పవర్ మగ్గాలమీదను మొత్తం వస్త్ర నిర్మాణ రంగంలో సాలుకు 670 కోట్ల గజములగుడ్డ ఉత్పత్తి అవుతున్నది. పైన చెప్పిన విధంగా 1960–61 నాటికి ఈ ఉత్పత్తి 840 కోట్ల గజములకు పెరగవలెను. అనగా, నేటి ఉత్పత్తిమీద 170 కోట్ల గజముల గుడ్డ అదనంగా నేయవలెను.

## ఉత్పత్తి కేటాయింపులు.

(కోట్ల గజములలో)

| శాఖలు | కేటాయింపులు (సాలుకు) | ప్రస్తుత ఉత్పత్తి (సాలుకు) | మొత్తం (సాలుకు) |
|---|---|---|---|
| 1. మిల్లులు:— (i) అదనంగా 14600 ఆటోమాటిక్ మగ్గాలను అమర్చి ఈ ఉత్పత్తి చేయబడును. (ii) ఈ ఉత్పత్తి కేవలం ఎగుమతికే. | 35 | 509కో40ల | 544కో40ల |
| 2. పవర్ మగ్గాలు:— చేనేతరంగంలో- చేమగ్గాల తగ్గించి-క్రొత్తగా 35000 పవర్ మగ్గాలు ప్రవేశపెట్టి ఈ ఉత్పత్తి చేయబడును. | 20 | 27కో30ల | 47కో30ల |
| 3. చేనేతమగ్గాలు:— (i) మిల్లునూలుతో 70 కో.గ. (ii) అంబర్‌నూలుతో 30 కో.గ. | 100 | 148 | 248 |
| మొత్తం | 155 | 684కో70ల | 839కో70ల |

దీనినిబట్టి ఏ శాఖకూ కేటాయించకుండా 15 కోట్ల గజములు అనామతులో విడిచిపెట్టబడెను. రానున్న సంవత్సరములలో పరిస్థితులనుబట్టి యిందునుగురించి నిర్ణయం తీసుకోబడును. తలసరి వినియోగము 18½ గజాలకు మించి పోవచ్చు

ననే అవగాహన కూడా ప్రభుత్వానికి లేకపోలేదు. ఆ పరిస్థితిని ఎదుర్కోవడానికి ప్రభుత్వం సిద్ధంగానే వుంటుంది.

మిల్లుశాఖలో విస్తరణ:—

ముతకరకములు, మధ్యరకములు తయారుచేయడానికి ఆటోమాటిక్ మగ్గములు ప్రత్యేకంగా అనుకూలమయినట్టివి. ఈ రకములే మన ఎగుమతులలో అధికభాగం.

ఈ దిగువ షరతులమీద కొత్త ఆటోమాటిక్ మగ్గములు యివ్వబడును:—

(అ) ఈ అదనపుమగ్గాల ఉత్పత్తి అంతా విదేశముల కెగుమతి కావలెను.

(ఆ) మిల్లులు అదివరకటి ఉత్పత్తి ఎంతమేరకు ఎగుమతి చేస్తున్నవో ఆఎగుమతులు మామూలుగానే సాగుచుండవలెను.

కదుళ్ళ కేటాయింపు:—

అదనంగా కావలసివున్న 170 కోట్ల గజాలు బట్టలోను, 30 కోట్ల గజాలు అంబర్ చర్ఖానూలుకు కేటాయించడమయినది. మిగతా 140 కో. గజాలు ఉత్పత్తిచేయడానికి 21 లక్షల అదనపు కదుళ్ళు కావలెను. ప్రస్తుతం 19 లక్షల కదుళ్ళకు లైసెన్సులు యివ్వబడినవి. కాని, అనేక ప్రతిబంధకములవల్ల లైసెన్సు పొందిన సంఖ్యమేరకు కదుళ్ళన్నీ అమర్చబడకపోవచ్చును. ఖచ్చితంగా 21 లక్షల కదుళ్ళు అమలులోనికి వచ్చే పద్ధతిలో లైసెన్సులిచ్చే కార్యక్రమం పునఃప్రారంభించబడును.

ఎక్కడ నిరుద్యోగం తీవ్రంగా వుందో, ఏ చేనేతకేంద్రం నూలు మిల్లులకు మరీ ఎక్కువ దూరమై యిబ్బంది పడుతున్నదో, ఏ ప్రాంతంలో ఇటీవల ప్రత్తి వ్యవసాయం ప్రవేశించినందువల్ల నూలుమిల్లు ఆవశ్యకత ఏర్పడివుందో మొదలైన విషయము లను దృష్టిలో వుంచుకొని కొత్తకరుళ్ళ (నూలుమిల్లుల) కు లైసెన్సు లివ్వబడును.

పవర్‌మగ్గాల ప్రవేశం:—

1956-57 మరిన్ని 1957-58 ఈ రెండేళ్ళలో చేనేత రంగంలో 35000 పవర్‌మగ్గాలు ప్రవేశపెట్టబడును. సహకార చేనేత సొసైటీలలో వున్నవారికి అదనవు ఆదాయం వచ్చే నిమిత్తం ఈ మగ్గాలను యివ్వడం ఒక సాధారణపద్ధతి. అట్టి సొసైటీలకు ఈ పవర్ మగ్గాల నిమిత్తం ప్రభుత్వం ఆర్థిక సహాయంకూడా చేయును.

—(యిండియా ప్రభుత్వ వాణిజ్య. పరిశ్రమలశాఖ ప్రచురించే "ది జర్నల్ ఆఫ్ ఇండస్ట్రీ అండ్ కామర్సు" పత్రిక 1956 జూలై సంచికనుండి.)

కానుంగో కమిటీ రిపోర్టుయొక్క 'ముద్దు బిడ్డయే' ఈ 'నూతన వస్త్రవిధానం' ఆ రిపోర్టునూ, ఈ విధానమునూ చదివితే యిది స్పష్టమవుతుంది.

యిందులోని చాలా హంశాలు కానుంగో కమిటీ రిపోర్టుపై విమర్శలో చేరేవున్నవి. కనుక, యిక్కడ ముఖ్యంగా చేమగ్గం స్థానే పవర్‌మగ్గాలు ప్రవేశపెట్టడాన్ని గురించి చర్చిద్దాము.

చేమగ్గంపై వచ్చే ఆదాయం చాలా స్వల్పమనీ, చేనేత కార్మికుని ఆదాయం పెంచవలెనంటే చేమగ్గం స్థానే పవర్ మగ్గాన్ని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం అంటున్నది. పైకిచూస్తే యిది చేనేతకార్మికుని క్షేమంకోరే చేస్తున్నారేమో అనిపించే విధంగా తోస్తుంది. కాని, అది పూర్తిగా సరికాదు.

1961 నాటికి స్వదేశానికి—ఈ నూతన వస్త్రవిధానంలో చెప్పినట్లు—740 కో. గజాలూ, విదేశాలకు 100 కో. గజాలూ కలిసి 840 కో. గజాలు కావాలి.

కాని, మిల్లులు, పవర్ మగ్గాలూ కలిసి ప్రస్తుతము 536 కో. 70 లక్షల గజాలు ఉత్పత్తి చేస్తూనేవున్నవి. 1961 నాటికి యివిరెండూ సాలుకు 591 కో. 70 లక్షల గజాలను చేయగలవని టేబిలులోనేవుంది. యింక చేనేత పరిశ్రమ ఆ నాటికి సాలుకు 248 కో. గజాల వంతున ఉత్పత్తి చేయాలన్నమాట.

కానుంగోకమిటీ రిపోర్టు 92 పేరాలో చేమగ్గాలను పవర్ మగ్గాలుగా మార్పుచేసేపని ప్లాను ప్రకారం జరగాలని, ఏడాదికి 20,000 చేమగ్గాలను 10,000 పవర్ మగ్గాలుగాను, 38,000 చేమగ్గాలను 25,000 సెమీ-ఆటోమాటిక్ * మగ్గాలుగాను మార్చాలని సిఫార్సు చేసింది.

* సెమీ ఆటోమాటిక్ మగ్గాలను గురించి—తదితర మగ్గాలను గురించి గూడా—"పలురకాల మగ్గాలు" అనే అధ్యాయంలో వివరించబడింది.

ఈ లెక్కన ఏటా 60,000 చేమగ్గాలు పవర్ మగ్గాలుగా, సెమీ-ఆటోమాటిక్ మగ్గాలుగా మార్పు చెందాలన్న మాట. యిందువల్ల కమిటీ అంగీకరించిన దేశంలోని 12 లక్షల చేమగ్గాలు 20 సంవత్సరాలలో ఈ పరిణామం పొందవలెను.

సెమీ - ఆటోమాటిక్ మగ్గాలసంగతి అటుండనిచ్చి యింక మిగిలిన ఉత్పత్తి శేషము 248 కో. గజాలను కూడా ఒకే షిఫ్టు మాత్రమే పనిచేసేవయినా 2 లక్షల పవర్ మగ్గాలే ఈ ఉత్పత్తిని సులభంగా చేయగలవు. ఈ దృష్ట్యా మరి దేశంలో చేనేత పరిశ్రమ ఉండవలసిన పనేలేనుగదా ? మరి వారందరికీ క్రొత్త ఉద్యోగాలు చూపగలరా ?

ప్రభుత్వం నిజంగా చేనేత పారిశ్రామికుని ఆదాయ ప్రమాణమును పెంచదలచినదే వాస్తవమయితే అందుకు ఈ విధంగా చేనేత పరిశ్రమకే స్వస్తివాచకం పలికేమార్గం పట్ట నక్కరలేదు. అతని ఆదాయం పెరగాలంటే నెలపొడవునా కనీ సము 25 రోజులకు చేతినిండా పని కల్పించాలి. అందుకు తగిన మార్కెటింగు సౌకర్యాలు చేయాలి. మార్కెటింగు స్వాక ర్యము కలుగజేయడానికి చక్కని మార్గం, బట్టలమిల్లులవారికి ఏ రేటుకు నూలు దొరుకుతుందో సరిగా ఆ రేటుకు చేనేతకు కావలసినంత నూలు సప్లయిని చేయవచ్చును. మిల్లులకు, చేనే తకు నూలుధరల గిట్టుబాటులోవున్న తేడాను "నూలు కొను గోలుపై రిబేటు" ద్వారా యావత్పరిశ్రమకు సెస్సుఫండునుండి అందజేయవచ్చును; లేదా చీరలు, ధోవతులు చేనేతకు కేటా యించవచ్చును.

అప్పుడు ప్రభుత్వం ఆశించినట్లుగా చేనేత పారిశ్రామికుని ఆదాయప్రమాణం తప్పకుండా పెరుగుతుంది. ఈ పరిస్థితులన్నీ ఏర్పడితే చేనేతలో యితరత్రా నిరుద్యోగులుగావున్న మరికొందరికి తావుగూడా ఏర్పడగలదు.

ప్రభుత్వం అనుసరించదలచిన విధానంప్రకారం చేనేత వారు నిరుద్యోగులుగా మారిపొయ్యే ప్రమాదముంది.

కాబట్టి, కోట్లకొలది మనుష్య సంపద కలిగిన మనవంటి దేశంలో యాంత్రికీకరణకు తొందరపడటం ప్రమాద భూయిష్టము. ఉత్పత్తి కార్యానికి విస్తారంగా మనుష్య సంపదను వినియోగించుకొనకపోతే మన ఆర్థికవ్యవస్థ తలక్రిందులై పోగలదు.

సిద్ధాంతరీత్యా యంత్రపరికరాలపై అసహ్యమూ లేదు; "చేమగ్గం" మాత్రమే సృష్టి పర్యంతరమూ ఉండాలనే హఠమూ కాదు. దేశ, కాల, పరిస్థితులనుబట్టి ఉచితానుచితములను యోచించి మాత్రమే ముందుకు సాగవలెను.

మిల్లుబట్ట సాలీనా 100కోట్ల గజాలు ఎగుమతి కావాలనే ప్రాతిపదికమీద ఈ విధానం రూపొందించబడింది. ఇది నెరవేరేదేనా? 1950 లో మాత్రం 114 కోట్ల గ॥ ఎగుమతి అయింది. తరువాత క్రమంగా తగ్గింది. 1951 లో 78, 1952 లో 58, 1953 లో 63, 1954 లో 76, 1955 లో 68, 1956 లో 69 కోట్లు గ॥ మాత్రం ఎగుమతి అయింది.

ఇపుడు ప్రతిదేశం ఆహారం, బట్ట విషయంలో స్వయం పోషకంగా వుండాలని తీవ్ర ప్రయత్నాలు చేసుకుంటున్నాయి.

• • •

ఏ వెనుకబడ్డ దేశంలోనైనా ఆ ప్రయత్నం యింకా పూర్తిగాక పోతే అతి త్వరలోనే పూర్తి చేసుకోవాలని నడుం బిగించింది. ఈలాగే జపాన్ అక్కడికి గుడ్డ పంపుతూవుంది. జపాన్ వలెనే ఆటోమేటిక్ మగ్గాలు మనం యీ 5 ఏళ్ళలో 14600 పెట్టి, దానితో పోటీచేద్దామనుకుంటే మనం సవరించుకొనేలోగా ఆ వెనకబడ్డ దేశాలు స్వయంపోషకమై కూర్చుంటాయి. అప్పుడు పిడుగు ఎవరిమీద పడుతుందని చేనేతవారి ప్రశ్న.

దామాషాను సాలీనా ఎలాగూ 65 కోట్ల గII విదేశాలకు ఎగుమతి అవుతూనే వుందిగదా అనిన్నీ యికను యీ 14,600 ఆటోమగ్గాలమీద 35 కోట్ల గII తయారుచేసి దాన్ని కూడా ఎగుమతికే వినియోగించాలని ప్రభుత్వం ప్రకటించింది. ఈ 35 కోట్లలో ఒక్క గజం ఇండియాలో అమ్మినా అపరాధ పన్ను దానిమీద విధింపబడుతుందని తీర్మానించేరు. అటు ఎగుమతికాక ఇటు దేశంలోను అమ్మక దీన్ని ఏ సముద్రంలో ముంచమంటారని ప్రక్కన మిల్లులవారు గోలపెడుతూనే వున్నారు. ఈ అపరాధపుపన్ను ఖచ్చితంగా అమలు జరిపేలాగుంటే అసలు ఈ 14,600 మగ్గాలు పెట్టడానికే మిల్లువారు ఉత్సాహపడరు.

పరిశ్రమల అభివృద్ధికి ప్రపంచ బ్యాంకిని అప్పుకోరగా వారు వివరాలు పరిశీలించి యీ నూతన వస్త్రవిధానముకు సంబంధించినంతవరకు తమ సందేహాన్ని వెలిబుచ్చేరు. 'ప్రస్తుత

ప్రపంచ వస్త్రమార్కెటు పరిస్థితిలో 100 కోట్ల గ॥ ఎగుమతి ఇండియా సాధించగలదని నమ్మకంగా చెప్పలేము అన్నారు.

ఆటోమగ్గం 1కి రు. 15,000 చొ॥ సామాన్య పవర్ మగ్గం 1కి రు. 3,000 చొ॥ మొత్తం ఈ నూ॥ వ॥ వి॥ అంతా కల్పి రు. 50 కోట్లు పెట్టుబడి కోరుతుంది.

ప్రపంచంలో మన గుడ్డ ఎగుమతులు తగ్గిపోతున్నవి గదయ్యా అని అడిగితే దేశంలో గుడ్డ చలామణి పెరిగినందున ఎగుమతికి మిగలక పడిపోతున్నాయని కొన్నాళ్ళు సమాధానం చెప్పేరు. మరీ పడిపోడం చూచి ఆందోళనపడి ప్రభుత్వద్రవ్యం ధారాళంగా ఖర్చుపెట్టి 1954 లో గుడ్డల ఎగుమతి ప్రోత్సాహక కౌన్సిల్ స్థాపించి దేశదేశాల్లో బ్రాంచి ఆఫీసులు పెట్టి తీవ్రకృషి చేస్తున్నారు. చేసినఫలితం 1954 లో 76 కోట్ల గ॥ ఎగుమతి అయితే 1956 లో 69 కో॥ మాత్రమే. ఈమధ్య ఒక ప్రముఖ మిల్లు యజమాని కొత్తరాగం ఆలాపించడం విన బడుతూవుంది. బర్మా మొదలైన దేశాలు తమకు అదనంగా వుండిపోయిన బియ్యం వగైరాలు ఏ దేశం తీసుకొంటుందో ఆ దేశంనుండే బట్టగూడా దిగుమతి చేసుకోగలం అంటున్నారు గనక అదిగూడా ఆలోచించవలసిందే అంటున్నారు. భారత దేశం ఆహారం దిగుమతి చేసుకోవాలట. తనబట్ట ఎగుమతి ఎంతకాలం ఉండాలనుకుంటున్నారో అంతకాలం ఆహారం దిగుమతి జరగవలసిందేనా? నూతన వస్త్రవిధానం ఒక విషచక్రంలో పడవేస్తుందా ?

## ఎనిమిదవ ప్రకరణం.

# చేనేతమగ్గాల రిజిస్ట్రేషన్

అఖిలభారత చేనేతబోర్డువారి రెండవ వార్షికనివేదికలో (1954-55) దీనిని గురించి యిలావుంది.

మూడు కారణములవల్ల మగ్గాల రిజిస్ట్రేషన్ అవసరమూ, సాధ్యమూనని బోర్డు అభిప్రాయము.

1. విశ్వవిద్యాలయములు చేసే సర్వేగూడా పెద్దపెద్ద చేనేత కేంద్రములకే పరిమితమై వుంటుందిగాని ప్రతీ పల్లెలోని చేమగ్గంవరకూ రాదు.
2. ప్రతిరంగంలోను వివరాలతో కూడిన "ప్లానింగుతరహా" ఆర్థికవిధానం చేపట్టిన ఈ రోజులలో పనిలోవున్నా, మూలబడివున్నా మగ్గాల సంఖ్యావివరములను వీలయినంత స్పష్టంగా తెలిసికొనిమాత్రమే ఒక పరిశ్రమ యొక్క ఉత్పత్తిసత్తాను సరిగా అంచనా వేయగలుగుతాము.
3. యిదివరకే మధ్యప్రదేశ్ ప్రభుత్వం తన స్వంత పూచీ మీద యిట్టి లైసెన్సింగు పద్ధతిని అమలుజరిపి మంచి ఫలితాలను పొందింది.

ఈ కారణమువలన మగ్గాల రిజిస్ట్రేషన్ అవసరమని బోర్డువారి అభిప్రాయము.

## కానుంగోకమిటీ సిఫార్సు.

బోర్డువారు వెలిబుచ్చిన ఈ అభిప్రాయం బహుశః కానుంగోకమిటీ రిపోర్టునుండి పుట్టి యుండవచ్చునని తోస్తుంది.

కానుంగోకమిటీ రిపోర్టులో యిందునుగురించి 127, 128 పేరాగ్రాఫ్‌లలో చర్చించబడింది.

127 "మద్రాసు, ఆంధ్ర రాష్ట్రీయ చేనేత సహకార సంఘాలవంటి వాటిద్వారా తెలియవచ్చిన లెక్కలు తప్పితే, చేనేత పరిశ్రమకు సంబంధించిన విశ్వసనీయమైన లెక్కలు లభించకపోవడం దర్యాప్తు సంఘానికి పెద్ద చిక్కుగా ఏర్పడింది. భారత రాజ్యాంగం నిర్దేశించిన సాంఘిక లక్ష్యాలసాధనకై, ప్రజల జీవనప్రమాణాన్ని హెచ్చించడానికి కొన్ని సంవత్సరాల గడువు మేరకు ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకొనక తప్పదు. ఏ పద్ధతిలో నిర్ణయించుకొన్న కార్యక్రమమైనా విజయం పొందడానికి విశ్వసనీయమయిన లెక్కల వివరాలు ముఖ్యమని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అఖిలభారత చేనేతబోర్డు పరిశ్రమకు సంబంధించిన లెక్కల వివరాలను సేకరించుకొనగలగడానికి అన్ని రాష్ట్రాలకు ద్రవ్యసహాయం చేస్తున్నది. ఈ లెక్కలు చాలా ముఖ్యమయినవని దర్యాప్తు సంఘం నొక్కి చెప్పగోరుతున్నది. దేశం మొత్తంమీద సమాన ప్రాతిపదికపై ఈ లెక్కల సేకరణ నిమిత్తం ఒక సంస్థ శాశ్వతంగా ఏర్పాటు చేయబడగలదని సంఘం ఆశిస్తున్నదికూడా."

128 "ఏ ఒక్క ప్రాంతానికీ చిక్కు కలగకుండా ఏ ప్రాంతానికీ మితిమీరిన ఆధిక్యత చూపబడకుండా చేమగ్గాలను అభివృద్ధి చేయబడిన క్రొత్తరకం మగ్గాలుగా, మరమగ్గాలుగా రూపొందించే కార్యక్రమం సక్రమంగా నెరవేరాలంటే లెక్కలు విధి విహితంగా కావాలి. సుమారు మూడు చేమగ్గాలను రెండు క్రొత్తరకం మగ్గాలుగానూ, రెండు చేమగ్గాలను ఒక మరమగ్గంగాను మార్చవచ్చునని దర్యాప్తు సంఘం సూచించి వున్నందున చేమగ్గాల నమోదు (రిజిస్ట్రేషన్) కు పూనుకోవడం అవసరము. సాలుకు సగటున 200 రోజులు పూర్తిగా పనిచేసిన చేమగ్గాలు ప్రాతిపదికగానే దర్యాప్తు సంఘం తన అంచనాలను వేసింది. కాగా, ఈ నివేదికను సంతకం చేసిన తేదీ * కి ముందు కనీసము 150 రోజులుగా పనిచేస్తున్న మగ్గాలన్నిటిని నమోదు చేసి లైసెన్సులివ్వడం అవసరమవుతున్నది. అలా నమోదుకాబడిన చేమగ్గాలనే మార్పు కార్యక్రమంలో • చేర్చుకోవలసింది. చేమగ్గాల యజమానుల నివేదికల సేకరణ చాలదు. చేమగ్గం కొనిన నిదర్శన, నూలు ఉపయోగించిన నిదర్శనలతోపాటు కనీసము 150 రోజులుగా పనిచేస్తున్నట్లు స్థానికంగా దర్యాప్తు వల్ల రూఢి చేసుకోవలసివుంది. క్రొత్తగా చేమగ్గాలు పెట్టుకోవడానికి అనుమతించడంద్వారా ఒక కుటుంబం సాధారణంగా కనీసం రెండు

* 10—9—1954 న్యూఢిల్లీ.

• అంటే చేమగ్గాలను పవర్ మగ్గాలుగా మార్చే కార్యక్రమంలో.

చేమగ్గాలను తరచుగా మూడు లేక నాలుగు మగ్గాలను వుంచు కొన్న సందర్భాలున్నూ కలవని సంఘం తన విచారణలో కను గొన్నది. * కనుక మార్పు కార్యక్రమాన్ని అమలుజరిపే సందర్భంలో ఈ చర్యలను తీసుకొనడం అంతకష్టం కాదనే దర్యాప్తు సంఘం భావిస్తున్నది."

రిజిస్ట్రేషన్‌కు అ. భా. చే. బోర్డువారు చెప్పిన కారణములకు, కమిటీ రిపోర్టులో చెప్పిన ఈ కారణములకు హాస్తి మశకాంతరం వుంది. కమిటీ రిపోర్టులోకూడా 127 వ పేరాకు, 128 వ పేరాకు చాలా తేడా వుంది. 127 లో ప్లానుకోసం లెక్కలు అవసరముగా అ. భా. చే. బోర్డుకువలెనే వుంది. కాని 128 వ పేరా ఈ లెక్కలు ఎందునిమిత్తమై కావలసి వున్నవో తన నిజస్వరూపముతో కమిటీ వ్రాసింది. చేమగ్గాలను పవర్‌మగ్గాలుగా మార్పు చేసేటందుకు లెక్కలు సరిగా కావలసివుందని వ్రాసిందే ప్రణాళికబద్ధమయిన ఆర్థికవ్యవస్థ

* ఈ వాక్యానికి అర్థం సరిగా రావడంలేదు. రెండు పెట్టుకోమంటే నాలుగు పెట్టుకొంటారనే నింద ఒకటి తోస్తున్నది. ఆ విధంగా చేయడానికి అనేక కారణములుండవచ్చు. యిప్పుడా చర్చతో పనిలేదు. కాని రిపోర్టులో "నిర్ణయాల, సిఫారసుల సారాంశం" అనే 5 వ అధ్యాయంలో (94 వ పేజీలో) 128 వ పేరాగ్రాఫ్ సారాంశముగా (173 వ నెంబరు సారాంశం) యిట్లు వ్రాయబడివుంది:—"కొత్త చేమగ్గాలను ఏర్పాటు చేసుకొనడానికి అనుమతించరాదు" కావున దీన్నిబట్టి కొత్తగా చేమగ్గాలు పెట్టుకోవడంకూడా కమిటీకి అయిష్టమని తోచుచున్నది.

లెక్కలకున్న ప్రాముఖ్యము దృష్ట్యా వాటిని కోరలేము. (1) అంతేగాక మగ్గంకోనిన నిదర్శన (2) నూలు వాడిన నిదర్శన (3) 10-9-54 తేదీనుండు 150 రోజులుగా పనిచేసిన నిదర్శన యిన్ని కావాలట.

తమ పరిశ్రమను సమూలనాశనం చేయడానికి ఈ దృష్ట్యా జరుపబడే రిజిస్ట్రేషన్‌కు వ్యతిరేకంగా దేశంలోని చేనేత వారంతా—ఎవరు ఏ పక్షానికి చెందినా, చెందకపోయినా—ఐక్యంగా వ్యతిరేకాందోళన చేశారు. అది సహజమే. కాని ప్రణాళికాబద్ధమయిన ఆర్థికవ్యవస్థలో లెక్కలకున్న ప్రాముఖ్యత దృష్ట్యా ఈ రిజిస్ట్రేషన్‌ను కాదనడం కష్టమే. కాని ప్రభుత్వం పైకిమాత్రమే యిటువంటి కారణమును చెప్తూన్నది. కానుంగోకమిటీ రిపోర్టులో చెప్పినట్లుగా చేనేత మగ్గాల స్థానంలో క్రమంగా పవర్ మగ్గాలను ప్రవేశపెట్టేటందు కవసరమయిన లెక్కలకొరకై ఈ రిజిస్ట్రేషన్‌ను అనుసరిస్తున్నదనేది స్పష్టము. కాబట్టి దీనిని వ్యతిరేకించక తప్పడంలేదు. అయినప్పటికీ ప్రభుత్వంయొక్క ఒత్తిడివల్ల దీనిని ఒక చేదుమాత్రగా మ్రింగి తల ఒగ్గవలసి వస్తున్నది. శాంతియుతంగా రిజిస్ట్రేషన్‌కు మూలమయిన—చేనేతను క్రమంగా నాశనం చేయాలనే విధానమును—పాలసీని ప్రతిఘటిస్తూ ఆందోళన చేయవలసిన కర్తవ్యం వుంది.

## చేనేతమగ్గాల రిజిస్ట్రేషన్ ఉత్తర్వు.

### (పూర్తి పాఠము)

ఇండియాప్రభుత్వ గెజెట్టు (అసాధారణ) 2 వ పార్టు 3 వ సెక్షన్ వాణిజ్య పరిశ్రమల మంత్రిత్వశాఖ. న్యూఢిల్లీ 8-5-1956.

1. పేరు, వర్తింపు, అమలులోనికివచ్చు కాలము.

(i) ఈ ఆర్డర్ పేరు :—"కాటన్ టెక్స్టైల్సు (ప్రొడక్షన్ బై హాండులూం) కంట్రోలు ఆర్డరు, 1956"

(ii) ప్రారంభం :—ఈ ఆర్డరు వెంటనే అమలులోనికి వచ్చును.

(iii) జూరిస్‌డిక్షన్ (వర్తింపు) :— జమ్ము కాశ్మీర్ స్టేటు మినహా తక్కిన భారత దేశమంతటికీ వర్తించును.

2. నిర్వచనములు.

(ఎ) "ఫారం" అనగా ఈ ఆర్డరుకు జతపరచినది.

(బి) "మగ్గం" అనగా పనిచేయుచున్న మగ్గము; లేక పవరుతో కాకుండా బట్టలు నేయుమగ్గం [క్లాజు (జి) సెక్షన్ 2 ఫ్యాక్టరీ ఆక్టు, 1948]

(సి) టెక్స్టైలు కమీషనర్ దీనినే ఆధారముగా తీసికొనును.

(డి) "రిజిస్టరు ఉద్యోగి" టెక్స్టైలు కమీషనర్, బొంబాయి. లేక అనుమతిపొందిన ఏ ఆఫీసరయినా టెక్స్టైలు కమీషనర్ తరఫున అన్ని ఆర్డర్లు జారీచేయవచ్చును.

3. రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్.

ఈ ఆర్డరు ప్రారంభమయిన తర్వాత మగ్గమును రిజిస్టర్ చేయించుకొనడము, సదరు రిజిస్టరు సర్టిఫికెట్టును దగ్గర వుంచుకొనడము జరిగితేనేతప్ప ఏ ఒక్కరున్నూ మగ్గం కలిగియుండరాదు.

4. రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్టుకు దరఖాస్తులు.

(i) ఈ ఆర్డరు అమలులోనికి వచ్చిన 30 రోజులలోగా గానీ, లేదా అనుమతించబడిన అదనపు గడువులోగాగానీ మగ్గందారు రిజిస్టరింగు అధికారికి సర్టిఫికెట్టుకొరకై దరఖాస్తు పెట్టుకోవలెను.

(ii) యికముందు క్రొత్తగా మగ్గం పెట్టుకొనేవారు, అట్లు పెట్టుకొన్న 30 రోజులలోగా రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్టు కొరకు దరఖాస్తు పెట్టుకోవలెను.

(iii) "ఫారం, ఏ" అనేదానిలో దరఖాస్తు పూరించి పంపవలెను.

(iv) రిజిస్ట్రేషనుకు ఎటువంటి ఫీజూ లేదు.

5. సర్టిఫికెట్టుయొక్క ఫారం

(i) రిజిస్టరింగు అధికారి తనకు దరఖాస్తు చేరిన తర్వాత అవసరమని తోచిన దర్యాప్తు జరిపించి మగ్గాన్ని రిజిష్టరు చేసి "ఫారం, బి" లో సర్టిఫికెట్టు యివ్వవలెను. సదరు సర్టిఫికెట్లు అన్నింటికీ వరుస నెంబర్లు వేయవలెను.

(ii) సర్టిఫికెట్టు నెంబరు మగ్గంమీాద మగ్గందారు వేసుకోవలెను.

6. రెన్యూవల్ ఆఫ్ సర్టిఫికెట్ (సర్టిఫికెట్టును పునరుద్ధరించుట)

(i) రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్టు రిజిస్టరయిన తేదీనుండి ఒక సంవత్సరం అమలులో నుండును. ఆ తర్వాత పునరుద్ధరించ దలచుకొంటే "ఫారం, సి" లో పునరుద్ధరణకుగాను దరఖాస్తు పెట్టవలెను. ప్రతిపునరుద్ధరణ కూడా ఒక్క సంవత్సర కాలానికి మాత్రమే జరుగును. (అనగా ఏటా పునరుద్ధరించుకో వలయునని తాత్పర్యం—రచయిత)

(ii) సర్టిఫికెట్టు గడువు 30 రోజులకు ముగియుననగా పునరుద్ధరణకుగాను దరఖాస్తు పెట్టుకోవలెను. మరీ అసాధారణ పరిస్థితులలో అధికారికి తగు కారణములు చూపి ఒప్పించి నప్పుడు మాత్రమే ఈ రూలులో మినహాయింపు అంగీకరింపబడును.

7. సర్టిఫికెట్టును కొట్టివేయుట.

(i) ఒక ఆసామి (లేక వ్యక్తి) తప్పు సమాచారం యిచ్చి అక్రమంగా రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్టు పొందినట్లు అధికారికి తెలియ

వస్తే అతనిపై ఇతర రూల్సు ప్రకారం తీసికొనే చర్యలు మాత్రమేగాక ఆ సర్టిఫికెట్టును గూడా వెంటనే రద్దు చేయ వచ్చును.

8. యిండ్లలోనికి వెళ్ళి తనిఖీచేయుట మొదలగునవి.

రిజిస్టరింగు అధికారియొక్క వ్రాతమూలకమైన పర్మి షను పొందిన ఏ ఉద్యోగిఅయినా ఈ ఆర్డరు అమలునిమిత్తం.

(ఎ) ఏ మనిషినైననూ తన స్వాధీనంలోవున్న మగ్గా లను గురించిన సమాచారమివ్వమని కోరుటకున్నూ,

(బి) ఏ మనిషి అయిననూ మగ్గం కలిగియుండటంకానీ, లేక తన కంట్రోలుక్రింద మగ్గములున్నప్పుడుగానీ అతని తాలూకు లెక్కలపుస్తకాలు వగయిరాలు తనిఖీ చేయు టకున్నూ,

(సి) ఈ ఆర్డరుకు వ్యతిరేకంగా ఒకమనిషి మగ్గమును కలిగియున్నట్లు తగిన కారణముతో ఉద్యోగి నమ్మినయెడల ఆ యింటిలోపలకు సూర్యోదయ, సూర్యాస్తమయ సమయముల మధ్య ఎప్పుడైనాసరే వెళ్ళి తనిఖీచేయుటకున్నూ అధికారము కలదు.

9. కోరబడిన సమాచార మిచ్చుట.

పై 8 వ క్లాజుప్రకారం ఆ ఉద్యోగి అడిగిన సమాచార మును.నిర్ణయింపబడిన కాలములోగా ఆమనిషి యివ్వవలెను.

• • •

10. 1955 అత్యవసర వస్తువుల చట్టముక్రింద చేయబడి నగానీ, చేయబడినట్లు ఊహించినగానీ ఒక ఆర్డరు ఏ స్టేటు లోనైనా అమలులో నున్నట్లయితే సదరు ఆర్డరు ఈ ఆర్డరు లోని ఏఅంశమునకైననూ సంబంధమున్న యెడల ఆ వెనకటి ఆర్డరు రద్దు అయినట్లుగా భావింపబడవలెను.

"ఫారం, ఏ"

[ 4. (iii) క్లాజును చూడుము ]

చేమగ్గాల రిజిస్ట్రేషన్‌కు దరఖాస్తు ఫారము.

1. దరఖాస్తుదారుని పేరు, అడ్రసు.
2. వయస్సు.
3. చేమగ్గం వున్నటువంటి సరాసరిచోటు.
4. దరఖాస్తుదారుని స్వాధీనంలోని మొత్తం మగ్గాలు.
5. దరఖాస్తు దాఖలుచేయునాటికి పనిచేయుచున్న మగ్గముల సంఖ్య.
6. మగ్గంయొక్క వివరము.
   (i) నాడివిసిరే గోతి మగ్గమా?
   (ii) త్రాడులాగే గోతిమగ్గమా?
   (iii) త్రాడులాగే ఫ్రేము మగ్గమా?
   (iv) హాటర్‌స్లై మగ్గమా?
   (v) సెమీ ఆటోమాటిక్ మగ్గమా?
   (vi) మరి ఏయితరమగ్గము? దాని వివరమేమి?

రూ ఢి వ చ న ము.

ఈదరఖాస్తులో యివ్వబడిన సమాచారమంతయూ నిజమయినదని యిందుమూలముగా తెలియజేయుచున్నాను.

తేదీ........................దరఖాస్తుదారుని సంతకము.

"ఫారం, బి"

[ 5 (i) క్లాజును చూడుము ]

రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ నెం........

1. మగ్గందారుని పేరు అడ్రసు.
2. వయస్సు
3. మగ్గమున్న సరాసరిచోటు
4. మగ్గముల సంఖ్య
5. సర్టిఫికెట్టుయొక్క కాలవ్యవధి.

గమనిక :- సర్టిఫికెట్టుదారు ప్రతి మగ్గంమీాద దాని నెంబరును వ్రాయవలెను.

స్థలం.........
తేదీ......... రిజిస్టరింగు అధికారి సంతకం.

... ... ... ... ... ... ... ...

రెన్యూవల్ ఎండార్సుమెంటు (పునరుద్ధరణకు ఆమోదం)

| పునరుద్ధరణ తేదీ | గడువు ముగియు వాయిదా | రిజిస్టరింగు అధికారి సంతకం | రిమార్కులు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |

## " ఫారం, సి "

[ 6. (i) క్లాజును చూడుము ]

సర్టిఫికెట్ పునరుద్ధరణకు దరఖాస్తుఫారం.

1. మగ్గందారుని పేరు, అడ్రసు.

2. (i) రిజిస్ట్రేషన్ సర్టిఫికేట్ యొక్క నెంబరు

(ii) రిజిస్టరు కాబడిన మొత్తం మగ్గాల సంఖ్య.

3. మగ్గంవున్న సరాసరిచోటు.

గమనిక :- పై ప్రశ్నలకు అవసరమైనచోట్ల సమాధానం వ్రాయవలెను. తనకు అన్వయించనిచోట "లేదు" అని వ్రాయవలెను.

రూ ఢి వ చ న ము.

ఈ దరఖాస్తులో యివ్వబడిన సమాచార మంతయూ నిజమయినదని యిందుమూలముగా తెలియజేయుచున్నాను.

తేదీ............ దరఖాస్తు దారుని సంతకం.

# తొమ్మిదవ ప్రకరణం.

# మాస్టరు వీవరు.

మాష్టరు వీవరు వర్గంపట్ల వైఖరి ఎట్లా వుండవలెను? ఈ ప్రశ్న ప్రభుత్వానికి, చేనేత ప్రజానీకానికీ, ఉద్యమ నిర్మాతలకు కూడా ప్రధానమైనది. దేశంలోని మగ్గాలలో మూడింట ఒకవంతు మాత్రమే సహకార రంగంలో ఉన్నట్లు ప్రభుత్వం చెబుతున్నప్పటికీ వాస్తవంలో నాలుగింట ఒకవంతుమాత్రమే వుండవచ్చును. అనగా నాల్గింట మూడువంతులు—స్వతంత్ర చేనేత పారిశ్రామికుల సంఖ్య అంత గణనీయమైనదికాదు — పరిశ్రమ మాష్టరు వీవర్ల అధ్వర్యంక్రింద వుందన్నమాట.

రెండవ పంచవర్ష ప్రణాళికలో 1961 నాటికి మూడింట రెండు వంతులు సహకార రంగంలోనికి తేవాలని, కనీసం సగమయినా వచ్చేటట్లు గట్టిగా కృషిచేయాలని అ. భా. చే. బోర్డు వారి సంకల్పము. అందువల్ల ఆ నాటికికూడా సగం పరిశ్రమ బయటనే వుండిపోతుందన్నమాట.

దీనినిబట్టి మాష్టరు వీవరు వర్గానికి ఎట్టి బాధ్యత, పాత్ర, ప్రాధాన్యత ఉన్నదో గ్రహించవచ్చును. ప్రాచీనమయిన గ్రామ స్వయంసంపూర్ణ ఆర్థికవిధానం ఏనాడో అంతరించి, రాష్ట్రాంతర, దేశాంతర వ్యాపారంతో నూతనయుగమునకు

నాందీ ప్రస్తావన జరిగినప్పుడు చారిత్రక అవసరమునుబట్టి మాష్టరు వీవరు వర్గము అవతరించినది. చేనేత పరిశ్రమను సర్వ నాశనం చేయడానికి నైపుణ్యతగలవారి వేళ్ళను బ్రిటిషు ప్రభుత్వం నరికించివేసేటంతటి ఘాతుకత్వం చేసినప్పటికీ, తర్వాతగూడా ప్రభుత్వపు 'సవతితల్లి ప్రేమ' కు 'మొసలి కన్నీటిప్రేమ' కు గురియై చావు బ్రదుకులమధ్యన కొట్టుమిట్టా డుతున్నప్పటికి పూర్తిగా చావకుండా యింకా కొంత కొన ఊపిరితో వుండడానికి మాష్టరు వీవరువర్గమూ, దేశప్రజల ఆద రాభిమానములు మాత్రమే కారణములు.

సాలుపొడవునా పని చెప్పలేకపోవడానికి, న్యాయమైన మజూరీ (కూలి) యివ్వలేకపోవడానికి మాష్టరు వీవరుయొక్క స్వార్థమే కారణమని తరచుగా ప్రభుత్వోద్యోగులు, కొందరు చేనేతవారు అనుకొంటుంటారు. అప్పుడప్పుడు అక్కడక్కడ యిది తాత్కాలికంగా నిజమయితే కావచ్చునేమోగాని చారి త్రకంగా, సర్వకాలాల సత్యంమాత్రం కాదు. వెనుకబడిన పెట్టుబడిదారీ ఆర్థికవిధానం కలిగిన మన దేశంలో అరాజకత్వమే మార్కెట్లను పరిపాలిస్తున్నది. నూలుధరలు జూదంమాదిరిగా తారుమారవుతూ వుండటం, కావలసిన నూలు కావలసినంత దొరకకపోవడం పరిపాటి. బట్టల ధరలుగూడా దారుణంగా హెచ్చుతగ్గులవుతుండటం, తరచుగా నిల్వలు పెరిగిపోవడం అనేవి చేనేత పరిశ్రమకు జీర్ణించిన వ్యాధి అయిపోయినది.

ఈ రంగములోనే కాకుండా యితర వ్యాపారములలోను, వ్యవసాయంలోను ధరవరల విషయంలో అరాజకత్వమును చూచుచునే యున్నాము. ఈ పరిస్థితులమధ్య చివరకు ప్రభుత్వం స్థాపించిన చేనేత సొసైటీలుకూడా తగిన మజూరీ యివ్వలేకపోవడం, సాలుపొడవునా పని చెప్పలేకపోవడం, ఒక్కొక్క పరిస్థితిలో మూసివేయబడటం గూడా మన మెరిగిన దే. యిలాంటి వాతావరణంలో ఒక్క మాస్టరువీవరువర్గంమీాదనే నేరమంతా ఆరోపించడం క్షమింపదగినది కాదు.

ఒకవైపున చేనేతపరిశ్రమకు అ. భా. చే. బోర్డు అండదండలుగా వుంటున్నది. రెండవవైపున నాలుగేండ్లనుండి రు 18 కోట్లు సెస్సు ఫండునుండి వెచ్చించి వివిధస్కీములద్వారా పరిశ్రమకు క్రొత్తరక్తములు ఎక్కిస్తున్నది. అయినప్పటికీ స్వంతంగా నేసుకొనేవాని పరిస్థితి ఈనాడు ఎట్లావుంది ? అస్థిరంగాను, అరాజకంగాను వున్న మార్కెట్టు తాకిడికి నిలువలేక విధిలేని పరిస్థితిగా మాస్టరు వీవరు చేతిక్రింద తలదాచుకొనవలసి వస్తున్నది గదా ! మరి ఈ పరిస్థితిలో మాస్టరు వీవరు వర్గపుటునికిని, వారి అవశ్యకతను ఏలా కాదనగలం ?

ఏ కారణంచేతనోగాని మాస్టరు వీవరు వర్గమును ప్రభుత్వమేమి, సహకారరంగమేమి, చేనేత కార్యకర్తలూ చేనేత ప్రజలూ యేమి ఒక "తప్పనిసరి కీడు" (నెసెసరీ ఈవిల్) గా భావించుచున్నారు. ఈ వైఖరి సరికాదు. ఎందుచేత ?

మొదటిది :—సిద్ధాంత దృష్ట్యా కార్మికుని 'శ్రమశక్తి'ని చీమంత దోచుకొనినా, కొండంత దోచుకొనినా "దోపిడీ" యే అనే విషయంలో సందేహంలేదు. కాని, ఈ సిద్ధాంతాన్ని కార్మికుని 'అదనపువిలువ' నుండి ఏటా కొన్ని కోట్లరూపాయలను 'లాభం' పేరుతో సంపాదించే పెట్టుబడిదారుని పట్లనూ, ఏటా కొన్ని వందలు మాత్రమే సంపాదించుకొనే మాస్టరు వీవరుపట్లనూ సమానవైఖరితో జడప్రాయంగా అనువర్తింపు చేయకూడదు. ఆ విధంగా చేస్తే పిడుగుకూ బియ్యపుగింజకూ ఒకే మంత్రం చదివినట్లవుతుంది. ఆచరణలో హస్తిమశకాంతరం వుందికనుక విచక్షణాదృష్టితో సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అన్వయించాలి. అంధప్రాయంగా ముక్కుకు సూటిగా వెళ్ళరాదు. కాబట్టి వీవరుని ఒక దోపిడీదారునిక్రింద లెక్కగట్టి ఆ దృష్టితో అతనిపట్ల వైఖరిని నిర్ణయించడము సరికాదు.

రెండవది :—రెండవ ప్రణాళికాంత్యం (1961) నాటికి కూడా మొత్తం చేనేత పరిశ్రమలో కనీసం సగమైనా సహకారరంగంలోనికి తేవాలని ఆశించబడుతున్నది. సరియైన సౌకర్యాలు, సాలుపొడవునా పని చూపడము మొదలయినవి కలుగచేస్తేనే యిదైనా సాధ్యపడగలదు. అప్పటికీ యింకా సగం పరిశ్రమ సహకారరంగానికి బయటనే వుంటుంది. ఆ మాటకొస్తే మొత్తం పరిశ్రమనంతా సహకార రంగంలోనికి తెచ్చేటంత వరకూ సహకారేతర చేనేతరంగంలో మాస్టరువీవరు పాత్ర అనివార్యము.

అంతేగాక ముడివస్తువు అయిన నూలు కొనడం, రంగుల అద్దకము, వినియోగదారుల అభిరుచులమేరకు రకాలను మార్చుతూండటం, యితర పైపై చిల్లరపనులు మొదలైన మేనేజిమెంటును అతడు నిర్వహించుచున్నాడు. కొన్ని ప్రాంతాలలో చిన్న చిన్న మాస్టరు వీవర్లు స్వయంగా నేత నేసేవారుగా కూడా అయియున్నారు. చేనేతకార్మికుని కష్టసుఖాదులలో అతనుగూడా ఒక భాగస్వామిగా వుంటున్నాడు. గుడ్డ ఖర్చుగాకపోతే స్వయంగా పల్లెలకు వెళ్ళి నెత్తిమూటద్వారా అమ్మియో, వ్యాపారస్తులకు అప్పుగా యిచ్చియో ఏదోవిధంగా మగ్గాలు జరగాలని ఆదుర్దాపడుతాడు. ఒక్కొక్కప్పుడు అప్పులు గూడా తేవడం జరుగుతుంటుంది. అయితే దీనికికారణం మాంద్య సమయంలో నేయించితేగాని గిరాకీసమయంలో కూలినేతవారు దొరకరనే లాభదృష్టియే కాదా అంటే కాదనలేము. లాభంలేకుండ పనిచేయడానికి అతను సన్యాసి కాదుగదా ? "వరదలో కొట్టుకపోయినా శెట్టి వరమానం ఉంటేనే పోతాడు" అని సామెత వుండనేవుందిగదా ! కాబట్టి యావత్తు చేనేత పరిశ్రమ సహకార రంగములోనికి లీనమైపోయేవరకూ మాస్టరు వీవరు పాత్ర అనివార్య మొక్కటేగాక సహజసిద్ధం కూడాను.

యిట్లని స్వంతంగానేసే, లేదా కూలికినేసే చేనేతకార్మికులు అప్రధానులనికాదు. ప్రస్తావనా సందర్భముగా మాస్టరు

పీవరు పాత్రనుగురించి చెప్పవలసిన దృష్ట్యా చర్చించుకున్నామే గాని ప్రతివారికి యథోచితమయిన పాత్ర, బాధ్యత వుండనే వున్నది.

ఇక మాస్టరు పీవర్లుగూడా సోదర చేనేతకార్మికులపట్ల సౌజన్యభావంతో ప్రవర్తించవలసి వుందనే మాటనుకూడా కాదనలేము. ఈ విధంగా ఉభయులూ పరస్పర సహకార, విశ్వాసాలతో ప్రవర్తించాలి.



పదవ ప్రకరణం.

# ఆలిండియా హాండులూం ఫాబిక్స్ (బట్టల) మార్కెటింగు కో-ఆపరేటివు సొసైటీ.

అంతర్రాష్ట్రీయ, అంతర్దేశీయ మార్కెట్లను వెతకడం, ఉపయోగించుకోవడం, చేనేత పరిశ్రమాభివృద్ధికి చాల అవసరం. ఒక రాష్ట్రంలోని సరుకును ప్రస్తుతం మాస్టరు వీవర్లు వర్తకులు యితరరాష్ట్రానికి తీసుకొనిపోయి వ్యాపారం చేస్తున్నారు. యిలాగునే స్టేటు సొసైటీలు గూడ చేస్తున్నాయిగాని అది చాల స్వల్పం. పరరాష్ట్రములకు పరదేశాలకు భారీఎత్తున ఎగుమతులు చేసే వ్యాపారానికి అనువైన ఒక అఖిల భారత సహకార సంస్థ నిర్మాణం అవసరమేనని సూత్రప్రాయంగా 1953 సం॥లో అ. భా. చే. బోర్డు స్థాయీసంఘం అంగీకరించింది. ఒక చిత్తు ప్రణాళికను గూడ తయారు చేసింది. వివిధ స్టేటు సొసైటీలు, రాష్ట్రప్రభుత్వ వ్యాపారసంస్థలు (స్టేటు ట్రేడింగు ఆర్గనైజేషన్సు) తమతమ అభిప్రాయములు తెలుపవలసినదిగా—ఈ స్కీమును గురించి—కోరబడినవి. యిట్టి పెద్ద మార్కెటింగు సొసైటీ స్కీమును ప్రారంభించేముందు అంతర్రాష్ట్రీయ, అంతర్దేశీయ వ్యాపారం దీనిద్వారా పెద్దఎత్తున జరిగి సవ్యంగా సాగుటకు తగిన అవకాశము లెట్లున్నవో ప్రత్యేకంగా పరిశీలించబడింది.

తుదకు 26-8-1954 తేదీన స్థాయీసంఘ సమావేశంలో ఈ సంస్థను ఏర్పరచాలని ప్రభుత్వానికి సిఫార్సు చేస్తూ తీర్మానించబడినది.

ప్రభుత్వం ఆమోదించినతర్వాత 22-3-55 తేదీన బొంబాయిలో ఈ సంస్థ స్థాపించబడినది.

ఇందులో మాస్టరు వీవర్లు, చేనేతబట్టల వ్యాపారస్తులు సభ్యులుగా చేరవచ్చును. షేరువాటా 1కి రు. 1000-0-0 చెల్లించవలెను. కాని, వీరికి ఓటింగు హక్కు వుండదు. దీనిలో ప్రాథమిక చేనేత సొసైటీలు కూడా సభ్యులుగా చేరవచ్చును. వీటి షేరువాటా రు. 500/-లు. స్టేటు సొసైటీల షేరు 1కి రు. 5000 లు. ఇట్లు మూడు తరగతులుగా వాటాదార్లు వర్గీకరింపబడినారు. ప్రాథమిక, స్టేటు సొసైటీలకు ఓటు హక్కు ఉండును.

ఈ సొసైటీ తనకుతానుగా ఏ ఉత్పత్తి చేయదు. కాని, సొసైటీలనుండి, మాస్టరు వీవర్లనుండి, వ్యాపారస్తులనుండి నగదుకుగాని, అప్పుపద్ధతినిగాని సరుకునికొని అమ్ముతుంది. లేదా సరుకు విల్వచేసి ముందుగా కొంత అడ్వాన్సుయిచ్చి అమ్మినతర్వాత తాను కొంత కమిషన్ తీసికొని బాకీని పైసలాయితీ చేస్తుంది. ఈసంస్థ షోరూములు, ఎంపోరియములు వగైరా లేర్పరచుటకు భవనములు స్వంతంగా కట్టుకోవచ్చును.

లేక అద్దె (బాడుగ) కు తీసికొనవచ్చును. (యిట్టి అధికారం స్టేటు సొసైటీలకు ప్రస్తుతం లేదు).

ఈ సొసైటీ బొంబాయిలో దాదాభాయి నౌరోజీ రోడ్డునందు ఒక పెద్ద భవనమునందు స్థాపించబడినది. చిల్లర అమ్మకానికి ఒక పెద్ద షో రూము ఏర్పరచబడినది. లోపల భాగంలో టోకువ్యాపారానికి సంబంధించిన ఆఫీసులు, గొడౌనులు వున్నవి.

మాస్టరు వీవర్లు సప్లయిచేసిన సరుకును ఈ మార్కెటింగు సొసైటీలో కొన్నవారికి (చిల్లరగాగాని, టోకుగాగాని) రు. 1-0-0 కు 0-1-6 రిబేటు యివ్వబడుతున్నది. ప్రాథమిక సొసైటీలు సప్లయి చేసిన సరుకును ఈ మార్కెటింగ్ సొసైటీ ద్వారా కొనేవారికి రు. 1-0-0 కు 0-2-0 రిబేటు యివ్వబడుతున్నది. అందువల్ల అదివరకు బొంబాయి వర్తకులు నేరుగా ఏ కోయంబత్తూరు మాస్టరు వీవరువద్దనో చేనేతబట్టను కొనే పద్ధతిని ఈ సొసైటీవచ్చిన తర్వాత మార్చుకొన్నారు. యిప్పుడు ఆ కోయంబత్తూరు వర్తకునివద్దకే బొంబాయి వర్తకుడు స్వయంగా పోయి తనకు కావలసిన రకములన్నీ ఎంచుకొని తన పేరుకు పార్సెలును ఎగుమతిచేయించకుండా ఈ మార్కెటింగు సొసైటీకి పంపించుమని కోరుతున్నాడు. తాను మళ్ళీ బొంబాయి చేరుకొని ఈ సొసైటీకి డబ్బు యిచ్చి పార్సెలు డెలివరీ తీసుకొంటున్నాడు. తద్వారా రు. 1-0-0 కు 0-1-6

రిబేటును ఈ సొసైటీనుండి పొందుతున్నారు. *

స్టేటుసొసైటీ ఈ మార్కెటింగు సొసైటీకి సరుకులు సప్లయి చేస్తే రు. 100 కి రు. 3-2-0 మాత్రమే లాభంగా గాని, కమీషన్‌గాగాని వేసుకొని సప్లయి చేయవలెను. ఒక వేళ ప్రాథమిక సొసైటీయే నేరుగా మార్కెటింగు సొసైటీకి సరుకులు సప్లయి చేసినప్పటికిన్నీ స్టేటు సొసైటీకి రు. 100-0-0 కి 1-9-0 చొప్పున యివ్వవలసివుంటుంది. అయితే ఈ 1-9-0 నూ ప్రాథమిక సొసైటీబిల్లునుండి తగ్గించబడదు. కాని, మార్కెటింగు సొసైటీయొక్క కొనుగోలు ధరలో కలుపబడును.

అమెరికా మొదలయిన ఇతర దేశములనుండి చేనేత బట్ట కొనేటందుకు వచ్చినవారు ఈ మార్కెటింగు సొసైటీతో సన్నిహిత సంబంధం పెట్టుకుంటున్నారు. ఇతర దేశస్థుల అభిరుచులను ఈ సొసైటీ తనకు సప్లయిచేసే ఉత్పత్తిదారులకు తెలియజేస్తున్నది. అదివరకు వర్తకులు చేనేతగుడ్డను నేరుగా ఎగుమతి చేసేవారు. యిప్పుడు ఈ మార్కెటింగు సొసయిటీ ద్వారా ఎగుమతి చేస్తున్నారు. విదేశాలలోనికి దిగుమతి చేసుకొంటే రు. 1-0-0 కు 0-1-0 రిబేటు యివ్వబడుతున్నది.

* ఈ విధంగా చేయడానికి కారణమేమంటే "రిబేటు" పద్ధతి కేవలం సహకార ఉత్పత్తులమీదనే గాకుండా సహకారేతర ఉత్పత్తులమీద కూడా యిచ్చేటందుకు యిది మార్గం. చేనేతబట్టను కొనినట్లు నిదర్శనం కొరకే మార్కెటింగ్ సొసైటీ పేర పార్శిలు కట్టడానికి కారణం. ఈ నిదర్శనం చూచి "రిబేటు" యిస్తారన్నమాట. తర్వాత మార్కెటింగు సొసైటీవారు అసలు ఉత్పత్తిదారునికి వ్రాసి ఆ సరుకు మొత్తం ఖరీదునుబట్టి రు. 1-0-0 కు ఇంత అని కొంత కమీషన్‌ను పొందుతారు. అంటే చేనేతబట్టను తాను మధ్యవర్తిగావుండి అమ్మించినట్లు దీనికి తాత్పర్యం.

పదకొండవ ప్రకరణం.

# ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో * పూర్వ ఆంధ్రజిల్లాలలోని చేనేత పథకాలు.

ప్లానింగు కమీషన్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి కార్యక్రమాలకు ఖర్చుపెట్టేనిమిత్తం ఆంధ్రరాష్ట్రానికి రు. 125 కోట్ల రూపాయలు నిర్ణయించినది. ఆంధ్ర శాసన సభలో ఈ అంకెకు మించకుండా పథకాలు తయారుచేసి ప్యాసు చేయబడినది. ఇందులో పరిశ్రమకు రు. 10 కోట్లు అనగా 8% కేటాయింపబడినది.

ప్రత్యేకంగా చేనేతపరిశ్రమకు 1956-61 ఈ 5 సం॥లో ఖర్చుపెట్టుటకుగాను దీనినుండి రు. 2 కోట్ల 43 లక్షల 52 వేలు ఏర్పాటయింది.

---

* యిందులో తెలంగాణాప్రాంతం చేర్చబడలేదు. ఆంధ్ర అంటే 31—10—56 నాటిది.

| నెం. | స్కీముల పేర్లు | 1956–57 | 1957–58 | 1958–59 | 1959–60 | 1960–61 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ప్రాథమికసొసైటీలకు వాటాధనం, పెట్టుబడి రుణంక్రింద | 17ల 9వే | 16ల55వే | 25ల99వే | 12ల45వే | 9ల97వే | 77ల 5వే |
| 2. | అభివృద్ధి పరికరములు, నిర్మాణము, సిబ్బంది ఖర్చులు | 13ల75వే | 13ల38వే | 13ల50వే | 13ల50వే | 13ల55వే | 67ల68వే |
| 3. | విజయవాడలోని స్టేటుసొసైటీయొక్క ఎంపోరియములు మొదలగువాటియొక్క అభివృద్ధికొరకు. | 9ల38వే | 10ల 6వే | 10ల78వే | 11ల52వే | 12ల 5వే | 53ల79వే |
| 4. | రిబేటు | 10ల | 10ల | 10ల | 10ల | 10ల | 50ల |
| | మొత్తం | 50ల22వే | 49ల99వే | 50ల27వే | 47ల47వే | 45ల57వే | 243ల52వే |

(ల. లక్షలు—వే. వేలు)

## పని, లేక ఉత్పత్తి లక్ష్యములు.

| నెం. | అభివృద్ధి ప్రణాళికలు | మానం లేక పరిమాణం | 1956-57 | 1957-58 | 1958-59 | 1959-60 | 1960-51 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | సొసైటీలలో క్రొత్తమగ్గాల చేరిక. | సంఖ్య | 5000 | 5000 | 5000 | 5000 | 5000 | 25000 |
| 2. | బట్టల ఉత్పత్తి | లక్షలగజాలు | 241 | 276.12ల | 31.31ల | 393.39ల | 693.30ల | 1635.12ల |
| 3. | టెక్నిక్ అభివృద్ధి:— | | | | | | | |
| | యినపపన్నెలు | సంఖ్య | 1980 | 1980 | 1980 | 1980 | 1980 | 9900 |
| | టేక్ మోషన్ పరికరములు | ,, | 396 | 396 | 396 | 396 | 396 | 1980 |
| | పడుగు యంత్రములు | ,, | 132 | 132 | 132 | 132 | 132 | 660 |
| | ఫ్రేం లూమ్సు | ,, | 330 | 330 | 330 | 330 | 330 | 1650 |
| | పెడల్ లూమ్సు | ,, | 198 | 198 | 198 | 198 | 198 | 990 |
| | కోయంబత్తూర్ మగ్గాలు | ,, | 660 | 660 | 660 | 660 | 660 | 3300 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| డాబీలు | ,, | 1320 | 1320 | 1320 | 1320 | 1320 | 6600 |
| పెరిపెటెటిక్ పార్టీలు | ,, | — | — | — | — | — | — |
| ప్యాటర్న్ మేకింగ్ ఫ్యాక్టరీలు | ,, | 3 | — | — | — | — | 3 |
| మేస్త్రీలు (ప్రదర్శన కేంద్రాలు) | ,, | 66 | — | — | — | — | 66 |
| 4. స్టేటు సొసైటీ మార్కెటింగు నిర్మాణము విస్తరణ. | | | | | | | |
| గుడ్డల అమ్మకం | ల. గజాలు | 60 | 72 | 84 | 144 | 146 | 506 |
| అమ్మకం ఎంపోరియములు | సంఖ్య | 11 | 11 | 11 | 11 | 6 | 50 |
| సెంట్రల్ డిపోలు | ,, | 1 | 1 | 1 | 1 | 1 | 5 |
| సిటీ ఎంపోరియములు | ,, | 1 | 1 | 1 | 1 | 1 | 5 |
| మోటారు వ్యానులు | ,, | 1 | 1 | 1 | 1 | 1 | 5 |
| రీజినల్ మార్కెటింగ్ ఆఫీసులు | ,, | 2 | — | — | — | — | 2 |

## ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తెలంగాణా చేనేత పథకాలు.

ప్లానింగ్ కమీషన్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తము రు 105 కోట్లు నిర్ణయించినది. హైద్రాబాద్ స్టేటు శాసనసభలో ఈ అంకెకు మించకుండా పథకాలను తయారుచేసి ప్యాసు చేయబడినది. ఇందులో గ్రామీణ మరియు చిన్నతరహా పరిశ్రమలకు రు. 6 కోట్లు కేటాయించబడినది. అందులో ప్రత్యేకంగా చేనేత పరిశ్రమాభివృద్ధి పథకాలకుగాను రు. 1,35,00,000 కేటాయింపబడినది. ఈ పథకాల వివరాలు క్రింది టేబిలులో వివరించబడినవి.

పూర్వ హైద్రాబాద్ స్టేట్ మొత్తానికి సంబంధించిన ఈ దిగువ చేనేత పథకాలను ప్రత్యేక తెలంగాణాకు వీటిలో నూటికి 80 వంతులుగా మదింపు వేసుకోవలెను.

| నెం. | పథకములు | 1956-57 | 1957-58 | 1958-59 | 1959-30 | 1960-61 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1. | 10000 మగ్గాలకు ఏటా 100-0-0 వంతున ఉత్పత్తి పెట్టుబడులు. | 1000000 | 1000000* | 1000000 | 1000000 | 1000000 | 5000000 |
| 2. | షేరు కాపిటలు | 50000 | 50000 | | | | 100000 |
| 3. | సరఫరా, మార్కెటింగ్ హోల్‌సేల్ డిపోలకు యిప్పటి 4 గాక మరి 6 డిపోలకు ఒక రాష్ట్రాంతర డిపోకు. | 150000 | 160000 | 150000 | 150000 | 150000 | 750000 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 4. మగ్గాల అభివృద్ధి, మార్పిడి పనిముట్లు, డాబీలు, టేక్ అఫ్ మోషన్, పెడలు మగ్గాలకు | 150000 | 150000 | 150000 | 150000 | 150000 | 750000 |
| 5. రంగుల అద్దకం కార్ఖానాలు. | 120000 | 120000 | 120000 | 120000 | 120000 | 761000 |
| 6. ప్రకటన, ప్రచారం, బహుమతులు నమూనాలకు. | 10000 | 10000 | 10000 | 10000 | 10000 | 50000 |
| 7. క్యాలండరిగ్ బ్లీచింగ్ ప్లాంటులు | 300000 | | | | | 300000 |
| 8. 150 ఉత్పత్తి, విక్రయ సొసైటీల నిర్వహణ వ్యయము నెలకు 100-0-0 చొప్పున (రెండేండ్లకు) | 180000 | 180000 | | | | 360000 |
| 9. సహకార నూలుమిల్లు నిర్మాణానికి (హైద్రాబాదుకు) | 2000000 | | | | | 2000000 |
| 10. క్షేమనిధి | 60000 | 60000 | 60000 | 60000 | 60000 | 300000 |
| 11. గృహనిర్మాణం (2 ఏండ్లకు) | 300000 | 300000 | | | | 600000 |
| 12. రిబేటు. | 940000 | 600000 | 400000 | 200000 | | 2140000 |
| 13. వ్యవస్థీకరణ ఖర్చులు. | 110000 | 110000 | 110000 | 110000 | 110000 | 550000 |
| మొత్తం | | | | | | రు. 1,35,00,000 |

పన్నెండవ ప్రకరణం.

# ఆంధ్రప్రదేశ్‌లో సహకారోద్యమం.

20 వ శతాబ్దారంభంనుండి మరీ పతనమైపోతున్న చేనేత పారిశ్రామికుల సహాయంకోసం అధికారుల రిపోర్టులలో ప్రభుత్వాం అర్థించబడుతుండేది. ముఖ్యంగా 1930 ప్రాంతంలో ఆర్థిక సంక్షోభదశలో తీవ్రంగా దెబ్బతినిన చేనేతపరిశ్రమకు కొద్దిగా నైనా సహాయం చేయవలెనని "టారిఫ్ బోర్డు" (సుంకాలను సిఫారుసుచేసే సంఘం) వ్రాసింది. 1933 జూలైలో సిమ్లాలో యిండియా ప్రభుత్వాం పరిశ్రమల సమావేశం జరిపి అందులో చేనేత పరిశ్రమను గురించి చర్చించింది. దాని నిర్ణయాల ననుసరించి అప్పుడు అమలులోనున్న విదేశీ నూలు దిగుమతులపై వసూలుజేసే సుంకమునుండి (పౌనుకు 0-0-3 చొప్పున 50 వ నెంబరువరకు) కేటాయించి తద్వారా సాలుకు వచ్చే రు. 5 లక్షలు చేనేతపరిశ్రమ అభివృద్ధికి 1934-35 కేంద్ర బడ్జెటులో కేటాయించినారు. దీనినుండి నాటి అవిభక్త మద్రాసు ప్రభుత్వానికి రు. 26500 మాత్రం వచ్చింది. దానితో 1935 సంll లో చెన్నరాష్ట్ర చేనేతసహకార సొసైటీ స్థాపించబడినది. దానికి ఆ సంవత్సరమే 40 అనుబంధ ప్రాథమిక సొసైటీలు ఏర్పడినాయి.

నాటినుండి క్రమక్రమంగా అభివృద్ధిపొంది 30-6-1953 తేది నాటికి 213672 మగ్గాలు కలిగిన 1133 ప్రాథమిక సొసైటీలు దీనికి అనుబంధముగా నున్నవి. 1952-53 సం॥లో ఈ ప్రాథమిక సొసైటీలు రు. 4 కోట్ల 86 లక్షల విలువగల గుడ్డను ఉత్పత్తిచేసి రు. 5 కోట్ల 6 లక్షల విలువగల గుడ్డను విక్రయించినవి. స్టేటుసొసైటీ ఎంపోరియముల ద్వారా రు. 92 లక్షల విలువగల గుడ్డను కొన్నది. రు. 103 లక్షల విలువగల గుడ్డను విక్రయించినది.

14-9-1953 న ఆంధ్రరాష్ట్ర సహకార సొసైటీ దీని నుండి విభాగింపబడినది. ఆంధ్రస్టేటు సొసైటీలో 626 ప్రాథమిక సొసైటీలున్నూ 108318 మగ్గాలున్నూ ఆనాడు వుండినవి. తర్వాత 31-12-1956 నాటికి 681 ప్రాథమిక సొసైటీలున్నూ, సుమారు 125000 మగ్గాలున్నూ కలిగియున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము 1-11-1956 న ఏర్పడిన తర్వాత తెలంగాణా వున్న హైదారాబాదుస్టేటు సొసైటీ యున్నూ, విజయవాడలో వున్న ఆంధ్రస్టేటు సొసైటీయున్నూ విలీనం అయి నూతనస్టేటు సొసైటీగా మారవలసివుంది. కాని లెక్కలు తేలనందున, ఆడిట్ కానందున ఈపని యింకా జరగ లేదు. త్వరలో జరిగేటట్టు కూడ కనిపించదు. అందువల్ల తెలం గాణాలోని సహకార చేనేత సొసైటీల నిర్మాణవ్యవస్థ విడి గానూ, ఆంధ్రలోని వ్యవస్థ విడిగాను వ్రాయవలసివచ్చినది.

## ఆంధ్రలో.

ఆంధ్రలో సహకార సంఘముల రిజిస్ట్రారువారి యాజమాన్యమున సెస్సు ప్రణాళికలు నిర్వహింపబడుతున్నవి. ఈ ప్రణాళిక క్రింద 30-6-1955 వరకు 14858 మంది క్రొత్తగా సహకార సొసైటీలలో సభ్యులుగా చేర్చుకోబడినారు. వీరికి షేరుధనం అప్పుక్రింద రు. 362510 లు యివ్వబడినది.

30-6-55 నాటికి 117000 మగ్గాలు 665 ప్రాథమిక సొసైటీలలో చేరివున్నవి. వాటికి రు. 52 లక్షల 11 వేలు షేరుధనమున్నది. రు. 40 లక్షల 38 వేలు క్షేమనిధిని (రిజర్వు ఫండు) కలిగివున్నవి. క్రొత్తమగ్గాలకు రు 200 ల చొప్పున వడ్డీలేని అప్పుగా రు 722000 మాత్రం యివ్వబడింది. జిల్లాలలోని సహకార సెంట్రల్ బ్యాంకులు చేనేత సొసయిటీల యొక్క ఆర్థిక స్వాస్థ్యాన్ని సందేహిస్తూ సహకారం అంతగా చేయకపోవడమువల్ల ఈ పద్దుక్రింద రు. 18 లక్షలు శాంక్షన్ అయినప్పటికీ రు. 7 లక్షలు మాత్రమే పంచబడింది.

ఈ ఋణములను తిరిగి వసూలుచేసే బాధ్యత బ్యాంకులదై యున్నది. అందులో కొంత వసూలుకాక నష్టంవస్తే బ్యాంకులే భరించవలెనని మొదట్లో ప్రభుత్వం చెప్పింది. బ్యాంకులకు వడ్డీలేకుండా ప్రభుత్వంనుండి వచ్చిన డబ్బుపై వడ్డీ కట్టి చేనేతవారికిచ్చినందువల్ల ఆ వచ్చిన లాభంనుండి ఈ నష్టమును భరించుమని చెప్పింది. బ్యాంకులు ఈ సమాధానంతో

సంతృప్తిపడలేదు. అందువలన వచ్చిన నష్టమును బ్యాంకులు ప్రభుత్వము చెరిసగం పంచుకొనే పద్ధతిలో ఒక ఏర్పాటు జరిగింది.

గుంతకల్లు సహకార నూలుమిల్లు :—

సుమారు రు. 43 లక్షల పెట్టుబడిలో ఈ మిల్లు కట్టబడింది. ఈ డబ్బంతా ప్రాథమిక చేనేత సొసయిటీలు, స్టేటు సొసయిటీ యిచ్చినది. ప్రస్తుతము 12000 కదుళ్లుమాత్రం పనిచేయుచున్నవి. 24000 కదుళ్ళకు తక్కువగావుంటే లాభసాటిగా పనిచేయదని నిపుణుల అభిప్రాయము. మరొక 12000 కదుళ్ళు అమర్చుటకు రు. 15 లక్షలు కావలెను. దీనినిమిత్తము ప్రస్తుతము రు. 10 లక్షలు అప్పుగా సెన్సుఫండునుండి శాంక్షన్ అయింది.

## నూలు ఉత్పత్తికిగల అవకాశములు.

ప్రత్తి వ్యాపార కేంద్రములలోకెల్లా పెద్ద కేంద్రములు గుంతకల్లు, ఆదోనిపట్టణములు.

1950–51 నాడు ఆంధ్రలో 86000 బేళ్ళ (బేలు 1కి 400 పౌనులు) ప్రత్తి ఉత్పత్తి అయితే 1955–56 నాటికి 95000 బేళ్ళకు పెరగగలదని అంచనా. దీనిని 1960–61 నాటికి 115000 బేళ్ళకు పెంచాలని నిర్ణయించబడినది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రత్తి వ్యవసాయదారుల సహాయ కార్యక్రమాలకు రు 585000 లు కేటాయించబడినవి.

1955–56 లో ఆంధ్రలో 5760 బేళ్ళు (బేలు 1కి 400 పౌనులు) నూలు తయారు కాగలదని అంచనా.

ప్రస్తుతం (1955–56) 56000 కదుళ్ళు పనిచేస్తున్నవి. 1960–61 నాటికి 193000 కదుళ్ళకు పెంచవలెనని ప్లాను వేయ బడినది.

1955 నాటికి ఆంధ్రలో పండిన ప్రత్తిలో 8 వ వంతు మాత్రమే ఆంధ్రలోని నూలు మిల్లులలో వినియోగింపబడు చున్నది. మిగతా 7 వంతులు కోయంబత్తూరు, అహమ్మదా బాదు, విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

భారతదేశంలో బట్టల ఉత్పత్తి శక్తికి నూలు ఎంత అవ సరమో అంతగా నూలు తయారు కావడంలేదనిన్నీ, అందు వలన బట్టలమిల్లులను పెంచకపోయినా నూలు మిల్లులను పెంచ వలెనని మొదటి పంచవర్ష ప్రణాళికలోనే చెప్పబడింది. అంతే గాక పెంచే నూలు మిల్లులు చేనేత కుపయోగపడుటకుగాను వీలయినంతవరకు సహకార ప్రాతిపదికపై పెంచాలని ఆదేశించ బడినది.

కాని, ఆంధ్రలో ఈ ఆదేశములు అంతగా అమలు జర గలేదు. మొదటి పంచవర్షప్రణాళికా కాలంలో ఆంధ్రలో అద నపుకదుళ్ళు అమర్చినట్లుగా కనిపించదు. ఒకవైపున ఆంధ్రచేనేత వారికి కావలసిన నూలుకోసం పరరాష్ట్రములమీద, పరదేశ ములమీద ఎంతగానో ఆధారపడవలసివస్తున్నది. మరొకవైపున

ఆంధ్రలో పండించబడిన ప్రత్తి యిక్కడ వినియోగం లేనందున పరరాష్ట్రాలకూ, పరదేశాలకు ఎగుమతి అవుతున్నది. ఇంకొక వైపున యిప్పుడు ఆంధ్రలోవున్న ఏడు మిల్లులు లాభసాటిగా పనిచేయవలెనంటే మిల్లు ఒకటికి 25000 కదుళ్ళను కలిగియుండవలెను. ఈలెక్కన 7 మిల్లులకూ 175000 కదుళ్లు కావలసి వుండగా ఈమాత్రం పనికూడా ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో సాధింపలేదు. ప్రస్తుతము ఈ ఏడింటిలోను 53000 కదుళ్ళుమాత్రమే వున్నాయి.

ప్రస్తుతం యిక్కడ ఉత్పత్తి అవుతున్న ప్రత్తిలో 8 వ భాగమును మాత్రమే ఈ 56000 కదుళ్ళు వాడుతున్నాయి. కాని మొత్తము ప్రత్తిఅంతా యిక్కడ (ఆంధ్రలో) నే వినియోగముకావాలంటే 448000 కదుళ్ళు కావలసివుండును.

అనగా లాభసాటిపని చేయగల 25000 కదుళ్ళకు ఒక మిల్లు చొప్పున, యిలాంటి 18 మిల్లులకు కావలసిన ప్రత్తిని ఉత్పత్తి చేసేశక్తి ఆంధ్రకు కలదు. నిజంగా అన్నిమిల్లులు అమలులోనికివచ్చి పనిచేసినప్పటికీ ఆనూలును ఉపయోగించుకొనే సామర్థ్యం ఆంధ్ర చేనేతవారికికలదు.

ప్రస్తుతం ఆంధ్రలోవున్న (ప్రభుత్వ లెక్కల ప్రకారం) 3 లక్షల మగ్గాలు రోజుకు 6 గజాలు చొప్పున సాలుకు 300 రోజులు పనిచేస్తే 54 కోట్లగజాలగుడ్డ ఉత్పత్తి కాగలదు. ఒకపౌను నూలుకు సగటున నాలుగు గజాలగుడ్డ తయా

రయ్యే పద్ధతిని 13½ కోట్లపౌనుల నూలు అనగా 337500 బేళ్ళు (బేలు 1కి 400 పౌనులు) నూలు కానలసివుంకును.

ప్రస్తుతము సాలును 5760 బేళ్లు నూలు మాత్రమే తయారగుచున్నది.

నూలు ఉత్పత్తివ్యవస్థ అపసవ్యంగా వుండడంవలన మార్కెట్లో ధరలు ఒక జూదంగా మారిపోతున్నవి. ఉదాహరణకు ఆదోని ఒకానొక రకందూది పుట్టి (14 మణుగులు) 1కి 1954 సంllలో రు 500 లు ధరవుండగా అదేరకం 1955 లో రు 200 లకు ధర పడిపోయినది. కాని ఈ దూదితో తయారయ్యే నూలు పెట్టె (10పౌ.) 1కి ఏ 1-0-0 లేక 1-8-0 కంటే తగ్గ లేదు. ధరనిర్ణయం యింత చక్కగా వున్నది.

ఒకవైపున "ప్రణాళికలు" అనే పేరుతో కార్యకలాపములు; మరొకవైపున ఏరంగంలోనూ అరాజకత్వమును అరికట్ట లేక పోతున్నాము. అవకాశములను పటుతరంగా వినియోగించుకోవడంలో ప్రభుత్వం విఫలమయినందున వున్న ఉత్పత్తి శక్తులుగూడా ఉపయోగంలోనికిరాక మూలుగుతూ ఉండిపోతున్నాయి. నిరుద్యోగము సాధ్యమయినంత మేరకుగూడా నివారించలేక పోతున్నది. ఈవిధంగా ఈకార్యక్రమం అమలు జరిగితే వేలకొలది పారిశ్రామిక కార్మికులకు లక్షలాది చేతి వృత్తుల వారికి పనిపాట్లు కలిగి వారి బ్రతుకు ఒకవిధంగా గడవడం సాధ్యమవుతుంది.

వస్త్రవిక్రయశాలలు :

ప్రాథమిక సొసయిటీలు ఉత్పత్తిచేసిన గుడ్డను స్టేటు సొసయిటీకొని వివిధ జిల్లాలలో సుమారు 75 ఎంపోరియములు పెట్టి వాటిద్వారా ఈ బట్టను అమ్ముతున్నది. 1954-55 లో ఈ డిపోలద్వారా జరిగిన అమ్మకము. రు. 5606183 లు.

సెంట్రల్ గొడౌనులు :

ఆంధ్రస్టేటు సొసయిటీ ఏర్పడునాటికి తిరుత్తని, రాజమండ్రిలలో మాత్రమే రెండు సెంట్రల్ గొడౌనులు (బట్టను నిలువచేసి వుంచే కేంద్రాలు) వుండేవి. తర్వాత సెస్సుఫండు క్రింద మరి ఆరుచోట్ల యివి స్థాపింపబడినవి. ఆ 6 చోట్లు యివి:— విజయనగరం, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు.

వీటిలో వర్తకులకు టోకుగా బట్టలు విక్రయించుటకు గూడా కృషి జేయబడుతున్నది.

యితర రాష్ట్రములలో డిపోలు :

ఆంధ్రస్టేటు సొసయిటీ ఏర్పడునాటికి సికిందరాబాదు, హైదరాబాదులలో మాత్రం రెండు రాష్ట్రాంతర డిపోలు వుండేవి. తర్వాత సెస్సుఫండు సహాయంతో వరంగల్లు, కటక్ (ఒరిస్సా), ఖరగ్‌పూర్, బెంగుళూరులలో యివి ఏర్పరచబడినాయి.

మోటారు వ్యానులు :

స్టేటు సొసయిటీక్రింద నాలుగు వ్యానులున్నవి. యివి సంచార విక్రయడిపోలుగా పనిచేస్తున్నవి. డిపోలులేని గ్రామాలకువెళ్ళి చక్కగా ప్రచారము, విక్రయం చేస్తున్నవి.

రి బే టు :

సహాకార సంఘములకు మాత్రమే పరిమితమైయున్న ఈ రిబేటు 30-6-1955 వరకు ప్రాథమిక సంఘాలు మొత్తంగా తాము విక్రయించిన బట్టపై రు 1125935 లు రిబేటు యివ్వబడింది. రు 50 లకు మించని బిల్లుపై (చిల్లర అమ్మకానికి) రు 1-0-0 కు 0-1-6 చొప్పున రిబేటు యిస్తున్నారు. అఖిల భారత చేనేతబోర్డు జరుపు అఖిలభారత చేనేత సప్తాహ సమయాలలో మాత్రము 1-0-0 కు 0-2-0 చొప్పున ఆ ఏడు రోజులు యివ్వబడుతున్నది. స్టేటు సొసయిటీయొక్క సేల్సు డిపోలలో 1-4-1954 నుండి 30-6-1955 వరకు రు 577533 లు రిబేటు యివ్వబడింది.

టేక్ ఆఫ్ మోషన్ పరికరములు :

ఇది పేకపోగులు అంగుళంలో యిన్ని మాత్రమే ఉండాలంటే ఆవిధంగానే వచ్చేటట్టు చేయుసాధనం. ప్రస్తుతం చేనేత పారిశ్రామికులు పైవిధంగా ఒకే సంఖ్యలో పేకపోగులు రావడానికి చాల శ్రమ, చాలకాలం శిక్షణ అవసరం. ఇంతశ్రమ లేకుండా వుండేటందుకే యీ పనిముట్టు.

ఈ ప్రణాళికక్రింద చేనేత సొసయిటీలకు 500 పరికరములు సరఫరా చేయుటకు శాంక్షన్ అయినది.

యారన్ టెస్టింగు మిషన్ :—

ఈ యంత్రం రాష్ట్ర సొసైటీతో వుంది. నూలుయొక్క బలమును, మంచి చెడ్డలను పరీక్షించుటకు ఈ యంత్రము ఉపకరించును. రాష్ట్ర సొసయిటీ విరివిగా నూలుకొని ప్రాథమిక సొసైటీలకు డిపోలద్వారా సప్లయి చేస్తున్నందున యిది చాల అవసరం.

నూలు అద్దకపు కార్ఖానాలు :—

యంత్రసహాయంతో ఆధునిక పద్ధతులలో రంగులు వేయుటకు రాష్ట్రమంతటికీ పెద్దవయిన ఎమ్మిగనూరు, ఏలూరు సొసయిటీలకు ఈ కార్ఖానాల నిర్మాణానికి రు. 72289 లు మంజూరయినది.

హాండులూం ప్యాట్రన్ మేకింగ్ ఫ్యాక్టరీస్ (చేనేత బట్టల నమూనాలు తయారుచేయు ఫ్యాక్టరీలు) :—

ఈ ప్రణాళికక్రింద 8 ఫ్యాక్టరీలు మంజూరైనవి. 1. పుల్లంపేట (కడపజిల్లా) 2. మంగళగిరి (గుంటూరుజిల్లా) 3. ఏలూరు (ప. గోదావరి) 4. పెడన (కృష్ణాజిల్లా) 5. వెంకటగిరి (నెల్లూరు జిల్లా) 6. పొందూరు (శ్రీకాకుళం) 7. పాయకరావుపేట

(విశాఖ) 8. బండార్లంక (తూర్పుగోదావరి) రాజమండ్రి యిది వరకే ఒకటున్నది.

క్యాలండరింగు మిషన్ :—

మంగళగిరి (గుంటూరుజిల్లా) లో స్థాపించుటకు బట్టను నునుపు (ఫినిషింగ్) చేసే ఒక పెద్ద క్యాలండరింగు యంత్రాన్ని నెలకొల్పుటకు సెస్సుఫండు నుండి ధనసహాయం చేయబడింది. ఇది 1957 లో స్థాపింపబడింది.

కాకినాడలో, పెద్దాపురం కమ్యూనిటీ ప్రాజెక్టు ఏరియాలో చేనేత పైలెట్ (పురోగామి) స్కీము:—

1955 మేలో సిమ్లాలో జరిగిన డెవలప్ కమీషనరుల సమావేశంలో చేసిన సిఫార్సును ప్రభుత్వం అంగీకరించి కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రదేశములలో దేశంలో 25 చోట్ల కుటీర పరిశ్రమల అభివృద్ధికి తీవ్ర కృషి చేయ నిశ్చయించింది.

ఆ ప్రకారం కాకినాడ-పెద్దాపురం. క.ప్రా. ప్రాంతంలో ఈ పనికి ఒక పైలట్ ప్రాజెక్టు ఆఫీసరుగారు ఏర్పడినారు. పరిశ్రమలశాఖ, సహకారశాఖ, అ. భా. చే. బోర్డు, ప్రజాప్రతినిధుల సహకారంతో వీరు 1956-59 ఈ 3 సంవత్సరములకు ఒక పైలట్ స్కీము తయారుచేయగా దాన్ని ప్రభుత్వం శాంక్షన్ చేసింది.

ఈ స్కీము పిఠాపురం తాలూకాలోని చేనేత బుటా చీరలు తయారుచేసే ఉప్పాడచుట్టూ మూలపేట, అమీనా బాద, కొత్తపల్లి ఈ గ్రామాలకు పరిమితమై వుంటుంది. మూడేండ్లలోను మొత్తము 900 మగ్గములు సహకార సొసయిటీలలోనికి తీసుకొనుటకు పేరువాటూ, వర్కింగ్ కాపిటలు శాంక్షన్ చేయబడినది. క్రొత్త పనిముట్లకు కూడా తగినంత కేటాయించబడినది. ఒక చేనేత ఉత్పత్తి ట్రెయినింగు సెంటరు క్రొత్తగా స్థాపించుటకు రు. 38000 లు యివ్వగా స్థాపించ బడింది.

ఈ స్కీము క్రిందనే రాపర్తి, సామర్లకోట, పెద్దాపురం, వేట్లపాలెం గ్రామాలలో శిల్కు చేనేత సొసయిటీల అభివృద్ధికి మూడేండ్లలో వినియోగించుటకు రు. 1,75,000 లు శాంక్షన్ అయింది.

ఆంధ్రరాష్ట్రములో అక్కడక్కడగల శిల్కు చేనేత పరిశ్రమకు కావలసిన పడుగులు, పేకలు ముడిశిల్కు కొని తయారు చేసేనిమిత్తం ఒక పెద్ద శిల్కు త్రోయింగు ఫ్యాక్టరీని సామర్ల కోటలో రు. 3 లక్షల రూపాయల ఖర్చుతో స్థాపించుటకు ప్రభుత్వము ప్లానులు తయారు చేస్తున్నది. ఆంధ్రకు వివిధ స్కీములకుగాను 1953-55 రెండేండ్లకుగాను రు. 88 లక్షలు శాంక్షన్ కాగా రు. 63 లక్షల 63 వేలు మాత్రమే ఖర్చు కాబడింది. (అనగా 100 కి 72% వాడుకొన్నారు).

# ఆంధ్రరాష్ట్రంలో జిల్లాల వారీగా ప్రాథమిక చేనేత సొసైటీలు, వాటి వివరములు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| నెం | జిల్లా పేరు | డిప్యూటీ రిజిస్ట్రారుల ప్రాంతము | సొసైటీల సంఖ్య | పనిచేస్తున్న మగ్గాల సంఖ్య | చెల్లించిన షేరు వాటాలు రూ॥లు. | 31-12-56 నాటికి వున్న సొసైటీలు |
| 1. | శ్రీకాకుళం | శ్రీకాకుళం | 32 | 4264 | 206164 | 37 |
| 2. | విశాఖ | విశాఖపట్నం | 38 | 7769 | 359626 | 39 |
| 3. | తూర్పుగోదావరి | కాకినాడ | 74 | 10570 | 587143 | 107 |
| | | రాజమండ్రి | 31 | 9325 | 483997 | |
| 4. | పశ్చిమగోదావరి | భీమవరం | 38 | 3306 | 524654 | 62 |
| | | ఏలూరు | 16 | 4372 | 177248 | |
| 5. | కృష్ణ | విజయవాడ | 22 | 2067 | 102638 | 50 |
| | | మచిలీపట్నం | 25 | 1266 | 164982 | |
| 6. | గుంటూరు | గుంటూరు | 45 | 6811 | 158321 | 114 |
| | | బాపట్ల | 70 | 6388 | 468336 | |
| 7. | నెల్లూరు | నెల్లూరు (ఉత్తరం) | 44 | 1750 | 163991 | 70 |
| | | నెల్లూరు (దక్షిణం) | 26 | 1908 | 108723 | |
| 8. | కడప | కడప | 53 | 5505 | 212477 | 59 |
| 9. | కర్నూలు | కర్నూలు | 20 | 5120 | 206578 | 68 |
| | | నంద్యాల | 48 | 1461 | 123403 | |
| 10. | అనంతపురం | అనంతపురం | 18 | 1489 | 92474 | 21 |
| 11. | చిత్తూరు | చిత్తూరు | 53 | 3853 | 621719 | 54 |
| | | మొత్తం | 653 | 77224 | 4762474 | 681 |

ఈ టేబిలులోని 7 వ కాలం తప్ప మిగిలినవన్నీ ఆంధ్ర దేశ చేనేత సహకారసంఘం విజయవాడవారి 14-9-53 నుండి 30-6-54 వరకుగల పరిపాలనా నివేదికనుండి తీసికొనబడినవి. 7వ కాలంలో పేర్కొన్నవిధంగా దరిమిలా సొసైటీలసంఖ్య 681 అయినది. అంటే 28 సొసైటీలు ఎక్కువైనాయన్నమాట. వాటి మగ్గాలు, షేరు వాటాలు మొదలైన వివరాలు లభ్యం కాలేదు. కాని ఆంధ్రలోగల సుమారు మూడు లక్షల మగ్గాలలో సహకార రంగంలోనికివచ్చిన సుమారు 125000 మగ్గాలలో పైన టేబిలు 5 కాలంలో పేర్కొన్నవితప్ప తక్కిన సుమారు 47000 మగ్గాలు పనిచేయడంలేదని తెలుసుకో వచ్చును. ఆంధ్రదేశ చేనేత సహకార సంఘంలో వ్యక్తిగతంగా వున్న సభ్యులు (రు 1000-0-0 షేరుగలవారు) 28 గురున్నూ, 48 సహకార సంస్థలు సభ్యులుగాను వున్నారు.

## తెలంగాణాలో.

1947 కు పూర్వమే నూలు రేషనింగు పద్ధతి అమలులో నున్న కాలంలో "నూలు పంపకపు సహకార సొసైటీలు" పెట్టుకొమ్మని హైదరాబాదు ప్రభుత్వం చేనేతవారిని ప్రోత్సహించినది. నాలుగు సంవత్సరాల స్వల్పకాలంలో రాష్ట్రంలోని (అంటే అవిభక్త హైదరాబాదుస్టేటు) చేనేత పనివారలలో 100 కి 90 మంది వీటిలో చేరారు. వీటన్నింటికి కేంద్రసంస్థగా

పనిచేయడానికిగాను 1950 లో హైదరాబాదులో కేంద్రచేనేత సహకార సొసైటీ నిర్మింపబడింది.

తర్వాత 1-11-1956 న హైదరాబాదు స్టేటు విభాగింపబడి "ఆంధ్రప్రదేశ్" నిర్మాణమయింది. అందులో తెలంగాణా లీనమయింది.

తెలంగాణా ప్రాంతంలో ప్రత్తినూలు సొసైటీలు 93, ఉన్నివి 16, శిల్కువి 7 మొత్తము 116 సొసైటీలు వున్నవి.

యిందులో సుమారు 30 సొసయిటీలు ఉత్పత్తి, మరియు విక్రయ సొసయిటీలుగా మార్చబోతున్నారు.

రాష్ట్రాంతర సేల్సు డిపోలు :—

ఢిల్లీ, బొంబాయి నగరాలలో స్టేటుసొసైటీ రెండు డిపోలను ఏర్పరచింది.

మరియు సుప్రసిద్ధమయిన విహారక్షేత్రం ఔరంగాబాదులో గూడా సేల్సుడిపోను పెట్టింది.

నూలుపై కంట్రోళ్ళు రద్దయిన తర్వాత ఆర్థికమాంద్యం గూడా దాపురించిన తర్వాత తెలంగాణాలోని చేనేత సహకార సంఘాల పరిస్థితి తలక్రిందులైనది. తర్వాత వస్త్రోత్పత్తి, మార్కెటింగు కార్యక్రమాలు చేపట్టబడినవి. కాని, సెస్సు ఫండు సహాయం రాకముందు అంతగా పునర్నిర్మాణం కాలేక పోయినవి.

అవిభక్త హైదరాబాదు స్టేటుకు వివిధ స్కీములకుగాను 1953-55 రెండేండ్లలో రు. 47 లక్షలరూపాయలు అ. భా. చే. బోర్డు యివ్వగా రు. 37 లక్షల 70 వేలుమాత్రం ఖర్చుపెట్టుకొన్నారు. (అనగా 100 కి 80% వాడుకొన్నారు.)

1955 చివరన అవిభక్త హైదరాబాదుస్టేటులో 125 అమ్మకం డిపోలు కలవు. యిందులో 118 ప్రాథమిక చేనేత సొసయిటీలచే నడుపబడుచున్నవి. స్టేటు సొసయిటీచే 7 నడుపబడుతున్నవి. ఒక్కొక్క దుకాణం 1కి రు 1450 లు సరుకులు పెట్టే నిమిత్తం యినుప బీరువాలు, వగయిరాలకు సెస్సుఫండు సహాయ మివ్వబడింది.

రిబేటు :—

1-2-1954 నుండి 30-9-1954 వరకు 5 రకములకు మాత్రమే రిబేటు పరిమితం చేయబడింది. 1-0-0 కు 0-0-9 మొదలుకొని 0-1-6 వరకు రకానికొక విధముగా రిబేటు నిర్ణయించబడింది. 1-10-54 నుండి అన్ని రకములకు 1-0-0 కు 0-1-6 ఒకే విధంగా యిస్తున్నారు.

మోటారువ్యాను :—

ఒక మోటారు వ్యానుకు సినిమా ప్రొజక్టరుగూడా తగిలించి ప్రచారం - చేనేతను గురించి - చేయించుతున్నారు.

హైదరాబాదు రేడియోలో చేనేతగురించి ప్రసంగములు చేయ బడుతున్నవి.

సెస్సుఫండు ప్రణాళికలు ఆంధ్రలోవలె సహకార శాఖ క్రింద కాకుండా పరిశ్రమల శాఖక్రింద జరుగుచున్నవి.

స్టేటు సొసయిటీవారు ఈ మధ్యనే హైదరాబాదులోని ఒక పాత నూలుమిల్లును సుమారు రు. 7 లక్షలకు కొనింది. యింకా పని ప్రారంభించలేదు. దీని మరమ్మతులు, అభివృద్ధికీ ప్రాథమిక సొసైటీలనుండి షేరువాటాల వసూలుకు ప్రత్యేక కృషి జరుగుతున్నది. సెస్సుఫండునుండి అప్పుకొరకై దరఖాస్తు పెట్టబడింది. సంవత్సరానికి 6400 నూలు బేళ్లు ఈ మిల్లులో ఉత్పత్తి లక్ష్యంగా పెట్టుకోబడినది.

క్యాలండరింగు యంత్రం, బ్లీచింగ్‌ప్లాంటు :—

ఈ క్యాలండరింగు యంత్రమును, బ్లీచింగు ప్లాంటును మంగళగిరిలో ఆంధ్ర స్టేటు సొసయిటీ స్థాపించినది. పరిశోధనా లయం గూడ దీనికి జతపరుస్తారు.

1. టెక్స్టయిలు మిల్లులు :—

హైదరాబాదు నగరంలో "హైదరాబాదు స్పిన్నింగు అండు వీవింగు మిల్లు" 1874 లో స్థాపించబడినది. దీనిలో

యంత్రాలు చాలా పాతవి. లాభాలు రావనే సాకుతో దీని యజమానులు ఈ మధ్య మూసివేశారు. ఈ మిల్లునే స్టేటు కొన్నది. నడపడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి.

2. అజంజాహి మిల్సు; వరంగల్ :—

యిది 1931లో స్థాపించబడింది. ఇందులో 36136 (1954 సం॥లో) కదుళ్ళు వున్నాయి. 750 పవర్ మగ్గాలు కూడా వున్నాయి.

3. డి. బి. ఆర్. మిల్సు. హైదరాబాదు :—

1929 స్థాపించబడింది.

రెయాన్ (కృత్రిమపట్టు) ఫ్యాక్టరీ :—

ఆర్టిఫిషల్ శిల్కు (కృత్రిమపట్టు), ఇది 1946 లో స్థాపించబడింది. 1949 లో సవ్యమయిన మార్గంలో పెట్టుటకు ఇండస్ట్రియల్ ట్రస్టుఫండు క్రింద ప్రభుత్వం తెచ్చి రు. 4 కోట్ల 31 లక్షల పెట్టుబడి పెట్టింది. స్థానిక పెట్టుబడిదారులు, ప్రజా సంస్థలు వ్యతిరేకిస్తున్నప్పటికీ దీని మేనేజింగు ఏజెన్సీ బిర్లా బ్రదర్సు వారికి అప్పగించబడింది.

## తెలంగాణాలో జిల్లాలవారీగా (ప్రత్తినూలు) సొసైటీలు, వాటి షేరువాటాలు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| నెం | జిల్లా పేరు | సొసైటీలు | వాటాల సంఖ్య | వాటాధనం రు. |
| 1. | కరీంనగర్ | 28 | 29157 | 874710 |
| 2. | మెదక్ | 14 | 9516 | 285480 |
| 3. | నల్లగొండ | 21 | 17721 | 531630 |
| 4. | నిజామాబాద్ | 8 | 8530 | 255900 |
| 5. | వరంగల్, ఖమ్మం | 19 | 21050 | 631500 |
| 6. | మహబూబ్ నగర్ | 9 | 11838 | 355140 |
| 7. | హైదరాబాదు | 1 | 2994 | 89820 |
| 8. | ఆదిలాబాదు | 4 | 1872 | 55160 |
| 9. | గుల్బర్గా తెలుగుప్రాంతం | 6 | 5799 | 173970 |
| 10. | బీదర్ తెలుగుప్రాంతం | 3 | 1229 | 36860 |
| | మొత్తం | 93 | 109706 | 3291180 |

## తెలంగాణాలో సిల్కు సొసైటీలు, వాటి షేరు వాటాలు.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| నెం | జిల్లా పేరు | సొసైటీలు | వాటాల సంఖ్య | వాటాధనం రు. |
| 1. | నిజామాబాద్ | 1 | 215 | 21500 |
| 2. | మెదక్ | 2 | 101 | 10100 |
| 3. | గుల్బర్గా తెలుగుప్రాంతం | 4 | 384 | 38400 |
| | మొత్తం | 7 | 700 | 70000 |

తెలంగాణాలో ఉన్ని చేనేత సొసైటీలు, వాటి షేరువాటాలు.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| నెం | జిల్లా పేరు | సొసైటీలు | వాటాల సంఖ్య | వాటాధనం రు. |
| 1. | కరీంనగర్ | 8 | 2275 | 22750 |
| 2. | వరంగల్ | 2 | 1325 | 13250 |
| 3. | మెదక్ | 1 | 409 | 4090 |
| 4. | మహబూబ్‌నగర్ | 4 | 2577 | 25770 |
| 5. | నిజామాబాద్ | 1 | 400 | 4000 |
| | మొత్తం | 16 | 6986 | 69860 |

తెలంగాణాలో మొత్తం చేనేత సొసైటీలు, వాటి షేర్లు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| నెం | స్వభావం | సొసైటీలు | వాటాల సంఖ్య | వాటాధనం రు. |
| 1. | ప్రత్తి | 93 | 109706 | 3291180 |
| 2. | సిల్కు | 7 | 700 | 70000 |
| 3. | ఉన్ని (ఊలు) | 16 | 6986 | 69860 |
| | మొత్తం | 116 | 117392 | 3431040 |

(తెలంగాణాకు చెందిన పైటేబిల్సును సికిందరాబాదు దేశోద్ధారక గ్రంథమాలవారు ప్రచురించిన "తెలంగాణం" అనే పుస్తకంనుండి గ్రహించబడినవి)

—~~~~—

పదమూడవ ప్రకరణం.

# శిల్క్ చేనేత పరిశ్రమ

కోఆపరేటివ్‌లద్వారా ద్వితీయ ప్రణాళికలో సహాయం :

దేశం మొత్తంమీద రెండు లక్షల మగ్గాలున్నవని అంచనా. అన్ని రాష్ట్రములకంటె హెచ్చుగా అస్సాంలో వున్నవి. అ. భా. చేనేతబోర్డు 1956-61 నాటికి తయారుచేశిన స్కీములలో ఆనాటికి 72 వేల మగ్గాలను సహకార సంఘాలలో చేర్చవలెనని వ్రాశారు. మగ్గము 1కి షేరు కాపిటలు రు 100 ల్కుగాను మింజువలె రు 87-8-0 లు అప్పుగా ప్రభుత్వమిస్తుంది. యిదిగాక మగ్గము 1కి రు 500 లు వర్కింగ్ కాపిటలు (పెట్టుబడికి) గాను యిస్తుంది. 72 వేల మగ్గాలకూ రు 3 కోట్ల 60 లక్షలు అయింది. యిదిగాక (Takeup motion) టేకప్ మోషన్ అటాచిమెంటు వగయిరాలు సప్లయి చేయడానికి అయే ఖర్చుల్తోసహా మొత్తము రు 5 కోట్లు కేటాయించారు. కాని, అ. భా. గ్రామీణ చిన్నతరహా పరిశ్రమల బోర్డువారు సూచించిన ఈ మొత్తాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో బాగా తగ్గించివేసి, రు 150 లక్షలు మాత్రమే శాంక్షన్ చేశారు.

కేంద్ర శిల్కుబోర్డు బాధ్యత :

శిల్కు పురుగులను పెంచడం మొదలుకొని మగ్గంమీద గుడ్డనేసే నిమిత్తము శిల్కుదారం చేసేవరకు ఆపరిశ్రమను అభివృద్ధిచేసే బాధ్యత ఆలిండియా సెంట్రల్ శిల్కుబోర్డు వారిది. శిల్కుగుడ్డ అమ్మకంపై – ప్రత్తి నూలు గుడ్డకువలె – రిబేటు యివ్వరు. నేతనేయడం మొదలుకొని ఆతర్వాతి దశలలో ఈ పరిశ్రమను అభివృద్ధిచేసే బాధ్యత అ. భా. చేనేత బోర్డువారిది.

1954 నవంబరు 7 తేదీని విశాలాంధ్ర దినపత్రికలో శిల్కు పరిశ్రమగురించి ఈ రచయిత వ్రాసిన వ్యాసంలో అనేక విషయాలు నేటికి నిలబడతాయి గనక దానిని దిగువున యివ్వడమైనది.

చైనాతో ఒడంబడిక :

భారతదేశాన్నుండి చైనా 90 లక్షల పౌనుల వర్జీనియా పొగాకు దిగుమతి చేసుకోడానికి, చైనానుండి మనదేశం 90 టన్నుల ముడి సిల్కు వగైరా దిగుమతి చేసుకోడానికి 19–10–54 న ఢిల్లీలో భారత – చైనాలమధ్య వర్తకపు ఒడంబడిక జరిగింది. ఇది పొగాకు రైతులు కోలుకోడానికి ఉపయోగపడుతుందని కొందరి పరిశీలకుల అంచనా.

ఒక ఎగుమతి సరుకుతో మరొక దిగుమతి సరుకును ముడిబెట్టి చేసుకొనే విదేశ వ్యాపారంలో మన సరుకును పంపడానికి ఎన్ని అవకాశాలు కల్పించేమో, ఎంత ఉత్సాహం

జూపేమో, వారి సరుకు దింపడానికికూడా అన్ని అవకాశాలు కల్పించుకోవాలి. అంత ఉత్సాహాన్ని చూపాలి. అట్టి సమానావకాశాలు లేకపోతే వ్యాపారం ప్రతిష్టంభనలోపడి ఒడంబడిక అమలు జరగదు.

సుంకాల ప్రతిబంధకం :

ముడిసిల్కు దిగుమతులు రద్దుచేసే సంకల్పంతో మన ప్రభుత్వం నూటికి 30 ధరవారీ సుంకమునూ, పౌనుకు రు 3-14-0 తూకంవారీ సుంకమున్నూ, యీ రెండూగాక ఒక్కొక్కపట్టికి మొత్తం దిగుమతిసుంకం ఎంతవుతుందో దానికి నూటికి 5 అదనపు సుంకమున్నూ మొత్తం మూడు బాపతుల సుంకాలను విధించింది.

ఈ సుంకాల ప్రతిబంధకంవల్ల ముడిసిల్కు రాక, వచ్చినా ధరగిట్టక, తూర్పుగోదావరి జిల్లాలోని పెద్దాపురం, సామర్లకోట, వేటపాలెం, కాకినాడ, పశ్చిమ గోదావరిజిల్లా భగ్గేశ్వరంలో మొత్తం 15 సిల్కు ప్రాసెసింగ్ మిల్లులు, సుమారు 8000 చేమగ్గాలు సాలుకు 2 లక్షల పౌనుల సిల్కు వాడేవి – ఏడెనిమిది ఏళ్ళనుండి సంక్షోభానికి గురి అయినాయి. ఈ 15 మిల్లుల మిషనరీ, ప్లాంట్ ఖరీదు 10 లక్షల రూపాయిలు. చిన్న పెట్టుబడిదారులంతా దివాలాతీసే స్థితికి వచ్చేరు. మిషనరీ తుప్పుపట్టి పోయింది. మిల్లులలో పనిచేసే కార్మికులు 700 మంది. వీరిమీద ఆధారపడిన ముసిలి, ముతక, బిడ్డ పాపతో

మొత్తం 2000 మందికి అసరాపోయింది. సిల్కు చేమగ్గాలు 8000 మీాద ప్రభుత్వ అంచనా ప్రకారమే మగ్గం 1కి అయిదు మంది చొప్పున మొత్తం 40,000 మందికి దారుణమైన సంక్షోభం. సుమారు 40 సంవత్సరముల నుండి సిల్కే ఆధారంగా బ్రతుకుతున్నవారికి ఈ దిగుమతి సుంకం పెద్ద గొడ్డలి పెట్టయింది. ఇలాగునే సూరత్, బెంగుళూరు, బెనారస్, కంచి, లూధియానా, బర్హాంపూర్ మొదలైన సిల్కు చేనేత కేంద్రాలన్నీ దెబ్బతిన్నాయి.

నేటికీ యీ దారుణమైన సుంకం అమలులో వుండడం వల్ల ఢిల్లీలో ఎన్ని కొత్త ఒడంబడికలమీాద సంతకాలు జరిగినా చైనా ముడిసిల్కుమాత్రం ఎవరూ దిగుమతి చేసుకోరు. అసలు సిల్కు చేనేతవారి శ్రేయస్సుకై ఆ సుంకాన్ని రద్దుచేయవలసివుంది. ఇపుడు యీ పొగాకుతో ముడిపెట్టడంవల్ల ఆ పని అత్యంత ఆవశ్యకమైంది. అసెంబ్లీ, పార్లమెంటు సభ్యులు గమనించి ప్రభుత్వంపై ఒత్తిడి తేగలరని ఆశిస్తున్నాను. చేనేత సంఘం తరఫున పరిశ్రమలమంత్రికి తంతినిచ్చాము.

స్వేచ్ఛగా ముడిసిల్కును దిగుమతి కానిస్తే మన దేశంలో పురుగులను పెంచి సిల్కుతీసే పరిశ్రమ దెబ్బతినదా అన్న వాదన ఒకటి వుంది. ఈ ప్రశ్నతో "భారత సిల్కుపరిశ్రమ" యొక్క లోతుల్లోకి కొంతవరకు పోకతప్పదు.

## మన దేశంలో పట్టుపురుగుల పరిశ్రమ.

పట్టుపురుగుల పరిశ్రమ ప్రస్తుతం కాశ్మీర్, మైసూర్, మద్రాస్, బెంగాల్ నాలుగు రాష్ట్రములలో మాత్రమే దాదాపు సాలీనా 20 లక్షల పౌనుల సిల్కు నుత్పత్తి చేస్తూంది. కాని, మన దేశానికి కావలసిన మొత్తం పట్టు 30 లక్షల పౌనులని, 10 లక్షల పౌనులు మాత్రం తరుగు అని ప్రభుత్వ అంచనా.

ఈ తరుగు 10 లక్షల పౌనుల ఉత్పత్తిని పెంచడానికి కేంద్రప్రభుత్వం 1945 లోనే 'కేంద్ర సిల్కు అభివృద్ధి డైరెక్టరేట్' నొకదాన్ని ఏర్పరచి సంరక్షకమైన హెచ్చుజీతాలక్రింద, అర్థంలేని ఆఫీసర్ల సంచారాలక్రింద 1948 వరకు ఎంత డబ్బో వ్యయపర్చింది దానివల్ల పని జరగడంలేదని చెప్పి, స్థిరంగా పరిశ్రమలమంత్రి ఆధ్వర్యంక్రింద పనిచేయడానికి సెంట్రల్ సిల్కు-బోర్డు అక్టు (1948) ప్రకారం 1949 లో ఒక బోర్డు నేర్పర్చింది. నాటినుండి 1954 మార్చి నెలాఖరువరకు రు. 18½ లక్షల రూపాయలు రాష్ట్రాలకు గ్రాంటులిచ్చింది. 1952 లో సమీక్ష చేసుకోగా పని బాగా జరగడంలేదని గమనించి ఆ అక్టును సవరించి బొంబాయి టెక్స్టయిల్ కమీషనర్‌ను బోర్డు ఉపాధ్యక్షుణ్ణి చేసి ఆఫీసు బొంబాయికి మార్చారు. ఐనా అభివృద్ధి కనిపించడంలేదని 1953 లో ఆ అక్టును మరోమారు సవరించి పార్లమెంటు సభ్యులార్గురిని, వర్తక కార్మిక ప్రతినిధుల్ని కొందరిని బోర్డులోకి తీసుకొన్నారు. పరిశ్రమలమంత్రి బోర్డులో

వుంటే దాని తీర్మానాలకు కట్టుబడి వుండాలని చెప్పి అతన్ని బోర్డులో వుండనక్కరలేదన్నారు. బోర్డులో రెండు ఉపసంఘములు, స్థాయీ సంఘం, సాంకేతికాభివృద్ధి సంఘం, ఒక సాంకేతుకుణ్ణి రు. 25 వేలు వ్యయంతో జపాన్ పంపింది. అతనక్కడ చాల రోజులుండి తిరిగివచ్చాడు. ఇంకా అక్కడున్నారు. మరో 8 మందిని పంపడానికి నిర్ణయించింది.

ఒకవైపున (1934 లో సుంకం ప్రారంభించి క్రమంగా తర్వాత పెంచి) పెద్ద దిగుమతి సుంకంతో గోడకట్టి మన సిల్కు పురుగుల పరిశ్రమను రక్షించినా, మరోవైపున ఇన్నేళ్ళనుండి యిన్ని కమిటీలు దాని పోషణకు కృషిచేసినా చివరకిప్పటి కేస్థితిలో వుంది ?

## ముడిసిల్కుధర పెరుగుదల.

1953 జూలై 2 న వారు తమ స్థాయిసంఘతీర్మానంలోనే యిలా వ్రాసుకున్నారు: "ఇండియన్ ముడిసిల్కు ధర ప్రజలందుకోలేనంత హెచ్చుగా పెరిగిపోయింది. ప్రస్తుతం ప్రజల కొనుగోలుశక్తి ననుసరించి దాన్ని దించకపోతే యీ పరిశ్రమే నాశనం కావచ్చు." ఈ మాటలు తమ ప్రయోజకత్వం మీద తాము చేసుకొన్న వ్యాఖ్యగా మనం తీసుకోవచ్చు.

## లక్షలాది కార్మిక కుటుంబాలకు వృత్తిలేదు.

అనేక కోట్లరూపాయలు పెట్టుబడిగల వివిధరాష్ట్రముల లోని సిల్కు ప్రాసెసింగ్ మిల్లులను నాశనంచేసి ఆ మిల్లుల

లోను, సిల్కు మిగ్గాలలోను పనిచేసే లక్షలాది కార్మిక కుటుం బాల వృత్తిని ధ్వంసంచేసిన, ఈ దిగుమతి సుంకాన్ని తక్షణమే రద్దుచేయాలి. ఇన్నాళ్ళు బైమిచ్చి, ఇంతధనాన్ని వ్యయపర్చినా అభివృద్ధికి రాలేని పరిశ్రమ రక్షణకు అర్హమైనదేనా అని సాంకేతికాభివృద్ధికమిటీలోని ఒక సభ్యుడే అన్నాడు.

## వ్యాపారంలో ప్రతిష్టంభన.

మొత్తం పట్టుపరిశ్రమ ప్రయోజనాలకోసం కొంతవరకు దిగుమతులు కూడా అవసరమేనని 1952 లో బోర్డు సిఫారసుల ప్రకారం కేంద్ర ప్రభుత్వం ఒక విధానాన్ని అనుసరించింది. దాని ప్రకారం దిగుమతిదారుడు తానెంత మొత్తాన్ని స్వదేశీ ముడి సిల్కును కొంటాడో, అంత మొత్తానికి విదేశీ దిగుమతి పెర్మిట్ యిస్తామన్నారు. కాని ఇటు హెచ్చుదిగుమతి సుంకం వల్ల దాని ధర అంతరిక్షంలోకూడ వుంది. విదేశీ సిల్కుధర ఎలాగూ పెచ్చేగనక మనం తగ్గించడ మెందుకని స్వదేశీ ఫిలేచర్ మిల్లు యజమానులు కూడా తమ ధరలను అంతరిక్షాల లోనే నిలబెట్టారు. పెచ్చుధరవల్ల వ్యాపారం స్తంభించిపోయింది.

## పట్టుపురుగులు పెంచే రైతులకు నష్టం.

పోనీ యీ హెచ్చుధరవల్ల పల్లెలలో సిల్కు పురుగుల పెంపకాన్ని వుపవృత్తిగా ఎంచే పేదరైతులేమన్నా లాభం పొందుతున్నారా అంటే అదీలేదు. వారు పెంచిన పట్టుపురుగు లన్నీ ఫిలేచర్ మిల్లుకు రావలసిందే. చెరుకంతా పంచదార

ఫ్యాక్టరీకి, దూది అంతా నూలుమిల్లుకు వచ్చినట్టు కాశ్మీర్ రైతులు పురుగులు పెంచుతారు. వాటికి మేతగా మల్బరీ ఆకులను అడవుల్లోనుండి, స్మశానాలనుండి, బోడ్డుప్రక్క చెట్లనుండి తెచ్చి వేస్తారు. ఫిలేచర్ మిల్లు ప్రభుత్వపు గుత్త వ్యాపారం. ప్రభుత్వ సిల్కుశాఖవారు యీ యేడు పౌను 1కి రు. 2-8-0 చొప్పున సిల్కు పురుగులను రైతులనుండి కొన్నారు. కాని, ఆ పురుగుతిన్న ఆకులన్నీ ప్రభుత్వ భూములవేగనుక, ఖజానా మంత్రి ఒక పౌను సిల్కుకు రు. 6-4-0 చొప్పున సిల్కుమంత్రి పేర ఖర్చు వ్రాస్తాడు. సిల్కుమంత్రి ఆ ప్రకారమే ఖజానా మంత్రివల్ల జమకట్టుకుంటాడు. అదీ ఇదీ కలిపి మొత్తం అసలు ఖరీదు పౌను 1కి రు. 8-12-0 క్రింద లెక్క తెచ్చేరు. అవతల దిగుమతి సుంకరక్షణ వుండగా వీరి లాభానికి కొదవేమిటి? రైతుకు రు. 2-8-0 యిచ్చేబదులు రు. 5/- యిచ్చినా, అధికోత్పత్తికి దోహదం ఏర్పడివుండును. సిల్కుచేనేత సమస్యగూడా పరిష్కారమైవుండేది.

## ముడిసిల్కు ధర.

షాంగాకు-సిల్కు ఒడంబడిక వివరాలు తెల్పిన ఢిల్లీ విలేఖరి యీ నెలలో చైనాలో ముడిసిల్కుధర 28 షిల్లింగులుందని వ్రాశాడు. షిల్లింగ్ 0-12-6 చొప్పున పౌ॥ 1కి రు. 21-14-0 ఐంది. జపాన్‌లోగూడ ఈ నెల రేటు రు. 22-8-0, చైనాలో ధర 22/- స్టీమర్ ఖర్చులు రు. 1/- ఇక్కడ దిగుమతి

సుంకం ధరవారీ రు. 6-10-0, తూకంవారీ సుంకం రు. 3-14-0, పట్టీవారీ సుంకం రు. 0-8-0 వెరశి రు. 34/- అయింది. ఇది యుద్ధానికి పూర్వం రు. 10/- లోపు వుండేది. ఇపుడీ ధర గిట్టుబాటుకాక చేనేత సిల్కు పరిశ్రమంతా పతనమైంది.

## ఆంధ్ర ప్రభుత్వ కర్తవ్యం.

ఆంధ్ర ప్రభుత్వంగూడ పట్టు పరిశ్రమ విషయంలో కొంత పట్టించుకోవాలి. మన రాష్ట్రంలో ఇదెంతమందికి జీవనోపాధో తెలిపాను. ఇక్కడ సాలీనా షుమారు రు. 90 లక్షల వరకు పట్టుబట్టల ఉత్పత్తి జరుగుతూండేది. అందుచేత కేంద్ర సిల్కుబోర్డులో ఆంధ్రప్రభుత్వం ప్రాతినిధ్యం గోరాలి. ఇంతవరకు సిల్కు సమస్యను ఆ బోర్డు ఒంటికన్నుతోనే చూస్తోంది. పురుగుల పెంపకం, ఫిలేచర్ మిల్లు, ప్రాసెసింగ్ మిల్లు, సిల్కు చేనేత యీ నాలుగూ సిల్కు సమస్యలో భాగాలు. నాలుగు కోణములనుండి ఈ చిక్కును సమగ్రంగా పరిశీలించాలి. నాలుగింటిమధ్య యింతవరకు బాలెన్సు తప్పిపోవడంవల్ల ప్రజల వాఙ్మకంలో అసలుపట్టు అదృశ్యమైపోతూంది. మధ్య తరగతివారి స్మృతిపథంనుండిగూడ దూరమైపోయింది. ఆంధ్రలో పారాఛూట్ పట్టుగుడ్డ తయారుచేసి యుద్ధకాలంలో సైన్యానికిచ్చేం. శుద్ధ పట్టువస్త్రాలకే గాక ఆర్టు సిల్కుతో కలపడానికి, నూలుతో కల్పడానికి, అంచులలో అందాలకు దీన్ని చేనేతవారు విరివిగా వాడేవారు. నూలుకన్న ఎక్కువ మన్నిక వుంటుంది.

కనుక ఇప్పుడైనా ధర అందుబాటులోకి వస్తే ఆంధ్రప్రజలు మళ్ళీ ఆదరిస్తారు. [ప్రుగులోంచి తీసిన ఒక ఇంచిపట్టుదారం, ఆదే వ్రతనగల ఉక్కుతీగె లేక ఉక్కుపోగుకన్న బలంగా వుంటుంది.]

ఇవతల ఆంధ్రప్రభుత్వం పట్టించుకోలేదు; అవతల 1953-54 లో రు 16 లక్షలు సిల్కు బోర్డుకు మంజూరుచేస్తే ఖర్చుపెట్టే స్కీములు లేక రు 11 లక్షలు మాత్రమే వినియోగించేరు. సిల్కు చేనేతకుగూడ సహాయపడవలెనని సిల్కు బోర్డు ఆదేశించబడింది. ఆ ప్రకారం టస్సార్ సిల్కు చేనేత అభివృద్ధికి బోర్డునుండి గత సంవత్సరం ఒరిస్సా ప్రభుత్వం రు 13000/- తీసుకుంది. పెద్దాపురం సిల్కు చేనేత గురించి ఆంధ్ర ప్రభుత్వం అట్లా గ్రాంటుపొంది అభివృద్ధికి కృషిచేయ వచ్చుగదా!

సిల్కుబోర్డు విధానం ఫిలేచర్ మిల్లుల అధికలాభాల కుపయోగపడుతుందేగాని సిల్కు చేనేతవాని, సిల్కుబట్టవాడే వాని ప్రయోజనంపట్ల ఏ మాత్రం లక్ష్యం చూపడంలేదనే విమర్శకు గురియై, బోర్డువారు ఉభయతారకంగా వుండే సూచనలకు రాష్ట్రప్రభుత్వాలన్నిటిని గోరారు. ప్రతిరాష్ట్రంలో సిల్కుకు సంబంధమున్నవారి నందరిని సమావేశపరచి సమిష్టి అభిప్రాయాలను తెలుపుమన్నది. ఐనా ఆంధ్రప్రభుత్వం కదలలేదు.

ఆంధ్రలో పట్టుపురుగుల పరిశ్రమ అభివృద్ధికి అవకాశాలు.

ఆంధ్ర సిల్కు వస్త్రోత్పత్తికి తగినంత పట్టుపురుగుల పరిశ్రమ యిక్కడ నెలకొల్పుకోవచ్చు. శీతోష్ణ ఆటంకాలేమీ

లేవు. దీనికి ప్రత్యేక గ్రాంటులున్నాయి. మనం వాడుకోడం లేదు. ఆంధ్రప్రభుత్వం యిప్పటికైనా కదిలితే ఉన్న పరిశ్రమను పునరుద్ధరించుకోగలం; ఇంకా అభివృద్ధి చేసుకోగలం.

## ప్రాసెసింగ్ మిల్లులవారికి విజ్ఞప్తి.

ఆఖరున, ఆంధ్రలో సిల్కు ప్రాసెసింగ్ మిల్లుల వారికి చేనేత సంఘం తరఫున ఒక విజ్ఞప్తి:— గత మే నెలలో కలకత్తాలో అఖిలభారత చేనేత ఆర్గనైజింగ్‌కమిటీ ఏర్పడ్డప్పుడు "రాసిల్కు" ధర, దిగుమతిసుంకం మీద చర్చజరిగింది. పంజాబ్, బెనారెస్, కంచి, ఆంధ్ర మొదలైన తొమ్మిది కేంద్రములవారు తమ సాధక బాధకాలను పరస్పరం తెల్పుకున్నారు. దిగుమతి సుంకాలు రద్దుచేసి అవసరమైతే మన ముడిసిల్కు వుత్పత్తి రక్షణకు కొంత సబ్సిడీ యివ్వడం సక్రమమైన విధానమని ఒక తాత్కాలిక నిర్ణయానికివచ్చారు.

ముడిపట్టుధర కొంచెం పెరిగినా బెనారెస్, బెంగుళూర్ కంచి మొదలైన సెంటర్లు నిలబడగలవు. వారెక్కువ ఖరీదైన చీరలు నేస్తారు. పెద్దాపురంబట్ట సిల్కులోకల్ల ఖరీదు తక్కువైనది, మధ్యతరగతిది. ముడిసిల్కుధర పెరిగినంతనే ముందుగా దెబ్బతిన్నది పెద్దాపురమే.

దేశంలో ముడిసిల్కు ఉత్పత్తిపెరిగేవరకు దిగుమతి సుంకం రద్దుచేయమని, టారిఫ్ కమీషన్‌పైన ఢిల్లీ ప్రభుత్వంపైన కూడా ఒత్తిడి తేవాలి. ప్రభుత్వం లాభాలు చూసేది

అక్కడక్కడున్న కొద్దిపాటి కోటీశ్వరులకు, ఫిలేచర్ మిల్లు కామందులకు. కాని, కుటీరపరిశ్రమయైన పట్టుపురుగుల పరిశ్రమ రక్షణలేకపోతే రైతుల ఉత్పత్తి దెబ్బతింటుందని టారిఫ్ కమీషన్ సలహా ప్రకారం యీ హెచ్చు దిగుమతి సుంకాన్ని 1958 డిశంబరు వరకు పొడిగించుతున్నామని మొన్ననే పార్లమెంటులో పరిశ్రమల మంత్రి ప్రకటించాడు. ఆంధ్రసిల్కు మిల్లర్లలో చలనంలేనందున సిల్కుబోర్డులో ఎవరినో ఒకరిని సభ్యునిగా ఏబాధ్యత లేనివారిని, ఏసంగతి తెలియని వానిని వేస్తున్నది. ప్రభుత్వం ఈమధ్య ఢిల్లీలో ఒక పార్లమెంటు సభ్యునివద్దకు వెళ్ళి "మీరు సిల్కుబోర్డులో వున్నారుగదా! మీకాపరిశ్రమతో ఏమిసంబంధం? ముడిపట్టు ఉత్పత్తితోనా, సిల్కు నేతతోనా?" అంటే "నాకేమీ తెలియదు, దేనితోను సంబంధంలేదు, దానికి సంబంధించినవాళ్ళు ఎవరైనా ఏమైనా రాస్తే దాన్ని తీసుకెళ్ళి బోర్డులో చర్చకు సావకాశమంటూ ఎపుడైనా వస్తే వాడతాను" అన్నాడాయన. సంబంధంగల వాళ్ళలో చలనం లేనపుడు పైకమిటీలన్నీ బేపూచీగా వుండడంలో ఆశ్చర్యమేముంది?

ఆంధ్రలో పుగాకు దెబ్బతిన్నది. పొగాకు వ్యాపారులు, రైతులు కదిలారు. చైనానుండి గిరాకి వచ్చింది. పరిస్థితి కొంచెం చక్కబడే సూచనలు కన్పిస్తున్నాయి. ఆంధ్రలో సిల్కు దెబ్బతిన్నది. మిల్లర్లు, చేనేతవారు కదలాలి. చైనానుండి

చక్కని సావకాశాలు కన్పిస్తున్నాయి. అడ్డంకులు తొలగించు కోడానికి చైతన్యం, కార్యదీక్ష కావాలి.

ఎక్కువమందికి ఉపాధులు సులభంగా కలిగించే పరిశ్రమ.

శిల్కు పురుగులు పెంచే పరిశ్రమకు అనేక లక్షల కుటుంబాలకు ఉపవృత్తి ఉపాధి కల్పించడానికి అపారమైన అవకాశం వుంది.

మల్బరి, ఎరీ, టస్సార్, మోగా అని నాలుగు రకాల శిల్కులున్నాయి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొకరకం పెరిగే అవకాశంవుంది. నిరుద్యోగనివారణ ప్రధాన ఆశయంగాగల ఈ రెండవ ప్రణాళికాకాలంలో ఈ పరిశ్రమాభివృద్ధికి ప్రత్యేక విలువవుంది.

ప్రధాన సమస్య.

శిల్కుచేనేతవారి ప్రధాన సమస్య ముడిశిల్కుధర. ఎప్పుడూ "ముడిశిల్కు"ను దిగుమతి చేసుకొని మాత్రమే పరిశ్రమను నడపడం స్వతంత్ర భారతదేశానికి తగదు. ముడిశిల్కు ఉత్పత్తి ఖర్చుతగ్గాలి. విస్తారంగా ఉత్పత్తి కావాలి. ఈ రెండే పరిష్కారమార్గాలు.

ఈలోగా దిగుమతి సుంకాలు ఒక ప్రధాన సమస్యే. ముడి శిల్కు, ముడి కృత్రిమశిల్కువల్ల వచ్చే దిగుమతి సుంకాల ఆదాయం భారతప్రభుత్వానికి ఒకప్పుడు ముఖ్యమైన పద్దుగానే వుండేది. 1932–33 లో దిగుమతిసుంకాల మొత్తంలో యిది

7 శాతం. తరువాత దేశీయ ఉత్పత్తుల రక్షణకోసం సుంకాలు పెంచి దిగుమతులను నిరుత్సాహపరిచేరు. 1938–39 లో అది 4 శాతంకు తగ్గింది. యుద్ధంలో శిల్కు దిగుమతులన్నీ బంద్ అయినాయి. తరువాత దేశ పునర్నిర్మాణకృషిలో ఈ దిగుమతులిక పెరగనీయరాదనుకున్నారు. 1953–54 లో యీ శాతం 0.5 కు తగ్గిపోయి యీ ఆదాయం ఒక లెక్కలోనే లేదు.

దాదాపు పూర్తి కంట్రోలుక్రింద దిగుమతిఅయ్యే ముడిశిల్కు ఇపుడువుంది. కేంద్రప్రభుత్వంయొక్క విదేశ వాణిజ్య స్వంతసంస్థ అయిన స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ దేశాని కెంత కావాలనుకొంటే అంతే తెప్పించుతున్నది. యితరులెవరు తెప్పించడానికి వీలులేదు. ప్రభుత్వమే ధర నిర్ణయిస్తున్నది; ప్రభుత్వం ఏర్పర్చిన కేంద్ర శిల్కుబోర్డువారే దీనిని మార్కెటు చేస్తున్నారు.

హెచ్చు దిగుమతిసుంకాలతో కలిపి దీనిరేటు ఎక్కువగా వుండడంవల్ల దేశీయ ఫిలేచర్ మిల్లులు అనవసరంగా అధిక లాభాలు తీయడానికి ఉపయోగపడుతున్నదేగాని ప్రజలకు ఉపయోగంలేదు. చేనేతవారికీ ఉపయోగంలేదు. లాభాల మార్జిన్ అధికంగా వుండడంవల్ల తరుచు ముడిశిల్కు మార్కెటు ధరలలో ఎగుడుదిగుడులుగూడా వచ్చి వ్యాపారస్థులకు అస్థిర పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

ఈ సుంకం ఒక లెక్కకాదు కాబట్టి, దీనినింకా తగ్గించి శిల్కు చేనేతకు సహాయపడాలి. ప్రస్తుతం బెంగుళూర్ సైన్సు

ఇన్‌స్టిట్యూట్‌లో సాధించిన ఫలితాలు — ఎక్కువ ఆకులుగల, ఎక్కువ పోషకద్రవ్యాలుగల, కొత్తవిత్తనం శీఘ్రంగా ప్రచారం లోకి తేవాలి. ప్రస్తుతం పురుగుల పెంపకంలో అవుతున్న 60% ఆకులఖరీదు తగ్గితే ముడిశిల్కు ధర కొంత అందుబాటులోకి రావచ్చు. పాత చరఖాస్థానే కనిపెట్టబడిన కొత్తచరఖాను త్వరగా ప్రచారంలోకి తెస్తేగూడ శిల్కుధర తగ్గవచ్చు.

మొదటి పం॥ వ॥ ప్ర॥ కాలంలో అభివృద్ధి.

| | | | |
|---|---|---|---|
| ముడిశిల్కు ఉత్పత్తి స్కీముల క్రింద కేంద్రప్రభుత్వంచేసిన ఖర్చు. | | 1951-52 – | 1955-56 |
| | రు. | 1,42,000 – | 50,00,000 |
| ఫిలేచర్ శిల్కు ఉత్పత్తి – పౌనులు. | | 2,65,445 – | 3,28,500 |
| చరఖాశిల్కు ఉత్పత్తి – ,, | | 17,00,000 – | 21,00,000 |

ఆంధ్రప్రదేశ్‌లో యిదివరకు 100 యకరములలో మాత్రమే మల్బరీతోటలున్నాయి. అవి 2000 యకరాలకు పెంచడానికి రెం. పం. వ. ప్ర. సంకల్పించింది. ఇందులో చాలా మట్టుకు స్కీములు తెలంగాణా ప్రాంతంలోనే, నైసర్గిక పరిస్థితులవల్ల, అమలు జరుగుతాయి.

కాకినాడ పెద్దాపురం కమ్యూనిటీప్రాజెక్టు ఏరియాలో సామర్లకోటలో ఆంధ్రప్రదేశ్ శిల్కు కోఆపరేటివ్ చేనేతమగ్గా లన్నిటికి కావలసినంతమేరకు శిల్కుపడుగులు పేకలు తయారు

చేయడానికి, రంగులువేయడానికి పెద్ద థ్రోయింగ్ శిల్కుమిల్లు కేంద్ర శిల్కుబోర్డు కట్టడానికి ప్లానులు తయారైనాయి.

శిల్కుచేనేత కోఆపరేటివ్‌లలో తూ॥ గో॥ జిల్లాలో శిల్కు బట్ట చాలా నిలవవుండిపోయి నిరుద్యోగం దాపురించింది. స్టేట్ సొసయిటీకి నూలుగుడ్డలు విడుదలచేసే అవకాశమున్నట్టుగా యీ శిల్కుగుడ్డ విడుదలచేసే అవకాశంలేదు. కోఆపరేటివ్ రూల్సు ప్రతిబంధకమవడం ఒక కారణం. కోఆపరేటివ్‌లకు రివాజైన మార్కెటింగ్ వసతులు దీనికి ఉపయోగపడలేదు. దీనికి రివాజైన మార్కెటింగ్ వసతులను రూల్సు అంగీకరించవు. అందువల్ల ప్రభుత్వానికి వ్రాయగా పై స్థాయిలోనే యీ సమస్యను పరిష్కరించడానికి కృషి జరుగుతున్నది.



# పదునాల్గవ ప్రకరణం.

# చేనేతలో పట్టెమార్పుల పరిశ్రమ.



పట్టెమార్పు బట్టలకు రెండో పేరు "మెద్రాస్ హేండ్ కర్చిఫ్స్". హేండ్ కర్చిఫ్ అనగానే జేబురుమాలని కొందరు పొరబాటుబడతారు. జేబురుమాలంత చిన్నదిగాదు. మిల్లు నూలుతో చేతిమగ్గంమీద స్ఫుటమైన రంగులతో విరివిగా ఆంధ్రప్రదేశ్ లోను మద్రాస్ స్టేటులోను తయారై పశ్చిమ ఆఫ్రికా, దక్షిణ బ్రిటిష్ ఆఫ్రికా, వెస్ట్ ఇండీస్‌కు ఎగుమతి కాబడే వస్త్రం. అక్కడస్త్రీలు దీనిని కట్టుకుంటారు. ఆ స్త్రీలు ఈ బట్టలను ఎన్నడు తడపకుగనక కచ్చారంగులతోనే వీటి నిక్కడ నేస్తారు.

ఇటీవల పక్కారంగులలో కొన్ని రకాలిందులో నేసి అమెరికాకు పంపుతున్నారు.

సుమారు 100 సం॥ క్రిందట భారతదేశం ఈస్ట్ ఇండియా కంపెనీచే పాలింపబడే రోజుల్లో 3 మాసముల కొకపర్యాయం లండన్‌లో ఈ "పట్టెమార్పులు" వేలం పాడబడేది. బ్రిటిష్ వర్తకులు వేలంలో కొని ఆఫ్రికాకెగుమతిచేసుకొనేవారు. తరువాత బ్రిటిష్ వర్తకులు మద్రాస్‌కే వచ్చి కంపెనీలు పెట్టుకొని ఇక్కడ సరుకులుకొని లండన్ లివర్‌పూల్ మాంచెస్టర్ వర్తకు

లకు ఎగుమతి చేసేవారు. వారు మరల ఆఫ్రికాకెగుమతి చేసుకొనేవారు.

ఒకవిధంగా చూస్తే 1928 సం॥ వరకు మద్రాస్‌లో ఈ వ్యాపారమంతా రెండు విదేశీ కంపెనీలచేతిలో గుత్తవ్యాపారంగా వుండేదని చెప్పవచ్చు. తరువాత కొద్దిగా భారతీయ కంపెనీలు, ఒక కోఆపరేటివ్ సొసయిటి ఈ వ్యాపారరంగంలో ప్రవేశించినవి. భారతీయ కంపెనీలకు బ్రిటిష్ కంపెనీలకు పోటీ పెరిగింది. బ్రిటిష్‌వాళ్లు ఒక గడుసైన పనిచేసి భారతీయ కంపెనీలను గట్టి దెబ్బకొట్టేరు. ఇంగ్లండ్‌లో 1932 లో "రకాల రిజిస్ట్రేషన్" (పేటెంట్స అండ్ డిజైన్స్ఆక్టు) శాసనం సవరించుకున్నారు.

రిజిస్ట్రేషన్ కాబడడానికి ఒక వస్తువు ఇంగ్లండ్‌లోనే తయారు కావలెనని అదివరకు శాసనంలో వుంది. అక్కడ తయారు కాకపోయినా రిజిస్టరు చేయించుకోవచ్చునని సవరించేరు. బ్రిటిష్‌వారి వలసదేశం గనక నిగేరియా (పశ్చిమఆఫ్రికా) లో గూడా 1936 లో ఒక ఆర్డినెన్సు ప్యాస్‌చేయించి ఒకరకాన్ని ఇంగ్లండ్‌లో రిజిస్టరు చేయించినా, నిగేరియాలో రిజిస్టరు చేయించినా ప్రభుత్వం సమానంగానే గుర్తిస్తుందన్నారు. రెండోవారు ఆ రకాన్ని దిగుమతి చేయరాదన్నారు.

తమచేతిలో పనిగదా అని బ్రిటిష్ కంపెనీలు త్వరత్వరగా పట్టెమార్పులలో అనేక డిజైనులు తామై ఇంగ్లండ్‌లో రిజిస్టరు చేయించుకుని కూచున్నారు. భారతీయ కంపెనీలు సరుకు

తేగానే కొత్త శాసనం ప్రకారం కేసుపెట్టి పీడించేవారు. ఈ బాధలు పడలేక త్వరలోనే భారతీయ కంపెనీలు ఎగుమతి వ్యాపారరంగంనుండి తప్పుకున్నారు. "రకాలు రిజిస్టర్" చేయించుకున్న బ్రిటిష్ కంపెనీలు తమ కిష్టం వచ్చిన ధర నిర్ణయించినప్పటికి వారికే భారతీయ కంపెనీలు అమ్ముకునే అధోగతిలో పడ్డారు.

మరొకవైపున ఈ పట్టెమార్పుల వ్యాపారికి ఇంకొక ప్రమాదంగూడ తటస్థించింది. పవర్ మగ్గాలమీద దీని నకలు యూరప్‌లో అక్కడ అక్కడ తయారుచేసి పోటీచేయడం 1930 తర్వాత జరుగుతూవుంది.

| సం॥ | ఎగుమతియైన పట్టెమార్పు తానులు | |
|---|---|---|
| 1922 నుండి 1930 వరకు | సాలుకు దామాషాను | 32 లక్షలు |
| 1933 నుండి 1940 వరకు | సాలుకు దామాషాను | 14 లక్షలు |
| 1943 నుండి 1950 వరకు | సాలుకు దామాషాను | 5 లక్షలు |

పై అంకెలనుబట్టి 1950 నాటికి ఈ పరిశ్రమ చాలా పతనావస్థలో వున్నట్టు తేలింది.

ఇంగ్లండ్‌లో రెండవ ప్రపంచయుద్ధంవల్ల పెద్దదెబ్బ తగిలిం తర్వాత భారతదేశానికి స్వరాజ్యం వచ్చేక మరల కొంత

మార్పు వచ్చింది. చొరవ, తెలివి, డబ్బుగల కొన్ని భారతీయ కంపెనీలు ఇంగ్లండ్‌లోను నిగేరియాలోను పాత శాసనములు మారకపోయినాసరే "పట్టెమార్పు ఎగుమతి దారులుగా" కాలు నిలదొక్కుకున్నారు. 1955 నాటికి మద్రాస్‌లో యిట్టి కంపెనీలు 18 ఉన్నాయి. వీటిలో అయిదింటికి పశ్చిమాసియాలో అమ్మకం డిపోలున్నాయి. మిగతావారు ఆఫ్రికాతో వ్యాపారము చేసే ఇంగ్లండ్‌లోని కంపెనీలకు ఎగుమతి చేస్తారు.

మద్రాస్‌లోని ఎగుమతిదారులు విదేశమార్కెట్లలో అభిరుచుల్లో వచ్చిన మార్పులను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుంటారు. వాటినిబట్టి కొత్తడిజైనులు చిత్రిస్తారు. అవి నమూనాలుగా బెట్టుకొని నేయించమని మాస్టరువీవర్లకు నేరుగా గాని, ఏజంట్లద్వారాగాని ఆర్డరిస్తారు. మాస్టరువీవర్లు చేనేత వారికి నూలు, మజూరీయిచ్చి వీటిని నేయిస్తారు.

## ఉత్పత్తి కేంద్రాలు.

లుంగీలు కైలీలు కాంబోయిస్ సరాంగాలు నేయించి ధారాళంగా బర్మాకు, మలయాకు, సిలోన్‌కు ఎగుమతిచేసే కాలంలో ఈ పట్టెమార్పులు నెల్లూరు చెంగల్పట్టు రెండు జిల్లాల్లోనే కొద్దిగా ఉత్పత్తి అయ్యేవి. ఇటీవల ఆయాదేశాలకు లుంగీలువగైరా ఎగుమతి తగ్గిపోయినతర్వాత ఆమగ్గాలు పట్టెమార్పు నేయటం ప్రారంభించేయి. ఇపుడు ప్రధానమైన కేంద్రాలు గుంటూరు జిల్లాలో వేటపాలెం, దానిచుట్టూవున్న కొన్నిగ్రామాలు, నెల్లూరుజిల్లాలో కోవూరు, దానిచుట్టూ

వున్న కొన్ని గ్రామాలు, చిత్తూరుజిల్లాలో కాళహస్తి చిత్తూరు–మద్రాస్ స్టేట్‌లో ఆర్ని, ఆర్కాట్, గుడియాతం, కడలూరు, మేల పాలయం వగైరా.

1947 సం॥కు పూర్వం 10 వేల మగ్గాలు పట్టెమార్పులు నేస్తున్నట్టు అంచనా వేయబడింది. దరిమిలా క్రమంగా పెరిగి యిపుడు 40, 50 వేల మగ్గాలుండవచ్చునని అంచనా. నేటి పట్టెమార్పు మగ్గాలన్నీ పూర్తిపనిచేస్తే నెలకు 20 లక్షల గజాలు తయారుచేయగలవని అంచనా.

సాధారణంగా ఒకముక్క 36 అం॥ వెడల్పు X 8 లు పొడవు వుంటుంది. పడుగుకు నెం 30 నుండి 60 వరకు, పేకకు నెం 26 నుండి నెం 40 వరకు వాడతారు. ఆర్టుసిల్కు విరివిగా డోరియాలు, గళ్లు, నగిషీలు కోసం వీటిలో ఉపయోగిస్తారు.

అ. భా. కోఆపరేటివ్ చేనేత ఫాబ్రిక్సు సొసయిటి మాస్టరుపీసర్లువద్ద ఈసరుకుఅమ్మే విదేశములలో ఎక్కడైనా ఒక చోట పట్టెమార్పులనుకొని ఎంపోరియం పెట్టవచ్చు. స్టేట్ సొసయిటికూడ మరొక విదేశంలో ఈ సరుకు అమ్మేనిమిత్తం ఎంపోరియం పెట్టవచ్చు. బెనారస్ సరుకుఅమ్మేదానికి న్యూయార్కు (అమెరికా)లో ఎంపోరియం పెట్టినారు. పట్టెమార్పులకు స్థిరమైన సాంప్రదాయ సిద్ధమైన మార్కెటు. నిగేరియాలోఉండగా యింతవరకు అ. భా. చే. బోర్డు అక్కడ ఎంపోరియం ఎందుకు పెట్టలేకపోయిందో బోధపడదు.

---

## పదిహేనవ ప్రకరణం.

# పలురకముల మగ్గాలు.

### ఆర్థికదృష్ట్యా వాటి ప్రయోజనముల పరిశీలన.

చేనేత కార్మికునియొక్క బాధామయ జీవితగాథకు చేమగ్గం ప్రతీకమయినది. చేనేత కార్మికుడు, చేమగ్గం కూడా భారత జాతీయ జీవనంలోని ఒకానొక చైతన్య విశేషానికి సంకేతములు. * మానవ సభ్యత ఉదయించినప్పుడే ఈ చైతన్య స్రవంతి ♦ ప్రారంభమై 18వ శతాబ్దంవరకు కూడా చేనేత కార్మికులకు పేరు ప్రతిష్ఠలు, భాగ్యభోగ్యాలు ఆర్జించిపెడుతూ వచ్చింది. కాని, విదేశపాలనతోను, టెక్స్టైలు మిల్లు పరిశ్రమ అవతరణతోను ఈ ప్రవాహం శుష్కించసాగినది. చేనేత పరిశ్రమ ప్రజల జాతీయ పరిశ్రమ అనీ, నూలు వడకడమే భారతీయ మహిళామణుల వృత్తి అనీ శ్రీ ఆర్. పి. దత్ పేర్కొన్నారు.

---

* బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని భారతదేశంనుండి పారద్రోలడానికి జరిగిన దీర్ఘకాల జాతీయోద్యమానికి ధ్వజమయిన త్రివర్ణపతాకంలో చేమగ్గానికి ఉపసాధనమయిన రాట్నం ప్రతిష్ఠించబడడం - దేశంలోని పారిశ్రామిక సంకేతంగా మాత్రమేగాక - ఇట్టి చైతన్యవిశేషానికి సంకేతమై యుండనోపు.

♦ స్రవంతి = ప్రవాహము.

లాంకషైరు (ఇంగ్లాండు) బట్టల మిల్లుల శ్రేయస్సుకోసం చేనేత పరిశ్రమను అణచివేస్తూవచ్చారు. చేనేతవస్త్రాలకు అనాదిగా వుంటూవచ్చిన మార్కెట్టులు పోయాయి. దీనితో చేనేత పరిశ్రమలో నిరుద్యోగం పెరిగిపోయినది. వాణిజ్య చరిత్రలో యిట్టి సంఘటన అపూర్వమనీ, చేనేత కార్మికుల అస్థికల (ఎముకల)తో దేశమంతా తెల్లనైనదని 1834 సం॥లో అప్పటి గవర్నరు జనరల్ పేర్కొన్నాడు *

భారతదేశంలో పరాయిపాలన సాగినంతకాలం చేనేత కార్మికులు ఈ యమయాతనలను ఓర్మితో భరించారు. జాతీయ ప్రభుత్వం ఏర్పడిన పిమ్మటకూడా ఈచిక్కులు తొలగలేదు. 1952 లో ఈవిషమపరిస్థితి పరాకాష్ఠ నందుకొన్నది. నిరుద్యోగవ్యాప్తి, వలసలు, ఆత్మ హత్యలు, సత్యాగ్రహాలు, పికెటింగులు ప్రారంభమైనాయి. ఈ చేనేత కార్మికులు తమ సమస్యలు ప్రజల దృష్టికితేగా, ప్రభుత్వం వాటిని బాపడానికి కొన్ని చర్యలను గైకొన్నది. ♦ అప్పటినుండి ఈ ప్రాచీనపరిశ్రమపై అనేక రచనలు ప్రచురింపబడినాయి. కాని చేనేత పరిశ్రమలో వినియోగించబడే వలురకములైన చేమగ్గాలనుగురించి తెలుసు

---

* అఖిలభారత చేనేతబోర్డు నిర్మాణం మొదలగునవి.

♦ శ్రీరజనీ పామీదత్తుగారు రచించిన " నేటి భారతదేశం " ("ఇండియా టుడే") అన్న గ్రంథంలో భారతదేశంలో మహోన్నత కళాశిల్పమనదగిన చేనేత పరిశ్రమ 19 వ శతాబ్దారంభంనుండి ఎలా క్షీణించి పోయినదీ, చేనేత కార్మికుని దీనాతిదీనమయిన దుఃఖమయ గాథలను కళ్లు చెమ్మగిలే విధంగా వర్ణించబడినది. భారతదేశపు చరిత్రతోనే పెనవేసుకొని పోయిన ఈపరిశ్రమమగురించి తెలుసుకొనడం ప్రతివారికీ ముఖ్యము.

కొంటేగాని ఈపరిశ్రమ పరిశీలన సమగ్రంకాదు. కాబట్టి వాటిని తెలుసుకొందాము.

1. త్రోషటిల్, లేక చేతిమగ్గం :—

ఇది అతి ప్రాచీనకాలపు మగ్గం. యిప్పుడు దీనిని ఎవరూ వాడడంలేదనే చెప్పవచ్చును. అందువల్ల దీనికి సంబంధించిన ఆర్థిక విషయాలను యిక్కడ చర్చించనక్కరలేదు. కాని కొన్నిరకములను— ముఖ్యంగా ఖారీఖరీదయిన జలతారు జిలిబిలి కళలతో కూడిన వాటిని — నేయడానికిమాత్రం వినియోగిస్తున్నారు.

2 ఫ్లయ్‌షటిల్ లేక కుచ్చులాగే మగ్గం :—

పాతకాలపు త్రోషటిల్‌మగ్గాలను మానివేసినతర్వాత దేశం మొత్తంపై ఎక్కువ వ్యాప్తిలోవున్న మగ్గములు యివే.

ఈ మగ్గంపై రోజుకు 6 మొదలు 12 గజాలవరకు సులభంగా నేయవచ్చును. కనీసం రోజుకు 6 గజాలవంతున నెలకు 25 రోజులలో 150 గజాలు తయారగును. అంటే నాలుగు నూలుపెట్టెలు వినియోగించబడునన్నమాట. లడీ 1కి 0-6-0 వంతున ఈ 80 లడీలకు నెలకు రు. 30-0-0 కూలి కిడుతుంది. తగిన మార్కెటింగు సౌకర్యం లేనందున యింతమాత్రం కూలి గూడా ఆర్జించలేకపోయాడు. ప్రస్తుత పరిస్థితులలో నెలలో రెండు పెట్టెలకంటే ఎక్కువగా—సగటున—వాడలేకున్నాడు.

ఎక్కువ నగిషీపనివున్న బట్టకయితే కొంత ఎక్కువకూలి కిడుతుంది. ఈ మగ్గం ఖరీదు రు. 30-0-0 లు మాత్రం. రు. 50

నుండి 100 రూపాయల పెట్టుబడితో దీనివల్ల పని చేసుకో వచ్చును.

3. మలబార్ ఫ్రేంలూము :—

దుప్పట్లు, మేజాగుడ్డలు, సోఫాకవర్లు, షర్టింగులు, కోటింగులు, తువ్వాళ్లు మొదలైనవి ఈ మగ్గంపై నేయవచ్చును. కష్టమయిన నగిషీపనులుగూడా ఈ మగ్గంపై నేయవచ్చును.

సాధారణంగా దీనిపై నెలకు 150 గజాలగుడ్డ నేస్తారు. రోజుకు 8 గంటలచొప్పున పై చెప్పిన రకాలను ఆరుగజాలు సులభంగా నేయవచ్చును. గజానికి దాదాపు 0–6–0 చొప్పున నెలకు రు. 56–4–0 వస్తుందన్నమాట. కాని, ఆచరణలో రంగు నూలు దొరకనందువల్లను, యితర కారణాలవల్లను సగటున నెలకు 45–0–0 కంటే కిట్టదు.

4. పికప్ స్పీడ్‌లూం లేక పెడల్ మగ్గం :—

పెడల్ త్రొక్కుతూవుండడంవల్ల ఈ మగ్గం దానంతట అదే ఆడుతుంది. దీనిని నేయడంలో చేతులకు పనివుండదు. నేసినబట్ట దానంతట అదే మొద్దు (లేక దోనె) కు చుట్టుకొంటుంది. అయితే ఫ్రేంమగ్గాలపై వలే జటిలమయిన నగిషీపనులు ఈ మగ్గాలపై నేయడం సాధ్యంకాదు. ఫ్రేం లూంపై రోజుకు 6 గజాలు నేయడం సాధ్యమయితే దీనిపై రోజుకు 16 గజాల చొప్పున నేయవచ్చును. ఈ మగ్గంపై ఒక ధోవతినినేస్తే గజానికి 0–1–9 చొప్పున 16 గజాలకు 1–12–0 కూలి కిడుతుందన్న

మాట. దీనినిబట్టి నెలకు 25 రోజులు పనిచేస్తే రు. 43-12-0 సంపాదిస్తాడన్నమాట.

ఈ మగ్గం క్రొత్తగా ప్రవేశపెట్టబడింది. అ. భా. చేనేత బోర్డు ఈ మగ్గాన్ని నిదానంగా ప్రవేశపెట్టడం మంచిదని సూచించినది.

5. (బెనారస్) సెమీ ఆటోమాటిక్ మగ్గం :—

పెడల్ మగ్గంవలెనే యిదికూడా దానంతట అదే పని చేస్తుంది. అయితే పెడల్‌మగ్గం కాలుత్రొక్కుతూ పనిచేయాలి. దీనిని చేతితో వూపుతూ నేయాలి. దీనిమీద రోజుకు 8 గంటలు పనిచేస్తే 8 గజాలు నేయవచ్చును. గజానికి 0-3-0 చొప్పున రోజుకు 1-8-0 కూలివస్తుంది. 25 రోజులకు 37-8-0 వస్తుందన్నమాట.

ఫ్లయ్‌షటిల్ మగ్గంపైనకంటే ఫ్రేంలూం, పెడల్‌లూం, సెమీ ఆటోమాటిక్ మగ్గాలపై ఎక్కువ కూలి సంపాదించడానికి వీలున్నప్పటికీ, ప్రస్తుతం ఈ మగ్గాల సంఖ్య చాలా తక్కువని చెప్పవచ్చును. పెడల్ మగ్గాలు, సెమీ ఆటోమాటిక్ మగ్గాలు యిప్పుడిప్పుడే ప్రవేశపెట్టబడుతున్నాయి. వీటినింకా పరీక్షించిచూడటం పూర్తికాలేదు. (1955 మార్చికి) ఇక యిప్పుడు దేశంలోనున్న ఫ్రేం మగ్గాలు మొత్తం మగ్గాలలో నూటికి ఒకవంతుగూడా వుండవు. అవికూడా ఖులబారులోనే వున్నాయి. వీటిపై తయారయ్యే వస్త్రాలు బస్తీలలోనూ. సగ

రాలలోను ధనవంతులుమాత్రమే కొనేవి కనుక వీటిమార్కెట్టు పరిమితమైనది.

పెడల్ మగ్గంపైన, సెమీ ఆటోమాటిక్ మగ్గంపైన ఎక్కువ ఉత్పత్తికావడానికి అవకాశం వున్నప్పటికీ వీటిలో ఒక అసౌకర్యం వున్నది. శరీరంలోని చేతులు, కాళ్ళు మొదలగు అన్ని అవయవాలకు సమానంగా పనివుండకపోవడమే ఈ అసౌకర్యం. పెడల్ మగ్గంలో పనిఅంతా కాళ్ళతోనే జరగాలి. సెమీ - ఆటోమాటిక్ మగ్గంలో పనిఅంతా చేతులతోనే. యిందువల్ల క్రమేణా చేనేత కార్మికుడు తన ఆరోగ్యాన్ని కోల్పోయే ప్రమాదమున్నది. అంతేకాక పేదలయిన కార్మికులు అయిదారువందల రూపాయలుపెట్టి ఈ మగ్గాలను కొనలేకపోవడా. అందువల్లనే ఫ్లయ్ షటిల్ మగ్గాలే 100 కి 95 వంతులుగా మనకు కన్పిస్తుంటాయి. ఈ మగ్గానికి చేతులు, కాళ్ళు మొదలయిన అవయవాలన్నింటికీ సమానమైన పని వుంటుంది. కనుక శరీరారోగ్యమూ, అంగసౌష్ఠవమూ చెడక పోవడం ఒక విశేషణము. మగ్గం ఖరీదుకూడా తక్కువే కనుక అందరికీ అందుబాటులో వుంటుంది. పెక్కురకాల వస్త్రాలను దీనిపైకూడా నేయవచ్చును. దీనిమీద సాధారణంగా నెలకు రు. 30-0-0 లు సంపాదన వుంటుంది.

ఇది ఆర్థికంగా సౌష్ఠవముగలది. సుందరమైన, సున్నితమయిన వస్త్రాలను నేయడానికి చేనేత కార్మికుడు సిద్ధంగా

వున్నాడు. కాని, ఆ వస్త్రాలను విక్రయించడమనేది ఒక సమస్యగా వుంది.

నూలుసప్లయి తగినంత లేక, ప్రభుత్వంవద్దనుంచి రక్షణలుపొందే మిల్లులపోటీకి ఆగలేక, ప్రభుత్వపు సవతితల్లి ప్రేమవల్ల చేనేత కార్మికులు ఎంతో దుస్థితికివచ్చారు. తొలి పంచవర్ష ప్రణాళిక ఆఖరుకు (1956 మార్చికి) మిల్లులు 470 కోట్ల గజాలనూ, చేనేత పరిశ్రమ 170 కోట్ల గజాలనూ ఉత్పత్తి చెయ్యాలని లక్షింపబడగా మిల్లులు 1954 కే ఈప్రమాణాన్ని దిగమించి 500 కోట్ల గజాలకుపైగా ఉత్పత్తి చేసినాయి. చేనేతలో 120 కోట్ల గజాలు కూడా ఉత్పత్తికాలేదు. దీన్నిబట్టి కూడా మిల్లు, చేనేత శాఖలలో దేనిపట్ల ప్రభుత్వానికెంతెంత ప్రేమవున్నదీ స్పష్టం కాగలదు. పైగా బర్మా, యిండోనేషియా, తూర్పు పాకిస్తాన్ వంటి దేశాలకు చిరకాలంగా జరుగుచుండిన ఎగుమతులు నిలిచిపోయాయి. తమ దేశాలలోని చేనేత పరిశ్రమకు రక్షణ కల్పించడానికి ఆదేశాలవారు వీటిపై నిషేధం పెట్టారు. కాని, మిల్లుల ఎగుమతులకు మాత్రం యిట్టి పోటీలేదు.

విదేశాల మార్కెట్లు లేనందువల్ల, దేశంలోని మార్కెట్టుపైనే చేనేత పరిశ్రమ ఆధారపడవలసి వస్తున్నది. ఈపరిస్థితిలో చేనేతకు బ్రతుకుతెరువు కల్పించే విషయమై యిండియా ప్రభుత్వము, ప్లానింగు కమిషనూ ప్రత్యేకంగా శ్రద్ధ

వహించాలి. ధోవతుల, చీరల నేతను చేనేత పరిశ్రమకే కేటాయించాలనీ, బట్టల మిల్లులకు దొరికే ధరలకే నూలు సప్లయి చేయాలని చిరకాలంగా ఆందోళన సాగుతూనేవున్నది. మరియు టెక్స్టైలు మిల్లులవల్ల జరిగేదానికంటే పవరు మగ్గాలవల్ల చేనేతకు కలుగుతున్న హాని ఎక్కువగా వున్నది; కనుక, వాటిని చేనేత పరిశ్రమతో జతపఱచగూడదు. (ప్రస్తుతం దేశంలోగల సుమారు 24000 పవర్ మగ్గాలను "కుటీర మరమగ్గాలు" అనే శీర్షికక్రింద చేనేత మగ్గాలతోపాటు కలిపి వాడబడుతున్నది)

పైన చెప్పినట్లు చీరలు, ధోవతులు చేనేతకు ప్రత్యేకించినప్పటికీ 50 కోట్ల గజాలను మాత్రమే నీరికి కేటాయించినట్లవుతుంది. మిల్లుల మొత్తం ఉత్పత్తి (500 కో.గ.) లో యిది 10 వ భాగం మాత్రమే. అందువల్ల అవి పొందే పెద్ద నష్టంవుండదు.* అలాగే సెస్సునిధిని గుడ్డ కొనుగోలుపై రిబేటుగా యిస్తున్నారు. అదైనా 100 కి 25 వంతులు మాత్రమేవున్న సహకార రంగం ఉత్పత్తిపైన మాత్రమే. తక్కిన 75 వంతులుగల షావుకార్ల బయటివారికి యిందులో దమ్మిడీకూడా రావడంలేదు. కాబట్టి నూలు ధరల కిట్టుబాటులో మిల్లులకు, చేనేతవారికిగల తేడాను

* చేనేత పరిశ్రమకు చీరలు, ధోవతులు రిజర్వుచేయాలని ప్రభుత్వాన్ని కోరే ఒక అనధికార తీర్మానమును శ్రీ శివమూర్తిస్వామిగారు పార్లమెంటు (లోకసభ)లో 27-8-1954 నాడు ప్రతిపాదించారు. కాని కేంద్ర మంత్రివర్గం ఈతీర్మానంపట్ల ప్రాతికూల్యముగా నున్నందున అధిక సంఖ్యాబలంతో తీర్మానం ఓడిపోయినది.

"నూలు కొనుగోలుపై రిబేటు" ద్వారా పూరించితే మొత్తం పరిశ్రమకంతా లాభిస్తుంది. ఏవో పైపై "చిట్కా"లవల్ల చేనేతను మురిపింపజూస్తే ప్రయోజనం వుండదు. వీటివల్ల రెండు కోట్లమంది చేనేతవారికి నిఖరమయిన జీవనోపాధి లభిస్తుంది. అంతేగాక నిరుద్యోగం అరికట్టబడుతుంది. కాబట్టి, ప్రభుత్వం ఎంత ఆర్థికసహాయం చేసినా పైపై పూతలద్వారా సమస్య శాశ్వతపరిష్కారం దొరకదు. ప్రజలుకూడా చేనేత వస్త్రాలను ఆదరించి ఈ ప్రాచీన పరిశ్రమను, అధికసంఖ్యాకుల వృత్తిగా వున్న పరిశ్రమను పోషించాలి.



పదహారవ ప్రకరణం.

# అంబర్ చరఖా

ఆలిండియా స్పిన్నర్స్ అసోసియేషన్ (అ. భా. వడుకు వారల సంఘం) యిటీవల అ. భా. సర్వసేవాసంఘంలో విలీనం చేయబడింది. ఈ అసోసియేషన్ ఉన్నప్పుడు చాలాకాలంపాటు పరిశోధనలు చేసి చేసి, ఈ చరఖాను అభివృద్ధి చేయడమైనది. 1954 ఏప్రిల్‌లో అ. భా. ఖాదీప్రదర్శనం కొత్తఢిల్లీలో జరిగి నప్పుడు మొట్ట మొదటిసారిగా దీనిని ప్రజలు చూచినారు. ఏకాంబరనాథన్ అనే ఆయన దీనిని రూపొందించినందున ఈ పేరు వచ్చింది. (ఈయనది తమిళనాడు)

మహాత్మా గాంధీజీ యిట్టిచరఖాను కనిపెట్టితే ఒక లక్ష రూపాయలు బహుమానం యివ్వబడునని ప్రకటించిరి.

అంబర్ చరఖా నాలుగు భాగములుగా వుండును.

1. దునియాముడి :- యిది దూదినిఏకు సాధనం. మొదట గింజలులేని ప్రత్తిని మెత్తగా చేయడానికి రాట్నం వంటి సాధనం (ఎలుక బోనువంటి పెట్టెలో) దూదిని చక్కగా మెత్తగా చేయవలెను.

2. పట్టా :- రెండడుగుల పొడవు, 3 అంగుళాల వెడల్పుగల ఒక తొట్టిలో దూదినిపెట్టి అంతే వెడల్పు పొడవుగల ఒక

పలకతో నొక్కవలెను. అందువల్ల దూది ఒక పరుపుగా అంటే పట్టాగా తయారగును.

3. బ్యాలనీ :- పట్టాను యిందులో పెట్టి ఒక యూనిఫారం (ఒకే మందంలో)గా 3 అంగుళాల వెడల్పుతో గుడ్డమాదిరిగా తయారగును. యూనిఫారంగా వచ్చేందుకుగాను 3 లేక 4 నాలుగుసార్లు కూడా త్రిప్పవలసివచ్చును.

తర్వాత $\frac{1}{2}$ అంగుళం వెడెల్పుతో మేకుల మధ్య పెట్టి త్రిప్పగా అది ఏకుగామారును. అయితే అది యూనిఫారం (సమానంగా ఒకే మందంలో)గా వుండదు. ఒకచోట లావు సన్నముగా వుంటుంది. అటువంటి ఏకులు మూటిని కలిపి త్రిప్పి మరీ ఏకుగా ఏకవలెను.

4. చరఖా :- ఆ ఏకును నూలుగా రాట్నం (చరఖా) పై దారం తీయవలెను.

అంబర్ చరఖాపై 24 నెంబరు నూలువరకు సాధారణ [redacted] వడకవచ్చును.

20 వ నెంబరు చిలపలు (చిట్టె) చిలప 1కి 0-2-9 వంతున 20 చిలపలు రు 3-7-0 కు అంబర్ చరఖా కేంద్రాలు నూలును కొంటాయి. ఈ 20 చిలపలకు ఒక పౌను దూది కావలెను. దీని ఖరీదు రు 1-0-0 ఈ ఖరీదు పోగా 20 చిలపలకు రు 2-7-0 కూలి కిట్టుతుంది. 2 నెలల శిక్షణ పొందిన తర్వాత గంటకొక 20 నెంబరు చిలప వడకవచ్చును. ఆలె

క్కన రోజుకు 10 చిలపలు వడకగలిగితే రు 1-3-6 కూలి కిట్టుతుందన్న మాట.

ఈ చరఖాపై పాతచరఖాకంటే 5 రెట్లు నూలు అధికంగా నూలు వడకవచ్చునని అంచనా వేయబడుతున్నది. ఖద్దరు గజము 1కి ఎంత ఖరీదవునో దానిలో సగమే అంబర్ ఖాదీ గజము ఖరీదు అగునని కూడా అంచనా వేయబడుతున్నది.

పల్లె ప్రాంతాల్లోనూ, పట్టణ ప్రాంతాల్లోనూ కూడ పూర్తి నిరుద్యోగసమస్యకూ, అర్ధ నిరుద్యోగసమస్యకూ పరిష్కారమార్గంగా యిది సూచించబడుతున్నది. అ. భా. ఖాదీ బోర్డువారు ప్లానింగ్ కమీషనుకు దాఖలుచేసిన (రెండవ ప్రణాళికా కాలానికి) అంబర్ చరఖాస్కీము ప్రకారం రానున్న ఐదేండ్లలో 25 లక్షల చరఖాలను దేశమంతటా పంచి 50 లక్షల మందికి ఉపాధి కల్పించవచ్చునని 150 కోట్ల గజముల అంబర్ ఖాదీగుడ్డ తయారు చేయవచ్చునని సిఫార్సు చేసినారు. యింకా అదనంగా ఈస్కీమువల్ల 12 లక్షలమంది చేనేత వారికి, 72 వేల మంది వడ్రంగులకు 40 వేలమంది యితర పనివారలకు, 20 వేల మంది పరిపాలన, వ్యాపార రంగములలోని మనుష్యులకు పని కల్పించగలదని కూడ సిఫార్సు చేయబడినది. వడుకువారికి రోజుకు రు 0-12-0 వంతున ఆదాయ ముండునని అంచనా వేయబడింది.

ఈ చరఖాలను విద్యుచ్ఛక్తితో నడపగల అవకాశం కూడా లేకపోలేదు. అసలు యిప్పుడున్న రూపంలోనే చేతి వడుకు పరిశ్రమలో అంబర్ చరఖా ఒక పెద్ద విప్లవమని చెప్పవచ్చును. ప్రభుత్వంగాని ప్రజలుగాని దీనిని త్రోసివేయడానికి వీలు లేదు.

కోట్లకొద్దీ జనం నిరుద్యోగంతో బాధపడుతున్న మన దేశంలో భారత రాజ్యాంగంలో శరీరదారుఢ్యమున్న ప్రతి పౌరునికీ ప్రభుత్వం పూర్తి ఉద్యోగావకాశమును కల్పించవలెననే ఆదేశ మిచ్చిన తర్వాత, ఆవడి కాంగ్రెసు మహాసభలో (1955 జనవరి) 10 సం॥లోపున నిరుద్యోగ సమస్యను పూర్తిగా పరిష్కరిస్తామనే వాగ్దానమిచ్చిన తర్వాత అంబర్ చరఖా లేకుండా ఈవాగ్దానం నిలబెట్టుకోగలమా అని కాంగ్రెసు అగ్ర నాయకులు చాలమంది భావిస్తున్నారు. సాలీనా భాతర కార్మిక రంగంలోనికి 18 లక్షలమంది క్రొత్తగా ప్రవేశిస్తున్నారు. అదివరకటి నిరుద్యోగులకూ, ఈక్రొత్తవారికీ మిల్లులలో పని కల్పించడం అసంభవము. కోటానుకోట్ల వ్యయంతో నిరుద్యోగ భృతిని యివ్వడం అంతకంటే అసంభవము.

అ. భా. ఖాదీబోర్డు లెక్కల ప్రకారం మిల్లుగుడ్డకన్నా అంబర్ గుడ్డ గజానికి 0-4-0 మాత్రమే ఎక్కువధర అవుతుంది. కాని, ఈనాడు శుద్ధఖద్దరుకు, మిల్లు గుడ్డకూ గజానికి రు 1-4-0 తేడావున్నది. అంబర్ చరఖాలో యింకా ఎక్కువ అభివృద్ధికి పరిశోధనలు జరుగుతున్నవి. అవి సఫలమయిన తర్వాత అంబర్

ఖాదీగుడ్డ మరికొంత చవక కాగలదని అంచనా వేయబడు తున్నది.

## అంబర్ చరఖా కమిటీ.

యిండియా ప్రభుత్వంవారు "అంబర్ చరఖాకమిటీ"ని శ్రీ ఖేరా అనే ఆయన అధ్యక్షతక్రింద వేశారు. ఈ కమిటీ వారుచేశిన సూచనలను ప్రభుత్వం ఆమోదించింది. అంబర్ చరఖాను ఆర్థిక, సాంకేతికదృష్ట్యా పరిశీలించి తగు సూచనలు చేయడానికి ఈకమిటీనివేశారు. వీరు 43 సిఫార్సులను చేశారు. యిందులో ముఖ్యమైనవి:—

1. సాధారణంగా ప్రత్తి ఎక్కువగా ఎక్కడ స్థానికంగా లభిస్తుందో, చేమగ్గాలు ఎక్కడ ఎక్కువగా వుండునో, నిరుద్యోగం ఎక్కడ హెచ్చుగావుందో అలాంటిచోట్ల మాత్రమే ముందుగా అంబర్ చరఖా ప్రవేశపెట్టనగును.
2. అంబర్ వడకు, అంబర్ నేత రెంటినికలిపి స్కీములు తయారుచేసి వడికిన నూలుగాని, నేసిన బట్టగాని స్థానికంగానే పూర్తిగా వినియోగమయ్యే కేంద్రములలో మాత్రమే మొదటదీన్ని ప్రవేశ పెట్టవలెను.
3. 1956–57 సంllలో దేశంలో 75000 చరఖాలను ప్రవేశ పెట్టవలెను. దాని ఫలితాలను 1956 డిశంబరు నాటికే పరిశీలించి 1957–58 కి, 1958–59 కి ప్లానులు తయారు చేయాలి. 1957–58 లో 2 లక్షల చరఖాలు క్రొత్తగా ప్రవేశపెట్టవలెను.

4. ముఖ్యముగా కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలోనూ, జాతీయవిస్తరణ బ్లాకులలోను ఈకార్యక్రమం అమలు జరుపవలెను.

5. సహకార సంస్థలద్వారా ఈకార్యక్రమం నిర్మించవలెను.

6. మూడు నెలల శిక్షణ అయిన తర్వాత దీనినివడికే ప్రతి వారికి వెంటనే ఒక చరఖాను అప్పుగా యిచ్చేది. శిక్షణానంతరం ఒక సర్టిఫికెట్టు (ధృవపత్రం) కూడా యివ్వవలెను.

7. శిక్షణకయ్యే ఖర్చుయావత్తు ప్రభుత్వమే భరించవలెను.

8. ప్రభుత్వం తన వస్త్ర అవసరములను సాధ్యమైనంత హెచ్చుగా అంబర్ వస్త్రములద్వారా తీర్చుకొనవలెను.

9. ప్రస్తుతము 1-0-0 1కి 0-4-0 చొప్పున అంబర్ గుడ్డపై రిబేటుయిచ్చి క్రమంగా దాన్ని 0-2-0 చేసి చివరకు రిబేటు అవసరంలేని స్థితిని కల్పించవలెను.

10. అప్పుగా యిచ్చిన చరఖాసొమ్ము (సుమారు 75-0-0) ను 5 సాలుసరి వాయిదాలలో తీర్చుకోవలెను. కాని రెండేండ్లు గడచిన తర్వాత చరఖాను పూర్తిగా శ్రద్ధగా వినియోగిస్తున్నట్లు రుజువయితే బహుమానముగా తక్కిన మూడుకంతుల బాకీని కొట్టివేయుటకు ప్రభుత్వం సిద్ధంగా వుండవలెను.

11. అంబర్‌గుడ్డ సాలుకు ఎంత ఉత్పత్తి అవుతుందో అందులో 100కి 60% వర్కింగ్ కాపిటలుగా ధనమును వడ్డీలేని

అప్పుగా యివ్వవలెను. అనగా ఆరుమాసముల కొక మారు పనిని సమీక్షించుకొంటూ ఒక ఛైర్ఖా సెట్టుకు మొత్తము రు 500 లు చొప్పున యివ్వవలయును.

12. ఈ చరఖాలను సాధ్యమయినంతవరకు చేనేతవారికే ఎక్కువగా యివ్వడానికి కృషిచేయవలెను. చరఖాలు యివ్వబడిన కుటుంబాలలో 100 కి 75 చేనేత కుటుంబాలు అయియుండవలెను. క్రమంగా ఈ చరఖాలేని చేనేత కుటుంబమంటూ వుండరాదు.



# పదిహేడవ ప్రకరణం.

# ఖాదీ పరిశ్రమ.

రాట్నము: జాతీయోద్యమము.

ఆవిరితోను, విద్యుత్ శక్తితోను నడిపే యంత్రాలు మన దేశానికి రాకపూర్వం చేతి రాట్నంతో నూలువడికి, చేతి మగ్గంతో బట్టలు నేసే పరిశ్రమ చాలా అభివృద్ధిలో వుండేది. దీనిని పునరుద్ధరించడానికి చేసిన జాతీయ కృషినే ఖాదీ ఉద్యమం అన్నారు. తీరికకాలాన్ని వినియోగించి, అల్పాదాయమొచ్చినా చాలుననే వారికి, పెట్టుబడి (దాదాపు) లేకండా, సులభంగా నేర్చుకోదగినది రాట్న పరిశ్రమ. నిరుద్యోగంతో కల్లోల మవుతున్న మన దేశానికి దీన్ని తిరిగి పైకి తేవడమొక్కటే తరుణోపాయమని గాంధిజీ – తాను అప్పటికి రాట్నాన్ని చూడక పోయినా – 1908 లో "హింద్ స్వరాజ్" అనే గ్రంథంలో వ్రాసేరు. తరువాత సబర్ మతి ఆశ్రమం నెలకొల్పినాక రాట్నాలను ఆయన ప్రవేశపెట్టినారు.

1921 లో సహాయ నిరాకరణోద్యమంతోపాటు ఖాదీ ఉద్యమం కూడ నిర్మాణయుతంగా ప్రారంభింపబడింది. అఖిల భారత కాంగ్రెస్ కమిటి 1921 మార్చిలో బెజవాడలో సమావేశమైనపుడు కాంగ్రెస్‌లో సభ్యత్వానికి ఖాదీ ధారణ ఒక

షరతుగా పెట్టి, దేశంలో 20 లక్షల రాట్నాలు ప్రవేశపెట్టాలని తీర్మానించినారు. 1921 నుండి 1925 వరకు అ॥భా॥కాంగ్రెస్ స్వంతబాధ్యతతో ఖాదీ పరిశ్రమాభివృద్ధికి పాటుబడి, 1925 లో అ॥ భా॥ చరఖాసంఘమనే అనుబంధ సంస్థను స్థాపించుకొని దానికీ బాధ్యత నప్పగించింది.

వడికేవారికి కనీసవేతనం - స్వావలంబనం :-

ఖాదీ పరిశ్రమలో 1921-45 మధ్య పాతికేళ్ళలో వచ్చిన పరిణామాలనుబట్టి గాంధిజీ మూడు దశలలో మూడు పద్ధతులు అమలు జరిపేరు. నిరుపేదల కుపాధి కలిపించడమే ప్రధానంగా 1933 వరకు మొదటిదశ గడిచింది. ఆ దశ అంతకీ కలిపి అయిదున్నర కోట్ల రూ॥ ఖాదీ మాత్రమే అమ్మినప్పటికి క్రమంగా పెరుగుతున్న కారణంచేత కేవలం లాభాపేక్షతో పెట్టుబడిదారులీ వ్యాపారంలో ప్రవేశించేరు. వడికేవారికి తక్కువ కూలిచ్చి వ్యాపారులెక్కువ లాభం తీసుకోడం ఒక సమస్య అయింది. అందువల్ల గాంధీజీ ఒక కనీసవేతనం నిర్ణయించి, ఆ ప్రకారం తయారుచేసినట్టు ధృవపత్రాన్ని (సర్టిఫైడ్) ఇచ్చిన ఖాదీని కాంగ్రెస్ సభ్యులు ధరించవలెనని నిబంధనలు సవరింపజేసేరు. ఇది రెండవ దశ. దీనివల్ల అ॥ భా॥ చరఖాసంఘం ఉత్పత్తి పడిపోయి విస్తారంగా ప్రైవేటు వర్తకుల ఖాదీ దుకాణాలు వ్యాపించాయి. ఇంతలో రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. మిల్లుగుడ్డ కఱువైంది. ఇతర చేనేత గుడ్డలుగూడ ధరలు పెరిగేయి. కాని అ॥ భా॥ చ॥ సం॥ వారు మాత్రం నియమిత

ధర్మాలు ప్రకారం మామూలు లాభాలకే అమ్మడంవల్ల వారి ఉత్పత్తి అమ్మకం మరల పెరిగింది. 1941-42 లో ఒకటిన్నర కోటి రూ॥ అమ్మినది. ఇంకా పెరిగివుండును. గాని, యింతలో "క్విట్ ఇండియా" ఉద్యమం రావడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధ విధానం అవలంబించి కాంగ్రెస్ కార్యకర్తలతోపాటు ఖాదీ కార్యకర్తలను గూడ జైళ్ళలో పడవేసింది. బైట మిగిలి వున్న కొద్దిమంది కార్యకర్తల తీవ్రకృషికి దేశంలోని సామ్రాజ్య వ్యతిరేక పోరాట వాతావరణం తోడై మొత్తంమీద 1935-45 మధ్య పదికోట్ల రూ॥ సర్టిఫైడ్ ఖాది అమ్మింది. క్విట్ ఇండియా ఉద్యమం, యుద్ధము తగ్గిపోయేక చరఖాసంఘ ఖాదీ కన్న ప్రైవేటు వర్తకుల ఖాది మరల మార్కెటులో ఎక్కువ చలామణి అయింది. సర్టిఫై కాని దానినే తక్కువధరకు కొని, ధరించి, దానిని సర్టిఫై అయిన దేసుమా అని బుకాయించే అవ కాశం వుందిగదా! 1945 లో మూడవ దశ ప్రారంభమైంది. ఏ వ్యక్తి స్వంతంగా కొంతైనా వడికిన నూలును సర్టిఫైడ్ ఖాది ఖరీదులో భాగంగా యిస్తాడో అతనికే ఖాది అమ్మమని "స్వావ లంబన" విధానం ఆచరణలో పెట్టేరు. దీనివలన మరల ఉత్పత్తి తగ్గింది. 1945-50 మధ్య ఆరుకోట్ల రూ॥ లోపుమాత్రమే.

ఖాదీబోర్డు నిర్మాణం :-

ఖాదీపట్ల జాతీయోద్యమ చరిత్రరీత్యా రాజకీయాను రాగం కాంగ్రెస్ ప్రభుత్వాలకుండడం న్యాయమేగనక దీని

నిర్మాణంలోని పునాదులను దృఢపరచ దలచుకొని, కేంద్ర ప్రభుత్వం వాణిజ్య-పరిశ్రమల మంత్రిత్వశాఖక్రింద అఖిలభారత ఖాది, గ్రామీణ పరిశ్రమలబోర్డును 1953 జనవరిలో స్థాపించింది. చరఖాసంఘం తన లావాదేవీలన్నీ బోర్డుకు అప్పగించి తాను రద్దయిపోయింది. బోర్డు పథకాలు తయారుచేసింది. 1954-55 లో నాలుగున్నర కోట్ల రూ॥ ఖాది అమ్మడానికి, 1958-59 నాటికి ఇరవైఅయిదు కోట్ల రూ॥ అమ్మడానికి లక్ష్యం పెట్టుకున్నది. ఈ లక్ష్యం సాధించడానికి బహుముఖమైన కార్యక్రమం ఏర్పర్చింది. వివిధ ఉత్పత్తి దశలలో కొత్త పరిశోధనలు, ప్రదర్శనశాలల, ఎంపోరియంల స్థాపన, రూపాయి అమ్మకం మీద మూడణాలు రిబేటు, వగైరా వగైరా.

రూపాయికి మూడణాలు రిబేటు యిచ్చినా యింకా ఖాదీ యితర వస్త్రాలకన్నా ఖరీదెక్కువే. కొద్దికాలంలో పాత రాట్నాన్ని రద్దుచేసి అంబర్ చరఖాను సర్వవ్యాపితం చేస్తే ఖాదీ ధర తగ్గుతుందని బోర్డు తీవ్రకృషి చేస్తున్నది.

ఖాదీ కమిషన్:-

పార్లమెంటులో తీర్మానంద్వారా ఏర్పడితే బోర్డవుతుంది. చట్టంద్వారా ఏర్పడితే కమిషన్ అవుతుంది. బోర్డు సలహాలిస్తే వాటిని పరిశీలించి, వడపోసి, ప్రభుత్వం వాటి నమలుపర్చడానికి డబ్బు యిస్తుంది. గత మార్చిలో ప్యాస్ చేసిన చట్టంప్రకారం ది 1-4-57 నుండి ఖాది, గ్రామీణ పరి

శ్రమల కమిషన్ ఏర్పడి పనిచేస్తున్నది. వెనకటి బోర్డు కూడా వున్నది. బోర్డు సిఫారసులను ప్రభుత్వానికి బదులు కమిషన్‌కు నివేదిస్తుంది. వాటిని వడపోసి కమిషన్ అమలు జరుపుతుంది. కమిషన్‌కు డబ్బు యిచ్చివేసి ప్రభుత్వం తన బాధ్యతలను తగ్గించుకున్నది.

కాలేగారి రాట్నం :—

అంబర్ చరఖా గాక "కాలే" గారి రాట్నమొకటి ఉన్నది. శ్రీ జి. బి. కాలే—మెకానికల్ ఇంజనీర్. మొదట సబర్మతి ఆశ్రమంలో వుండి తరువాత కిర్లోస్కర్ బ్రదర్సు లిమిటెడ్ కంపెనీలో పనిచేసిన ఆయన 10 కదుళ్ళు గలిగినది కని పెట్టేరు. బొంబాయి ప్రభుత్వం ఆదేశానుసారం ఒక కమిటీ దీనిని పరీక్షించి "ప్రోత్సహించదగినదే" అని సిఫారస్ చేసింది. దీనికి మోటారుయంత్రం తగిలించి-మొత్తం రు. 1000/- ఖరీదు లోనికి-వేలకొలది తయారుచేస్తే-తీసుకుని రావచ్చునన్నది. కదురు 1కి 8 గంటలలో 16 నెంబరు నూలు 5 ఔన్సులు చొ॥ తయారు చేసింది. చేనేత కనుకూలంగా వుంది నూలు. ఒక చేనేత కుటుంబం ఇదిన్ని చేమగ్గాన్ని రెండూ పెట్టుకొని అందరూ పనిచేసుకుంటే రోజుకు రు. 7/- సంపాదించుకోవచ్చునన్నాడు బొంబాయి కోఆపరేటివ్ జాయింట్ రిజిస్ట్రార్. పేదకుటుంబాలు, విద్యుత్‌శక్తి లేని గ్రామాలు వీటిని ఉపయోగించుకోలేక పోయినా అవకాశమున్నచోట అమలులోకి తీసుకురావచ్చునని

శ్రీ వి. యల్. మెహతాగారన్నారు. ఈయన నేటి ఖాదీ కమిషన్ అధ్యక్షులు.

ఒక మామూలు చేతిమగ్గానికి సరిపడిన నూలు ఒక అంబర్ చరఖా ఇవ్వగలదని, ఒక ఆధునిక "బనారస్" చేనేత "ఆటో" మగ్గానికిగాని, ఒక పవర్ మగ్గానికి గాని సరిపడగా 40 కదుళ్ళు కలిగిన "కాలేగారి రాట్నం" నూలు యివ్వగలదని అంచనా వేయబడింది. నూలు ఇంకా బలంగా వుండడానికి ఈ రాట్నంలో పరిశోధనలు మరికొన్ని జరుగుతున్నాయి.

అఖిలభారత అంకెలు.

| | 1953-54 | 1956-57. |
|---|---|---|
| ఉత్పత్తి (వ్యాపారం) చతురపు గజాలు | 1 కోటి | $1\frac{1}{2}$ కో. |
| (స్వావలంబనం) ,, | $\frac{1}{2}$ కోటి | $8\frac{1}{2}$ కో. |
| (వ్యాపారం) రూపాయలలో | $1\frac{1}{2}$ కోటి | 3 కో. |
| (స్వావలంబనం) ,, | 12 లక్షలు | $1\frac{1}{5}$ కో. |
| అమ్మకం – చిల్లరగా రూపాయలు | 1 కోటి | $4\frac{3}{4}$ కో. |
| ప్రభుత్వ టెండర్లు (అంగీకరింపబడినవి) కు | 4 లక్షలు | 1 కో. |
| (సాధారణంగా రైల్వేలకు 45 శాతం, పోస్టు టెలిగ్రాఫ్ శాఖకు 40 శాతం, మిగతావాటికి 15 శాతం) | | |
| ఉద్యోగం (వడుకువారు) | 3 లక్షలు | 7 ల. |
| (నేయువారు) | 18 వేలు | 78 వే. |
| (ఇతరులు) | 10 వేలు | 22 వే. |

పనివారి కిట్టుబాటు:—

హైద్రాబాద్ ఖాదీ సమితివారు 1956–57 లో 745 మంది వడికేవారికి రు 1,50,000 కూలి యిచ్చేరు; అనగా మనిషికి సాలుకు రు 202/-లు. తరువాత 40,600 మంది వడికే వారికి 9 లక్షల రూపాయిల కూలి యిచ్చేరు; అనగా మనిషి 1కి సాలుకు రు 22/- ఇకను 1875 మంది చేనేతవారికి 5 లక్షల రూ॥ కూలి యిచ్చేరు; అనగా మనిషి 1కి సాలుకు రు 267/-.

ఇందులో వడికేవారు (అంతా స్త్రీలే) యితరపనులు చేసుకుంటూ మధ్య మధ్య రాట్నం వడుకుతారన్న సంగతి అందరికి తెలుసు. కాని, ఏకేవారు నేసేవారు కూడా యీ ప్రాంతంలో వ్యవసాయమాసములలో వ్యవసాయపు పనులే ఎక్కువ చేసుకుంటూ మధ్య మధ్య యీ పనులు చేస్తారని మిగతా మాసములలో పూర్తిగా యీ పనులే చేస్తారని చెప్ప బడింది.

ఖాదీ కమిషన్ ఆధ్వర్యం క్రింద నున్న ఖాదీ పరిశ్రమ ప్రభుత్వ రంగం అని చెప్పవచ్చు. ఇంతవరకు దీనిలో పనిచేసే చేనేతవారందరికి సాధారణంగా నిరుద్యోగం లేకండా పని వుంటూవున్నది. మనిషికి కడుపునిండా రెండుపూటలు భోజనం యివ్వగలిగినది కనీసవేతనమని గాంధీగారు వెనక చెప్పినదానిని పురస్కరించుకుని ఖాదీ చేనేత కుటుంబానికి నెలకు దామా షాను రు 45/- కిట్టేట్టు మజూరీలు నిర్ణయింపబడ్డాయి. ఒక ఖాదీ మగ్గం పనిమీద ఒక మగవాడు రోజుకు 8 గంటలు,

ఒక స్త్రీ 4 గంటలు శ్రమిచేస్తే పేదరికి నెలకు రు 45/- కట్టా లని లక్ష్యం.

60 పినెలుగల ఒక పుంజానికి, ఒక గజం పొడవుకు అయిదు పాతపైసలు (0-0-5) నేతకూలి నిర్ణయించేరు. ఇచ్చే మజూరీలో రూపాయికి 0-1-0 (ఒక అణా) ధరావతుక్రింద మినహాయించుకుంటారు. ఈ ధరావతు నూరు రూపాయలు పెరిగేవరకు మాత్రమే మినహాయించుకుంటారు.

రిబేటు—పూలింగ్ ధర.

ఖాదీమీద ప్రభుత్వం రూపాయికి నాలుగు అణాలు రిబేటు యిస్తున్నది. ఉత్పత్తిమీద 0-0-6, అమ్మకంమీద 0-0-6, చిల్లర అమ్మకంమీద 0-3-0 కేవలం కూలిక్రింద వడికే వారికి, నేసేవారికి, రంగువేసేవారికి యిచ్చేదానితో సబ్సిడి శాతం 35 అయింది.

అంబర్ నూలు-పాతరాటపునూలుతో కలిపి ఒకేబట్టగా నేయించి ఖాదీ కమిషన్ వారు అమ్ముతున్నారు. చాలకాలం నుండి యీ పద్ధతి అమలు జరుగుతున్నది. ఇట్లా కలిపి పూలింగ్ ధర నిర్ణయించినారు. పూలింగ్ ధర అనగా ఉదాహరణ :-

| | |
|---|---|
| (1) పాతరాటపు నూలుతో నేసిన గజంగుడ్డ కిట్టుబాటు ధర. | రు 2-0-0 |
| (2) దీనిమీద రిబేటు | 0-6-0 |
| (3) అంబర్ నూలుతో నేసిన గజంబట్ట కిట్టుబాటు ధర. | 1-4-0 |

| | |
|---|---|
| (4) దీనిమీద రిబేటు | 0–3–9 |
| (5) రెండు గజాలకు మార్కెటు వెల | 3–13–9 |
| (6) దీనిని చెరిసఖం చేస్తే గజం 1కి ఫూలింగ్ ధర | 1–15–0 |

ఒకటవపద్ధు రు 2/- కిట్టినా రు 1–15–0 కే అమ్మివేస్తారు. మూడవపద్ధు రు 1–4–0 కిట్టినా రు 1–15–0 కే అమ్ముతారు.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 1959–60 నాటికి 3,30,000 అంబర్ చరఖాలు అమలులోకి తేవాలని, ప్రత్యేకం ఒక్క అంబర్ నూలుతో నేసిన గుడ్డ 1960–61 నాటికి 30 కోట్ల గజాలవుతుందని, ఆ నాటికిగూడా స్వల్పంగా పాతరాటాలు మిగులుతాయని, వాటి నూలుతో నేసినగుడ్డ 4 కోట్ల గజాలుంటుందని, మొత్తం 34 కోట్ల గజాలు ఫూలింగ్ ధరకు అమ్మివేయాలని ఖాది కమీషన్‌వారు అంచనాలు వేసినారు.

1957 మార్చినాటికి 75000 అంబర్ చర్ఖాలు తయారు కావాలని లక్ష్యం నిర్ణయించుకుంటే 58,103 మాత్రం తయారైనాయి. వాటిలో 38,391 పరిశ్రమాలయాలకు పంచినారు. అందులో మరల 25,472 మాత్రమే తరఫీయతు పొందిన వ్యక్తులకు పంచిపెట్టబడ్డాయి.

కొన్ని మాసములనుండి పనిలోవున్న ఒక్కొక్క అంబర్ చర్ఖా రోజు 1కి 0–8–0 నుండి రు 1–0–0 వరకు కుటుంబానికి సంపాదించిపెడుతూ వున్నదని యిటీవల పరిశోధనలవల్ల తేలినది. దామాషాను 0–12–0 దినసరి ఆదాయం.

ఖాదీ నేతవారి పునరావాసం:–

రాట్నాలుగాని, అబంర్ రాట్నాలుగాని వుండి నేసే వారు లేని గ్రామంలో కొత్తగా ఒక చేనేత కుటుంబం నివాస మేర్పర్చదలచుకుంటే, స్థానిక ప్రజలనుండి స్థలం, కొంప సంపా దించుకుంటే, వృత్తి పునరావాసానికి రు 500/– ఉచితంగా ఖాదీ కమిషన్ యిస్తుంది. రు 200/– నేతపరికరాలకు, రు 100/– కాపురం మార్పిడిలో రాకపోకలు వగైరా ఖర్చులకు, రు 150/– మార్పులోను, యిల్లు కట్టుకోడంలోను నష్టపోయిన పనికి మురరాగాను. రు 50/– మగ్గం వగైరా అమర్చుకోడానికి మొత్తం రు 500/– ఈ విధంగా 1955 లో రు 83000/– ఖర్చు పెట్టబడింది.

సిద్ధాంత భాగం.

జాతీయార్థిక వ్యవస్థలో ఖాదీ కుండవలసిన స్థానమేది? దీనిపట్ల కాంగ్రెస్‌లోనే రెండు వైఖరులున్నాయి. "వస్త్ర స్వావలంబన" విధానంద్వారా సర్వసేవా సంఘంవారు వ్యక్త పరిచే సిద్ధాంత మొకటి. ఇంతకంటె లాభదాయకమైనది వెనక బడ్డ మన దేశంలో కోట్లాది అర్ధనిరుద్యోగులకు ప్రస్తుతం మనం చూపలేముగనక ఖాదీ ద్వారా తాత్కాలిక ఆర్థిక ప్రయో జనం సాధించవచ్చుననే వైఖరి రెండవది.

1938 అక్టోబరులో అనేక రాష్ట్రాలలో కాంగ్రెస్‌వారు మంత్రిపదవులలో వుండగా పరిశ్రమలశాఖ మంత్రుల సమావేశం

ఢిల్లీలో జరిగింది. వారి తీర్మానానుసారం నాటి కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ సుభాష్‌చంద్రబోస్‌గారు ఒక నేషనల్ ప్లానింగ్ కమీషన్ ఏర్పాటుచేసి దానికి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ గారిని అధ్యక్షులుగా నియమించేరు. "దారిద్ర్యానికి, నిరుద్యోగానికి, దేశ రక్షణకు, ఆర్థిక పునరుజ్జీవనానికి సంబంధించిన సమస్యలు పారిశ్రామికీకరణ లేకుండా పరిష్కరించలే"మని తీర్మానించేరు.

నెహ్రూగారి ఆధ్వర్యంక్రింద ఆ ప్లానింగ్ కమీషన్ పని చేస్తుండగానే శ్రీ జె. సి. కుమారప్పగారి ప్రయత్నంమీద జూలై 1946 లో పూనాలో మరొకమారు కాంగ్రెస్ పక్ష పరిశ్రమలశాఖ మంత్రుల సమావేశం నేటి ఒరిస్సా పరిశ్రమల మంత్రి శ్రీ నిత్యానంద కనూంగోగారి అధ్యక్షతను జరిగింది. నేటి ఖాదీ కమీషన్ అధ్యక్షులు శ్రీ వి. యల్. మెహతా గారు అప్పుడు బొంబాయి రాష్ట్రపరిశ్రమల మంత్రిగా ఆహ్వానోపన్యాసం ఆ సభలో చేస్తూ, స్పష్టంగా "ఈ సమావేశ వుద్దేశాలకు ప్లానింగ్ కమీషన్ ఉద్దేశాలకు వైరుధ్యం ఉందని" చెప్పేరు. ఈ పూనా సమావేశంలో "సరియైన ఆహారం, బట్ట, యితర జీవితావసర వస్తువులు ప్రతి పౌరునికి లభ్యమవ్వాలనే లక్ష్యంతో ప్లానింగ్ జరగా"లని తీర్మానించేరు. స్వావలంబన సిద్ధాంతం పూనా సమావేశకర్తలకు దగ్గరగా వుంటుందని చెప్ప వచ్చు. 1946 అక్టోబరులో అఖిలభారత చరఖా సంఘము యొక

తీర్మానం చేస్తూ "చిట్టచివరకు చేతి రాటాన్నే మిగిల్చి నూలు మిల్లులను గూడ తొలగించే లక్ష్యంపైనే ప్లానింగ్ జరగా" లని చెప్పేరు. కాని, కొన్నాళ్ళు పోయినతర్వాత యీ తీర్మానాన్ని పునరాలోచించి "5 ఏళ్ళలో 1 లక్ష గ్రామాలలో 75 లక్షల మంది వడుకువారుండాలని 45000 పాఠశాలలలో వడకడం నేర్పాలని, 7000 ఖాదీ కార్యకర్తలుండాలని, సాలుకు 25 కోట్ల రూ॥ ఖాది ఉత్పత్తి కావా"లని తీర్మానించేరు. గాంధిజీ ఉపదేశములు ప్రకారం అహింస సత్యము రెంటికి ప్రతిబింబము ఖాది. ఖాది ధరించినవారు అసత్యం పలకరు. హింస, దగా చేయరు. ప్రతి గృహంలోను ఎవరికి కావలసినంత వరకైనా వారు స్వయంగా వడుక్కోవాలి. రోజూ అరగంట వడికితే సాలుకు మనిషి 1కి 18 గజాలు గుడ్డ వస్తుంది అని గాంధిగారన్నారు.

రెండవ ప్రణాళికలో భాగంగా పార్లమెంటులో వ్యాసైన (1956) "పరిశ్రమల విధాన ప్రకటన" లోని వైఖరి పై దానికి భిన్నమైనది. వేగంగా దేశం పారిశ్రామికీకరణ కావా లని స్పష్టపరిచేరు. కుటీర పరిశ్రమలు ప్రస్తుతం దేశానికి అనివార్యమే అని అంగీకరించేరు. గాని, గాంధిజీ వాదంలోని నైతిక ధార్మిక విలువల గొడవలోనికి నేటి ప్లానింగ్ కమీషన్‌వారు పోలేదు.